# 'ప్రేమించు పెళ్ళాడు' పాత్రుల గోత్రాలు

ఈ సమాజంలో ఎందరో విచిత్రమైన
మనుషులు. ఎన్నో వింత-వింత
మనస్తత్వాలు. ఎవరి అభి
రుచులు వారివి. ఎవరి
అలవాట్లు వారివి.
ఎవరి ఆచారాలు వారివి.



ఎవరి సంప్రదాయాలు వారివి. వాటిని కొందరు గుట్టుచప్పుడు కాకుండా పాటిస్తారు. మరికొందరు బట్టబయలుగా ప్రకటిస్తారు. ప్రతి నిమిషం పదిమందిలో బాహాటంగా తమ సంప్రదాయాల ఔన్నత్యాన్ని గురించి బాకాలూదుకునే గురివింద పెద్దలూ వున్నారు. అసలవంటే ఏమిటో తెలియకుండానే అడుగడుగునా పాటించి బయటికి చెప్పుకోలేని ఉన్నత మనస్కులూ వున్నారు. ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే మీకిప్పుడు ఈ వైరుధ్యంగల కొన్ని పాత్రలను పరిచయం చేయబోతున్నాను కాబట్టి.

ఇదుగో ... ఇలా రండి చూపిస్తాను. అదుగో..అక్కడ ముక్కుమూసుకుని జపం చేస్తున్నాడే ఆయన పేరు కూర్మావతారం. వేదసారాలను ఔపోసనపట్టాడు. సంప్రదాయానికి పట్టంకట్టాడు. చాదస్తాన్ని - చండశాసనత్వాన్ని పుణికిపుచ్చుకు పుట్టాడు. సంస్కృత కళాశాలలో ప్రిన్సిపాల్ పదవి వెలగబెట్టాడు. ముగ్గురు కూతుళ్లూ, ఒక కొడుకూ వున్నారు. కాని ఎప్పుడు లెక్కచెప్పినా ఇద్దరు కూతుళ్లూ, ఒక కొడుకే వస్తారు. 'దీని భావమేమి తిరుమలేశా?' అవతారంగారు గుండెజబ్బు మనిషి. ఎప్పుడూ హాస్పిటల్‌లో వుంటాడనే కన్నా అప్పుడప్పుడు ఇంట్లో వుంటాడనటం బావుంటుంది. ఎప్పటికప్పుడు టపాకట్టేసేలా వుంటాడు కానీ, అప్పటికప్పుడే బతికి బట్టకట్టుకుంటాడు. అవతారంగారు ఆస్పత్రిలో అడుగు పెడుతున్నాడంటే ఆయాలదగ్గర్నించి అందరికీ హడలే! మందు మాత్రలు తులసి నీళ్ళతో కడగమంటాడు. ఇంజక్షన్ ఇవ్వడానికి వస్తే స్నానంచేసి రమ్మంటాడు. ఈయన గారికి ఒక ఆకతాయి మనవడు వున్నాడు. కొడుక్కొడుకులెండి. కూతుళ్ళ సంసారం గురించి తరువాత ప్రస్తావించుకుందాం. గుండెజబ్బు కూర్మావతారంగారు తనకు సేవచేయడానికి ఒక నర్సును తెచ్చుకున్నారు. ఆ నర్సే రాధ.



చాణుక్యుని ఎత్తులు కుటిలనీతులూ తెలుసు కూర్మావతారానికి. క్లుప్తంగా ఇది అనగనగా ఒక కూర్మావతారంగారి సంక్షిప్త స్వరూప స్వభావ పరిచయం.

సరే... ఈయన్ని కలవండి. ఈయన పేరు రాఘవరావు. అవతారంగారి ఏకైక కుమారరత్నం. గాడిదల్లో ఎన్ని రకాలున్నాయో, ఎన్ని జాతులున్నాయో, ఏ గాడిద ఏ దేశానికి చెందిందో పరిశీలించి, పరిశోధించి 'గార్దభ దండకం' రాశాడు. ఆ దండకాన్ని కేవలం తన కుమార రత్నం రాంబాబు సన్నిధిలోనే పఠిస్తాడు. అవతారంగారి ఆజ్ఞలను శిరసావహిస్తాడు. ఈయన భార్య సదరు రాంబాబుగారి తల్లి పార్వతి. పార్వతి చక్కని ఇంటి భోజనం లాంటి ఇల్లాలు. రాంబాబు రాధ వెంట



పడుతున్నాడని వాసనపట్టిన పార్వతి తన వేలువిడిచిన అన్నగారి కూతుర్ని రాంబాబుకు కుదర్చాలనుకుంటుంది. అప్పుడు హాయిగా అందరూ ఒకే గొంగళిలో భోంచేయొచ్చని ఆవిడ ఆశ. రాఘవరావు, పార్వతి కూడా అవతారం గారి సంప్రదాయాల చూరుని పుచ్చుకుని వేళ్లాడుతున్నారనే చెప్పచ్చు. వీళ్ళనిక్కడ వదిలేసి అలా అవతారంగారి కూతుళ్ళ ఊళ్ళు తిరిగొద్దాం రండి....

దిగండి! ఊర్మిళావాళ్ళ ఊరొచ్చింది. ఈవిడ కూర్మావతారంగారి పెద్ద కూతురు మొగుడు ఇంజనీరు. పిల్లలు వెర్రితలలు వేస్తున్న ఆధునిక నాగరికతకు సాక్ష్యాలు. మొగుడుకి మందులు--విందులు రెండు అలవాట్లూ ఉన్నాయి. తరతరాలుగా నరనరాలలో సంప్రదాయం జీర్ణించుకుపోయిన కూర్మావతారంగారి కూతురు పాశ్చాత్య నాగరికతకు ప్రతీకగా నిలబడటం ఆశ్చర్యం కలిగిస్తోందా మీకు? అయితే ఓ పనేయండి. కూర్మావతారంగారి రెండో కూతురు సుభద్ర వాళ్ళింటికి వెడదాం రండి హైదరాబాద్. అటు నగరం చూసినట్లుంటుంది-నగర



వాసుల నాగరీకతా తెలుసుకున్నట్లౌతుంది. హమ్మయ్యా! హైదరాబాదు వచ్చేశాము. ఇదే సుభద్రవాళ్ళిల్లు. ఓహో ... బ్రహ్మాండంగా చికన్ కర్రీ వాసన ఘుమాయిస్తోంది. జీడిపప్పులా నోరూరిస్తోంది ప్రాన్స్ కర్రీ...అవునూ! ఆచారవ్యవహారాలకు ఆలవాలమైన సంప్రదాయ కుటుంబంకదామరి!! కూర్మావతారంగారు కూర్మాలే తింటాడో అరటి పండ్లతో ఆకలే తీర్చుకుంటాడో తెరమీద చూడొచ్చులెండి. సుభద్ర మొగుడు మంత్రాలు వదిలిపెట్టి మందుసీసాకు మొక్కుతాడు, భార్యామణిని వదిలి పెట్టి పనిమనిషితో కులుకుతాడు. అదండీ! కూర్మావతారంగారి సంప్రదాయ కుటుంబ సభ్యుల సంబడం! తన కుటుంబ సంప్రదాయాల గొప్పని, ఆచారవ్యవహారాల ఔన్నత్యాన్ని చాటిచెప్పి తన మనవడు రాంబాబు ప్రేమించిన రాధలో మార్పుతెచ్చి తన కులహీనతను తానే స్వయంగా గ్రహించి తలవంచుకుని ఇంట్లోంచి బయటకు వెళ్ళిపోయేలా చేద్దామనుకున్న కూర్మావతారంగారి ఎత్తుగడలన్నీ చిత్తైపోయినట్లే అనిపిస్తోంది. ఈ దెబ్బతిన్న పీరుడితో తిరుగుప్రయాణంకట్టి రాజమండ్రి పోదాం పదండీ! అక్కడ హనుమంత రావు, దమయంతి మనకోసం ఎదురు చూస్తూవుంటారు. హనుమంతరావు రాంబాబుకి వేలువిడిచిన మేనమామ. ఈ హనుమంతరావు కూతురు సరస్వతినే రాంబాబు ప్రేమించిన రాధ స్థానంలోకి తీసుకురావడానికి పెద్దలు విశ్వప్రయత్నం చేస్తున్నారు. హనుమంతరావు కానీ ఖర్చులేకుండా కూతుళ్ళ పెళ్ళిళ్లుచేయడంలో ఘనాపాటి. బీడీ కాలుస్తూ అగ్నిహోత్రం చేస్తున్నానని నమ్మించగల దిట్ట. అంతటి తండ్రికితగ్గ కూతురే సరస్వతి కూడా. పదో తరగతిలోనే బాబీతో ప్రణయం సాగిస్తోంది.అందుకనే కాబోలు కూర్మావతారంగారు రాధను వదుల్చుకోవాలని చూస్తే సరస్వతి రాంబాబును వదుల్చుకోవాలని చూస్తోంది. ఈ సైడు హీరో, సైడ్ హీరోయిన్‌ల విషయం పక్కనపెట్టి అసలు హీరో హీరోయిన్‌ల దగ్గరకు వద్దాం....

.... అదుగో! ఆ గోదావరి ఒడ్డున హాయిగా ప్రణయవిహారం చేస్తున్నారే ... వాళ్ళే రాధ, రాంబాబు. రాంబాబుకి కొన్ని ఆశయాలున్నాయి. ఆశలూ వున్నాయి. ఆచరణలో పెట్టాలంటే సంప్రదాయాల తాతయ్య గ్రహం అడ్డు తగుల్తుందని భయం. ఎలాగైతేనేం గుండె గుప్పిట్లో పట్టుకుని రాధను తను ప్రేమిస్తున్నానని చెప్పగలిగాడు. ఆ తరువాత తాతయ్య సలహా పాటించి తన జుట్టును రాధ చేతుల్లో ఇరికించుకున్నాడు పాపం పసివాడు! అదుగో...మాటల్లోనే వచ్చింది రాధ. రాధ ఉన్నత కుటుంబంలోనే పుట్టిందని చెప్పినప్పుడు ఎందరు నమ్మినా, నమ్మకపోయినా ఆమె ఉన్నత కుటుంబంలోనే పుట్టిందని చెప్పకతప్పదు. కాలం - ఖర్మం కలిసిరాక మానవసేవనే మాధవసేవలా భావించి నర్సు వృత్తిని స్వీకరించింది రాధ. ఆమెకా వృత్తిపట్ల ఎంత గౌరవమో రోగులపట్ల అంత గౌరవమూ చూపిస్తోంది. అసలు - సిసలు సంప్రదాయాల్ని - ఆచారాల్ని, భారత స్త్రీ లక్షణాల్ని, ఆడదాని హద్దుల్ని, మగవారి మాయబుద్ధుల్ని క్షుణ్ణంగా అవగాహన చేసుకుని తాను నమ్మిన ఆదర్శాలమేరకు ఆచరణలో పెట్టుకోగల్గిన అపురూప గుణవతి రాధ. ఇలాంటి రాధతోనే

ధ్రుకొనడానికి సిద్ధమయ్యాడు కూర్మావతారం.

కూర్మావతారం, రాధ, రాంబాబు, బాబీ, సరస్వతి, హనుమంతరావు, దమయంతి, రాఘవరావు, పార్వతి ఆడుతున్న ఈ 'టగ్ఆఫ్‌వార్'లో గెలుపెవరిది? ఓటమెవరిది?? అడుగడుగునా అన్ని పాత్రల్లోనుంచి హాస్యరసం తొణికిసలాడే 'ప్రేమించు పెళ్లాడు' చిత్రం ఉషాకిరణ్ మూవీస్ సమర్పణ.

యువ దర్శకుడు వంశీ దర్శకత్వంలో రూపుదిద్దుకున్న ఈ చిత్రంలో భానుప్రియ-రాజేంద్రప్రసాద్, తులసి-'శుభలేఖ' సుధాకర్, సత్యనారాయణ, రాళ్ళపల్లి, వీరభద్రరావు, హేమసుందర్, రాధాకుమారి, వై. విజయ, జానకి, ప్రధాన తారాగణం.

కథ: జొన్నలగడ్డ రామలక్ష్మి; సంభాషణలు: గణేష్‌పాత్రో; పాటలు: వేటూరి సుందరరామమూర్తి; సంగీతం: ఇళయరాజా; ఛాయాగ్రహణం: యం.వి. రఘు; నృత్యాలు: శేషు; కళ: భాస్కరరాజు; కూర్పు: అనిల్ మల్నాడ్; నిర్వహణ: అట్లూరి రామారావు; నిర్మాత: రామోజీరావు.

మయూరి-విడుదల


వంశీ


గణేష్‌పాత్రో


యం.వి.రఘు


వేటూరి


ఇళయరాజా


బాలసుబ్రహ్మణ్యం


జానకి


అనిల్ మల్నాడ్


శేషు


శైలజ





ఉషాకిరణ్ మూవీస్

# ప్రేమించు పెళ్లాడు

రామోజీరావు • వంశీ

గణేష్ పాత్రో • ఇళయరాజా • యం.వి.రఘు • శేషు • అనిల్ మల్నాడ్ • భాస్కరరాజు

నిర్వాహణ: అట్లూరి రామారావు



# చతుర

సంపుటి : 8 ఆగస్ట్ 1985 సంచిక : 7

## ఈ నెల సమగ్ర నవల

ఆ అపురూప అపరంజి బొమ్మ వయసు పద్దెనిమిదేళ్ళు. ఐశ్వర్యం ఆమెను అందలం ఎక్కిస్తే, అందం అతిశయాన్ని పెంచింది. అయినా ఆమె అంతస్తుల్ని విస్మరించి, తన మనసు దోచుకున్న యువకునికి హృదయంలో పట్టం కట్టింది.

కాని, అనూహ్యమైన పరిస్థితుల్లో...
ఆమె మరో యువకునిపై ప్రేమ వల విసిరింది!
ఆ వలలో చిక్కుకున్న అతనికి ఆ అగర్భ...

# శ్రీ



....మంతురాలి నుండి ఏమి లభించింది?

తాను వలచి, వలపించుకున్న ప్రియుణ్ని వదలి మరో యువకుని ప్రేమకై ఆరాటపడవల్సిన అగత్యం ఎలా ఎదురయింది ఆమెకు? ఆ త్రికోణపు ప్రేమలో ఎవరికెవరు దక్కారు? ఎవరు ఎవరిని కోల్పోయారు??

## సింహప్రసాద్

కలం ఆసక్తిదాయకమైన కథనంతో వెలువరించిన రచన 'శ్రీ' ఈ నెల చతుర సమగ్ర నవల!

ముఖచిత్రం : దిలీప్ బెనర్జీ

# చతుర ప్రపంచం

## ప్రాణాంతకమైన పిచ్చి

తన పేరు గిన్నెస్ బుక్ ఆఫ్ రికార్డ్స్‌లోకి ఎక్కడం పశ్చిమ జర్మనీకి చెందిన క్లాజ్ రిబెక్ జీవిత ధ్యేయం. అతను నీటిలోపల 4 నిమిషాలుండి రికార్డు సృష్టిస్తానని ప్రకటించి దానికోసం మూడేళ్ళపాటు సాధన చేశాడు.

చివరికి ఓ స్విమ్మింగ్ పూల్‌లో అతను ప్రదర్శన జరిపినపుడు చూసేందుకు దాదాపు 200 మంది గుమిగూడారు. నీటిలో తేలకుండా మునిగి వుండేందుకు 21 పౌన్ల సీసాన్ని నెత్తి మీదుంచుకుని క్లాజ్ స్విమ్మింగ్ పూల్‌లో దిగాడు. నాలుగు నిమిషాల తర్వాత ఒకరు నీటిలోకి దిగి క్లాజ్‌ని పైకి తీసుకొచ్చారు. కాని అప్పటికి క్లాజ్ చనిపోయివున్నాడు.

దానిపై గిన్నెస్‌బుక్ సంపాదకుడు నోరిస్ విర్టర్, "పేరుకోసం కొందరు ఇలా చిన్నపిల్లల తీరులో దుస్సాహసాలకు పూనుకొని, ఆ ప్రయత్నంలో మృతిచెందడం విచారకరమైన విషయం" అని వ్యాఖ్యానించాడు.

మరో విషాదకరమైన అంశమేమంటే, క్లాజ్ ఓ యూరోపియన్‌గా నీటి లోపల 4 నిమిషాలపాటు గడపటం ప్రపంచ రికార్డు అవుతుందనుకున్నాడుగానీ అది తప్పు. 1910లోనే ఒక యూరోపియన్ నీటి లోపల 6 నిమిషాల 29.8 క్షణాల



పాటు వున్నాడు.

నీటిలోపల ఎవరూ 13 నిమిషాల 42.5 క్షణాలకు మించి వుండలేరని, అది అతి ప్రమాదకరమైన ఫీట్ అని గిన్నెస్ బుక్‌లో పేర్కొనబడింది!

## కానుకల లెక్కింపు

తిరుపతిలో ప్రతిరోజూ స్వామి దర్శనం చేసుకునే అనేకమంది భక్తులు హుండీలో సమర్పించుకునే ముడుపులు, కానుకలను వేరుచేసి లెక్కించేటపుడు మామూలు జనంలోంచి ముగ్గురు వ్యక్తులను సాక్షులుగా పిలుస్తారు.

లెక్కింపు సమయంలో హుండీ వుండే గది బయట తలుపు మూసేసి, గాలికోసం తెరల్ని పక్కకి లాగేస్తారు. హుండీ లోంచి కానుకలన్నింటినీ చెవులుండే పెద్ద పెద్ద అండాల్లోకి తీస్తారు.

20 మంది దేవస్థానపు ఉద్యోగులు, సి.ఐ.డి.లు, పోలీసులు కానుకలలోంచి వాచీలు, వుంగరాలను వేరు చేస్తారు. పోలీసులు వాటిని వేర్వేరు పెట్టెల్లో పెట్టి తాళంవేసి, తాళంచెవి ఉద్యోగులకిస్తారు. కానుకల్ని వేరుచేస్తుంటే ఎన్నోరకాలైనవి బైటపడతాయి.

కానుకలలో పాత నాణాలు, పురాతన నాణాలు, అణా, అర్ధణా నాణాలేకాక చెల్లని నకిలీ నాణాలు కూడా ఎన్నో వుంటాయి. డబ్బారేకు హుండీలు, తాబేలు, ఏనుగు ఆకారపు హుండీలు, కాగితం పొట్లపు హుండీలు ఇలా అనేక ఆకార పరిమాణాల్లోని హుండీలుంటాయి. కానుకల్లో ఇంకా బంగారు నగలు, వజ్రపు వుంగరాలు, ఇత్తడిలోటాలు, గ్లాసులు, ఒకే నెంబరు గల నకిలీ కరెన్సీ నోట్లు, లాటరీ టిక్కెట్లు వుంటాయి. వరి, గోధుమ, ఏలకులు లాంటి ధాన్యాలు, కాయధాన్యాల్నికూడాకొందరుకానుకలుగా వేస్తారు. డాలర్ నోట్లు, అరేబియా కరెన్సీ నోట్లు, బాంకు డ్రాఫ్టులు, చెక్కులు కానుకలుగా వేసేవారుంటారు. వాచీలు, పెన్నులు వేసేవారు కొందరైతే వివిధ రాజకీయ పార్టీల నాయకుల పేర్లు



పేర్కొంటూ, 'వర్ధిల్లాలి' అని రాసిన కాగితాల్ని హుండీలో వేసేవాళ్ళూ కొంద రుంటారు.

కరెన్సీ నోట్లను బొత్తులుగా పెట్టే మకు 2 గంటలు పడుతుంది. ఆపై వాటిని లెక్కించడం ప్రారంభిస్తారు. నాణా లన్నింటినీ పెద్దపెద్ద గుండిగలలో వేస్తారు. రూపాయి, రెండు రూపాయల్లాంటి నాణా లను మాత్రమే లెక్కపెడతారు. మిగిలిన చిల్లర నాణాలను మూటలుగాకట్టి తూచి, వాన్నిబట్టి విలువ అంచనా వేస్తారే తప్ప లెక్కపెట్టరు.

చిరిగిన, మట్టికొట్టుకుపోయిన నోట్లను వేరుచేసి నిర్ణీతకాలానికోసారి మద్రాసు లోని రిజర్వు బ్యాంకుకి పంపుతారు. లాటరీ టిక్కెట్లను ఆయా రాష్ట్ర లాటరీ ఆఫీసులకి పంపిస్తారు. ఏ టిక్కెట్టుకైనా బహుమతి వస్తే ఆ మొత్తం దేవస్థానానికి చెందుతుంది.

బంగారు నగలను తూచి, వాటి వివరా లను ఓ పుస్తకంలో రాసి సీలువేసిన వాల్టులలో భద్రపరుస్తారు.

హుండీలోని కానుకల లెక్కింపు ఉదయం ఎనిమిదిన్నరకి, మధ్యాహ్నం రెండున్నరకి రోజుకి రెండుసార్లు జరుగుతుంది. రోజూ లక్ష రూపాయలకి మించిన విలువైన కానుకలొస్తాయి.

సాక్షులుగా వచ్చిన బయటివారి సంతకం, చిరునామా తీసుకుని, వారికి ప్రసాదాలైన లడ్డు, వడ పెట్టి పంపుతారు.

అంతే ప్రాప్తంమరి !

## కృత్రిమ చర్మం

షార్క్ చేప ఎముకలతో తయారుచేసిన దానిని, ఆవు చర్మంనుంచి తయారుచేసిన పేస్టులో తగు పాళ్లలో కలిపి, ఈ మిశ్ర మాన్ని చల్లబరుస్తారు. అలా కొంతసేపు చేస్తే ఆ మిశ్రమానికి రోమరంధ్రాలేర్పడి, అది మానవ చర్మంలా రూపుదిద్దు కుంటుంది. ఆ విధంగా తయారైన కృత్రిమ చర్మాన్ని కొన్ని రసాయనాల సాయంతో భద్రపరుస్తారు.

అగ్నిప్రమాదాల్లో ఒళ్లు కాలిపోయిన వారికి ఈ కృత్రిమ చర్మం ఓ వరం లాంటిదే! వైద్యశాస్త్ర పురోగతికి కృత్రిమ చర్మపు తయారీని కొలమానంగా చెప్పు కోవచ్చు.

కాలనిచోటునుంచి చర్మాన్ని తీసి కాలినచోట అంటించే పద్ధతిని 'గ్రాఫ్టింగ్' అంటారు. ఇంతవరకూ చర్మం కాలితే సరిచేసేందుకు గ్రాఫ్టింగ్ పద్ధతి వాడుకలోవుండేది.కాని, దాన్ని ప్రతిసారీ అనుసరించే వీలులేదు. చర్మం ఎక్కువ భాగం కాలినట్టయితే గ్రాఫ్టింగ్ పద్ధతి ద్వారా అతికించడం సాధ్యంకాదు. అలా కాలినవారికి పందిచర్మం లేక మరణించిన వారి చర్మం అతికించేందుకు కొంతకాలం ప్రయత్నించారు. కాని, చాలా కేసుల్లో ఆ గ్రాఫ్టింగ్ పద్ధతి విఫలమైంది.

దాంతో అగ్నిప్రమాద బాధితులకు అతికించగల కృత్రిమచర్మం తయారు చేసేందుకు వైద్య శాస్త్రవేత్తలు చాలా కాలం తంటాలుపడ్డారు. అమెరికాలోని మాసాచుసెట్స్ వైద్య కళాశాలకుచెందిన డాక్టర్ల బృందం ఆ ప్రయత్నంలో చివరికి సఫలీకృతమైంది.

3 నుంచి 60 ఏళ్ల మధ్య వయసు గల అగ్నిప్రమాద బాధితులకి కృత్రిమ చర్మాన్ని అతికించగా, వారందరికీ అది చర్మంలో భాగంగా కలిసిపోయినట్టు తేలింది. వారిలో 60 నుంచి 90 శాతం వరకూ తీవ్రంగా ఒళ్లు కాలినవారేకాక,





# నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి.



# మీ కుటుంబంలోని వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని ఇవ్వండి!

క్రమం తప్పకుండా కోల్గేట్‌ని వాడటంలో మీ కుటుంబంలోని
వారి నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా ఉంటుంది, వారి పళ్ళు యెంతో పుష్టంగా,
ఆరోగ్యంగా ఉంటాయి. కోల్గేట్ రక్షణ చక్రం చేసేది అదే,
వారికది ఇవ్వడం అంటే.

మీరు పళ్ళు తోముకున్న ప్రతిసారి, కోల్గేట్ యొక్క నమ్మకమైన ఫార్ములా చేసేదిది-చూడండెలాగో.



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన, దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.



కోల్గేట్‌లోని అద్వితీయమైన శక్తిగల నురగ లోపలికి చొచ్చుకుపోయి, అక్కడ గల దుర్వాసన కలిగించే ఆహారపు తునకల్ని, దంతక్షయాన్ని కలిగించే సూక్ష్మజీవుల్ని తొలగిస్తుంది.



క్రమం తప్పకుండా కోల్గేట్‌తో పళ్ళు తోముకుంటే, దాంతో ఇక మీకు శుభ్రమైన, తాజా శ్వాస, దాంతోపాటు దృఢమైన, ఆరోగ్యమైన పళ్ళూను.

భోజనం చేసిన తర్వాత ప్రతిసారి మీ కుటుంబంలో వారంతా కోల్గేట్‌తో పళ్ళు తోముకుంటున్నారని ధృవపరుచుకోండి. నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి. వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని ఇవ్వండి.




**దీని తాజా పిప్పరమెంట్ రుచి మీకెంతో నచ్చుతుంది!**



మృత్యు సమీపానికి వెళ్లినవారు కూడా ఈ కృత్రిమచర్మం ఆధారంగా బతికి బయటపడ్డారు.

మానవ చర్మపు లోపలిపొరలోవున్న రసాయన, అల్లిక విధానాలే షార్క్ ఎముకల పొడి,ఆవు చర్మపు పేస్టుల మిశ్రమంలో కూడా వుంటాయి. అందువల్ల కృత్రిమచర్మం మానవచర్మంతో ఎలాంటి తేడా లేకుండా కలిసిపోతుంది అని చెబుతున్నారు డాక్టర్లు.

## చర్మచక్షువు

తమిళనాడులోని కోయంబత్తూరు ఆర్. యస్. పురం పోస్టాఫీసులో ఉత్తరాలపై స్టాంపు ముద్రవేసి, సార్టింగ్ చేసే వుద్యోగిగా సెల్వం అనే అంధుడు పనిచేస్తున్నాడు.

అతను తాను నివసించే పొత్తనూరు అనే ప్రాంతంనుంచి ఎవరి తోడూ లేకుండానే ఆఫీసుకెళ్ళి వస్తాడు. మార్గంలోగల ఎలక్ట్రికల్ స్తంభాలను లెక్కపెట్టుకుంటూ అతను దారి తప్పకుండా ఆఫీసుకి చేరుకుంటాడు. సెల్వం బస్ శబ్దాన్నిబట్టి అది ఏ రూట్‌లో తిరిగేదో చెప్పగలడు.

మద్రాసులోని రాయపురం ప్రాంతానికి చెందిన సెల్వం మూడేళ్ళ వయసులో మశూచివల్ల దృష్టిని కోల్పోయాడు. ప్రస్తుతం 21 ఏళ్ళ సెల్వం కుటుంబంలోని ఏకైక సంపాదనాపరుడు. తల్లిదండ్రులు, తోబుట్టువులతో కలిపి ఇంట్లోని 8 మందినీ అతనే పోషిస్తున్నాడు. ఆ కుటుంబంలో మరో ముగ్గురు అంధులున్నారు.

సెల్వం ఉత్తరాలపై స్టాంపుముద్ర వేసేటప్పుడు స్పర్శద్వారా అది కార్డో, కవరో కనుక్కోగలడు. స్టాంపు ఎక్కడ ఉందో కూడా అదేవిధంగా స్పర్శ ద్వారానే తెలుసుకుంటాడు. అతను విధి నిర్వహణలో ఎన్నడూ పొరపాటు చేసిన దాఖలాల్లేవు. కళ్లు లేనివారికి ఒళ్ళంతా కళ్ళేమరి.

ఇతరులు తమంతట తాము వచ్చి సాయంచేస్తే స్వీకరించటమేతప్ప ఎవరి

సహాయాన్ని అర్థించని ఆత్మాభిమానం గల సెల్వం ఉద్యోగంలో స్థిరపడ్డాక ఓ అంధురాల్నే పెళ్లాడాలనీ, అంధురాలైన తన సోదరికి మంచి సంబంధం చూసి పెళ్లిచేయాలనీ అనుకుంటున్నాడు.

## మృత్యుంజయుల క్లబ్బు

లండన్‌లోగల 'లకీ టుబి ఎలైవ్ క్లబ్బు' అనే ఓ వింత క్లబ్బు గురించి కొద్దిమందికి మాత్రమే తెలుసు. దానిలో సభ్యత్వం అతితక్కువమందికే పరిమితం. మృత్యువుకి అతిసమీపంగా వెళ్ళి తప్పించుకున్న వారినే ఆ క్లబ్బులో చేర్చుకుంటారు. 'మృత్యుంజయుల క్లబ్బు'లోని చాలామంది గిన్నెస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్‌లో చోటుచేసుకున్నారు కూడా.

ఆ క్లబ్బు వార్షికోత్సవాలు నిర్వహించే రోజున కొత్త సభ్యులను చేర్చుకుని, వారి అనుభవాలను విని, ఎవరయితే మృత్యువు నుంచి అతిక్లిష్టదశలో తప్పించుకున్నారో వారికి "ఆ సంవత్సరపు ప్రముఖ వ్యక్తి" అవార్డు ఇస్తారు. ఆ అవార్డు పొందిన సభ్యులలో 'వెస్నావులోవిక్' ఒకరు. ఆమె యుగోస్లేవియన్ ఎయిర్‌లైన్స్‌లో ఎయిర్‌హోస్టెస్‌గా పనిచేసేది. ఓసారి ఆమె పనిచేస్తున్న విమానం జెకోస్లొవేకియా మీద ఎగురుతుండగా, విమానంలో తీవ్రవాదులు పెట్టిన బాంబులు పేలి అది ముక్కలు ముక్కలయింది. వెస్నా ఆ సమయంలో విమానం చివరితోకభాగంలో వుంది. ఆ భాగం ముక్కలు కాకుండా విమానం నుంచి విడిపోయి, కొన్ని వేల అడుగులకింద మంచుపర్వతంపై పడింది. ఆ చుట్టుపక్కలున్న గ్రామస్థులు మంచుకు గడ్డకట్టుకుపోయిన వెస్నాను కనుగొన్నారు. డాక్టర్ వైద్యంతో కోలుకున్న ఆమె తన వుద్యోగానికి రాజీనామా ఇచ్చింది.

ఎల్వినా ఏడమ్స్ అనే 26ఏళ్ళ యువతి ఆత్మహత్య చేసుకునే వుద్దేశంతో న్యూయార్క్‌లోని ఎంపైర్ స్టేట్ భవనం 86వ అంతస్తునుంచి దూకేసింది. కాని, అప్పుడు బలంగావీస్తున్న గాలివల్ల ఆమె కిందపడకుండా 85వ అంతస్తు బాల్కనీలో పడింది. ఆవిధంగా వూహించని రీతిలో ఆమె ప్రాణాలు నిలిచాయి. కాళ్ళదగ్గిర



కొంచెం కొట్టుకుపోయిందంతే! ఆ తర్వాత ఎల్వీనా మళ్ళీ ఆత్మహత్యా ప్రయత్నం చేయకుండా 'మృత్యుంజయుల క్లబ్బు'లో చేరింది.

ఫ్లోరిడాలో నివసిస్తున్న 27 ఏళ్ళ 'బ్లాంకా' కూడా వూహించనిరీతిలో చావు తప్పించుకుంది. ఆమె సాహసాలపై మోజు కొద్దీ 6,500 అడుగుల ఎత్తున ఎగురుతున్న విమానంలోంచి పారాచూట్ తో కిందకు దూకేసింది. కాని, ఆ పారాచూట్ విచ్చుకోలేదు. అయినా అదృష్టవశాత్తూ బ్లాంకా ఓ పొలంలోని పెద్ద టొమాటోల గుట్టపై పడటంతో ఆమె ప్రాణాలు దక్కాయి. వెన్నెముక దెబ్బతినడంతో ఆరునెలలపాటు ఆస్పత్రిలో గడపవలసి వచ్చింది. అలా ఎంతో ఎత్తునుంచి కింద పడ్డా బతికి బయటపడ్డవాళ్ళు 'మృత్యుంజయుల క్లబ్బు'లో అనేకమందివున్నారు.

22 ఏళ్ళ రోనాల్డ్ నార్వేలో ఓ విందుకి వెళ్ళి తిరుగుముఖం పట్టేటప్పటికి పొద్దుపోయి ఆఖరి బస్సుకూడా తప్పిపోయింది. చలిగాలులతో కూడిన వాతావరణంలో ఆరుబయలు ప్రదేశంలో ఆ రాత్రంతా గడపాలనే ఆలోచన రోనాల్డ్ కి భీతిగొలిపింది. బస్టాండ్ పక్కనే రైల్వే స్టేషన్ వుంది. ఉష్ణోగ్రత సున్నాలోపుకి తగ్గిపోయిన ఆ రాత్రి చలినుంచి తప్పించుకునేందుకు రోనాల్డ్ ఒక వేగనులో దూరి తలుపు మూసేసుకున్నాడు. దురదృష్టవశాన ఆ తలుపు గట్టిగా మూసుకుపోయి మన్నాడు తెరిచేందుకు రోనాల్డ్ ఎంత కష్టపడ్డా ఫలితం లేకపోయింది. అతను ఎంత అరిచి, కేకలు పెట్టినా బయటివారికి వినబడలేదు. దానికితోడు ఆ వేగన్ని గూడ్సుబండికి కలపడంతో అది ఓ మంచు ప్రాంతంగుండా ప్రయాణించసాగింది. అప్పుడు వేగన్ ఎంత చలిగావుందంటే రోనాల్డ్ కి, తనను శవాలను భద్రపరిచే చల్లటి గదిలో వుంచినట్టు అనుభూతి కలిగింది. నాలుగురోజులు గడిచాయి. అన్నాళ్ళూ రోనాల్డ్ కి అన్నపానాదులు లేవు. వేగను కప్పుకి రంధ్రంచేసి దానిలోంచి లోపలికి పడే మంచు పెచ్చుల్ని తింటూ గడిపాడు. దానివల్ల 6వరోజుకి రోనాల్డ్ పరిస్థితి ఇంకా దిగజారిపోయింది. ఓస్లో అనే ప్రాంతంలో రైలు ఆగినప్పుడు రైల్వే వుద్యోగులు వేగన్ని తెరిచి, దాదాపు చనిపోయినట్టుగా పడివున్న రోనాల్డ్ ని చూశారు. వెంటనే ఆస్పత్రిలో చేర్చి అతని ప్రాణాలు కాపాడారు. ఆ రోనాల్డ్ ఇపుడు 'మృత్యుంజయుల క్లబ్' సభ్యుడు.

పీటర్ కోల్‌మన్ అనే యువకుడు కారుని రైలుపట్టాలు దాటిస్తుండగామధ్యలో కారు చెడిపోయింది. అప్పుడే ఓ ఎక్స్‌ప్రెస్ రైలు వస్తోంది. అది చూసుకుని పీటర్ కారును స్టార్టు చేసేందుకు తంటాలు పడసాగాడు. రైలు మీదకొచ్చేదాకగాని అతను గమనించలేదు. రైలు కారును గుద్ది రెండు భాగాలుచేసి ఒక భాగాన్ని నుగ్గునుగ్గుచేస్తూ ముందుకి సాగిపోయింది. అదృష్టవశాత్తూ పీటర్ రెండో భాగంలో వుండటంతో వూహించనిరీతిలో ప్రాణాలతో మిగిలాడు. పీటర్‌వున్న భాగం దూరానికి వెళ్ళిపడటంతో అతనికి గాయాలయాయి. చాలారోజుల వరకూ తను జీవించివున్న విషయాన్ని పీటర్ నమ్మేవాడు కాదు. ఇలా వెంట్రుకవాసిలో మృత్యువు తప్పించుకొన్న ఎందరో 'మృత్యుంజయుల క్లబ్బు'లో సభ్యులు. ఆ క్లబ్బు సభ్యుల సంఖ్య ప్రతి ఏడాదీ పెరుగుతోంది. 

శ్రీనిలయం ముందు కారు ఆగిందో లేదో నౌకరు కుర్రాడు పరుగునొచ్చి ఫ్రంట్ డోర్ తెరచి పట్టుకుని నిలుచున్నాడు సవినయంగా.

డ్రైవింగ్ సీట్లో కూర్చున్న శ్రీదేవి సన్నగా నవ్వుతూ కార్లో కూర్చునున్న స్నేహితురాళ్ళవంక 'చూశారా నా ఘనత?' అన్నట్టు చూసి తల ఎగరేసింది. వాళ్లు కూడా 'ఆహా...ఏమి నీ రాజసం' అన్నట్టుగా చూసి నవ్వారు.

శ్రీదేవి,ఆ వెంట మిగిలినవాళ్లు దిగారు.

ఆమె ఠీవిగా నిర్లక్ష్యంగా నడుస్తూ మేడమీది తన గదివైపు వెళ్తోంటే మిగిలినవాళ్ళనుసరించారు — ఆ భవన సౌందర్యానికీ,అడుగడుగునా కన్పిస్తోన్న ఐశ్వర్య శోభకీ ఆశ్చర్యపడుతూ.

శ్రీదేవి తండ్రి నీలకంఠరావుగారు పట్టణంలోని ప్రముఖ ధనికుల్లో ఒకరు. మాజీ మునిసిపల్ చైర్మన్ కూడా. ఆయనకి మిల్లులూ,సినిమాహాళ్ళూ,కొబ్బరి తోటలూ వగైరా ఆస్తిపాస్తులెన్నో వున్నాయి. శ్రీదేవి వారి ఏకైక సంతానం కూడా.

పద్దెనిమిదేళ్ళ శ్రీదేవి భావకవుల కల్పనల్లో, చిత్రకారుడి కుంచె కదలికల్లో అరుదుగా కన్పించి మురిపించే సౌందర్యవతి. ఆ రూపానికి వయసు సొగసులు వన్నెలు చెక్కితే అలంకరణా పద్ధతి ఆకర్షణని అణువణువునా నింపేశాయ్!

ఆమె అందగత్తె అవడంవల్ల కాదుగాని బంగారు పిచ్చిక అవడంవల్ల ఆమె చుట్టూ చేరుతూంటారామె స్నేహితురాళ్ళు. ఆమె మాటలకు వంతపాడుతూ, పొగడుతూ, రెచ్చగొడుతూ తమ పబ్బం గడుపుకుంటూంటారు. సినిమాలకీ, పిక్నిక్‌లకీ, పార్టీలకి ఆమె ఖర్చుమీద వెళ్తూ ఆమె ఇచ్చే బహుమతులు తీసుకుంటూ ఆమె కొనిచ్చే కాస్మటిక్స్‌కి కృతజ్ఞతలు చెబుతూ జల్సాగా గడిపేస్తుంటారా యువతులు.

వారి స్వభావాలు తెల్సినా పట్టించుకోదు శ్రీదేవి. ఆమెక్కావల్సిందల్లా తన రాజసం పోషించుకోడానిగ్గాను కూడా నలుగురుండటం. తన మాటని వేద వాక్కుగా భావించి తననో మహారాణిగా చూస్తూతన అడుగులకు మడుగులొత్తడం, తనని పొగడుతూ తన మాటకీ చేష్టకీ ఎదురులేదని రుజువు చేస్తూండటం! వాటి కోసం ఆమె ఏమైనా చేస్తుంది. ఎంత డబ్బైనా చిమ్ముతుంది.

గదిలోకెళ్ళి సోఫాల్లో, కుర్చీల్లో కూల బడ్డారందరూ.

"రమా...ఏసీ ఆన్ చెయ్యవే"

శ్రీదేవి నోటిగుండా మాటలు పూర్తిగా వెలువడకుండానే పరుగు: నలుగురూ పోటీలుపడి మరీ వెళ్ళి ఆన్ చేశారు.

కాలేజ్‌లో వాళ్లొదిలివచ్చిన వేనిటీ బేగులూ, పుస్తకాలూ మోసుకునొచ్చాడు గోపి.

"ఇంతసేపేం చేస్తున్నావ్?" సుబ్బ లక్ష్మి అడిగింది అధికార స్వరంతో.

అతడు వణకుతూండటం చూసి గలగల నవ్వేశారంతా.

"ఇంకా అలా దిష్టిబొమ్మలా నిల బడున్నావేం...అక్కడ పెట్టి వెళ్ళి కాఫీ, టిఫిను పట్రావోయ్ ... మా శ్రీకి ఆకలేస్తోంది"

అతడు పుస్తకాలూ అవీ టీపాయ్‌మీద పెట్టేసి పరుగున కిందికి వెళ్ళిపోయాడు.

"నీ నౌకరు భలేవాడోయ్ శ్రీ" ఒకామె అంది.

"అదంతా మన శ్రీ ట్రైనింగోయ్"




అందింకో అమ్మాయి.

ఆ మాటలకి పొంగిపోతూ "నాదే ముందిలేవే" అంది శ్రీదేవి.

"అమ్మమ్మా...అలా అనకు. నీ కారు శబ్దం వినబడితే చాలు వణికిపోతాడు. నువ్వతడివంక చూస్తేచాలు చలిజ్వరం వచ్చినవాళ్ళా అయిపోతాడు"

నళిని మాటలకంతా నవ్వారు. శ్రీ కూడా నవ్వకుండా వుండలేకపోయింది.

"మీ నవ్వులకేంగాని ఇవాళ్టి ప్రోగ్రాం ఏమిటో చెప్పండే"

"అదేవిటలా అంటావ్ శ్రీ?"

"ఈసారికి మీరే చెప్పండే"

"మేమా! మావి మట్టి బుర్రలని బోల్డు సార్లు ఋజువైపోయిందిగా!"

నవ్వుకుంది శ్రీ.

గోపి టిఫిన్ ప్లేట్లు తెచ్చి టీపాయ్ మీద పెట్టడం ఆలస్యం వాటి చుట్టూ మూగారంతా. 'బావుంది ... అద్భుతం' అంటూ అయిదు నిమిషాల్లో ఖాళీచేసేశారు. తర్వాత కూల్ డ్రింక్ సీసాలు ఖాళీ అయ్యాయి.

"హిందీ పిక్చర్ కెళదామే" శ్రీ అంది.

"గుడ్ ఐడియా"

"పిక్చర్‌కి బోల్డు టైముంది. ఈలోగా ఏమైనా సరదా కబుర్లు చెప్పండే. అన్నట్టు మొన్న సమ్మర్‌కి మా అమ్మమ్మ గారి వూరెళ్ళేనుకదా...అక్కడి విశేషాలు చెప్పేనుటే?"

శ్రీదేవి మాటలకంతా మొఖామొఖాలు చూసుకున్నారు. ఇప్పటికే నలభై నాలుగు సార్లు చెప్పిందామె ఆ విశేషాల్ని. అంతా దరీ వుండని ఆ బోరింగ్ కబుర్లని ఆసక్తితో వింటున్నట్లు నటించలేకపోతే ఆమె వూరుకోదు. అందుకే అంతా ముక్త కంఠంతో అన్నారు. "విశేషాలనేసరికి నోరూరిపోతోందనుకో. వెంటనే చెప్పవే బాబూ"

వాళ్లు అబద్ధం చెబుతున్నారని శ్రీకి తెలుసు. అయినా ప్రతిసారీ ఎంతో గొప్పగా చెబుతూనే ఉంటుంది అమ్మమ్మ గారి వూర్ని గురించి.

"మా గ్రాండ్ ఫాదర్...అంటే మా మమ్మీ వాళ్ళ ఫాదర్ మునసబు అన్న మాట. అంటే ఆ వూరికాయన తిరుగులేని రాజు అన్న మాట. ఏ ఇంట్లో శుభకార్యం జరిగినా అది మా తాతగారి చేతుల మీదుగానే ప్రారంభమవుతుంది. గ్రామ దేవత తిరనాళ్ళు మా తాతగారింటినుంచే మొదలవుతుంది. మనకి నమ్మకం కలగదుగానీ అమ్మవారి సిరిబండి మా తాతగారు చెయ్యేస్తేగాని కదలదట"

'నిజవా!' అన్నట్టు చూశారంతా బుగ్గలు నొక్కుకుంటూ.

"నిజవేనే. ఓసారి మా తాతగారేదో వూరెళ్ళి తీర్థం మొదలయ్యే సమయానికి రాలేదుట. వేళ మించిపోతోందని కొబ్బరి కాయలనీ కొట్టి యాభై మంది జమాజెట్టీ ల్లాంటి వాళ్ళచేత సిరిబండి లాగించార్టగాని అరంగుళం కూడా కదల్లేదుట. అంతలో మా తాతగారొచ్చేర్ట. ఆయన అమ్మవారికి నమస్కరించి చక్రంమీద చెయ్యేశార్ట. అప్పుడు చకచకా కదిలిందిట"

"దేవత మహత్యం అన్నమాట"

"అంతే మరి. తరతరాల్నుంచీ ఆ ఆచారం వస్తోందిట మా తాతగారి వంశంలో. సిరిబండి కదిలేక ఆసాదులు అమ్మవారి ఘటాల్ని - వాటిని ఇత్తడితో చేస్తారే. రెండడుగులెత్తు వుంటాయ్-తల మీద పెట్టుకుని డాన్స్ చేస్తారూ...అబ్బా అద్భుతం అనుకో. అంత పెద్ద ఘటాల్ని పడకుండా బేలన్స్ నిలుపుకుంటూ భరత

# ఉజ్వల ప్రపంచానికి కవాటాలు తెరుద్దాం... రండి!



జీవితంలో రకరకాల అవకాశాలు వస్తూ ఉంటాయి. వచ్చిన అవకాశాలను తెలివిగా ఉపయోగించుకొనే వారినే విజయం వరిస్తుంది. అవకాశాలు అంది రావడానికి డబ్బు అవరోధం కాకుండా మార్గదర్శి మీకు తోడ్పడుతుంది.

మార్గదర్శిలో మీ అవసరాలకు అనుగుణంగా వివిధ రకాల చిట్‌లు ఉన్నాయి. తేలికయిన వాయిదాల్లో మీరు పొదుపుచేసే వీలుంది. లాభసాటి డివిడెండ్లు తోడవుతూ పెరిగి పెద్దయ్యే మొత్తాన్ని తిరిగి మీరు పొందవచ్చును. మీ జీవితమూ, మీ తోటివారి జీవితాలూ మరింత శోభాయమానం కావడానికి ఆ మొత్తం ఉపకరిస్తుంది. మార్గదర్శిలో పొదుపు చెయ్యడం నవజీవనానికి నాంది అని లక్షమందికి పైగా ఇప్పటికే గ్రహించారు. మరి, మీ మాటేమిటి?

**డబ్బు కోసమేనా మీ చింత - మార్గదర్శి వున్నది మీ చెంత!**




## మార్గదర్శి

**చిట్ ఫండ్ ప్రైవేటు లిమిటెడ్**

మార్గదర్శి హౌస్, ఆబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

శాఖలు: ● ఆబిడ్ సెంటర్, హైదరాబాద్ ● లక్డీకాపూల్, హైదరాబాద్ ● చిక్కడపల్లి, హైదరాబాద్ ● అమీర్‌పేట, హైదరాబాద్ ● కాబ్రా కాంప్లెక్స్, ఎమ్.జి.రోడ్, సికిందరాబాద్ ● బిసెంట్ రోడ్, విజయవాడ ● బందరు రోడ్, విజయవాడ ● మెయిన్ రోడ్, గుంటూరు ● మెయిన్ రోడ్, కాకినాడ ● ఇన్నీసుపేట, రాజమండ్రి ● నెహ్రూ రోడ్, కర్నూలు ● మెయిన్ రోడ్, విశాఖపట్నం ● జె. పి. ఎన్. రోడ్, వరంగల్, ● వైరారోడ్, ఖమ్మం

KIRON/MCF/81/1

నాట్యంలోకంటే ఎక్కువగా వంగిపోతూ, పడుగెడుతూ నాట్యం చేస్తోంటే గొప్ప థ్రిల్ కలుగుతుందనుకో'' ఎందుకో అనుమానం వచ్చి స్నేహితురాళ్ళ మొఖాల్లోకి చూసింది శ్రీదేవి.

వాళ్ళు ఇబ్బందిగా ఫీలయ్యారు. వారి కళ్ళల్లో లీలగా కదుల్తోన్న అపనమ్మకాన్ని చూసి ఖంగుతిన్నది శ్రీదేవి, "నా మాటల మీద మీకు నమ్మకం లేదుకదూ?"

ఆమె కంఠస్వరంలోని తీవ్రతని చూసి సన్నగా కంపిస్తూ, "అబ్బెబ్బే..అదేంలేదు శ్రీ. నీ మాటలు మేం నమ్మకపోవడమేమిటీ...భలేదానివే" అన్నారు రాని నవ్వు తెచ్చుకుంటూ.

''అయితే అలా ఎందుకున్నారు?"

"ఎలా వున్నాం? బాగానే వున్నామే!" మొఖమొఖాలు చూసుకుంటూ జవాబిచ్చారు.

"ఎందుకే అబద్ధాలాడతారూ. బెట్ వేస్తున్నాను ... కాసుకోండి. నేను చెప్పిందంతా నిజమని ఋజువుచేస్తాను" శ్రీదేవి అంది సీరియస్‌గా.

ఆ ఆడపిల్లలు నలుగురూ తలలొంచుకున్నారు. వారి మొఖాల్లో కత్తివేటుకి నెత్తురు చుక్కలేదు. శ్రీదేవి దేనినైనాసరే తేల్గ్గా వదలదని వారికి తెలుసు. అంచేత గొడవనుంచి బయటపడ్డం ఎలా అని ఆలోచిస్తున్నారు.

అంతలో గోపి వచ్చాడు ప్లేట్లు తీసుకువెళ్ళడానికి.

శ్రీ కళ్ళు మెరిశాయి.

"హేయ్ గోపీ...కమాన్" అంటూ చుట్టూ చూసింది అమ్మవారి ఘటంలాంటి ఆకారంకోసం. టేబుల్‌లైట్ కన్పిస్తే గబుక్కునెళ్ళి వైర్ కనెక్షన్ తీసేసి ''ఈ లైట్‌ని నీ తలమీద పెట్టుకుని పడకుండా నిలబడరా'' అంది శ్రీ.

అయోమయంగా చూశాడు గోపి. మిగిలినవాళ్ళ పని అలాగేవుంది. బొమ్మల్లా చూస్తున్నారంతా.

"తీసుకోరా ఇడియట్"

గబుక్కున దాన్ని అందుకుని భయపడుతూనేతల మీదుంచుకున్నాడు లైటుని.

"చేతులు తియ్"

తీయక తప్పలేదు. కొంచెం కదిలితే చాలు లైటు కిందపడి ముక్కలైపోతుంది. అదే జరిగితే తన వీపు విమానం మోత మోగుతుంది. ముచ్చెమటలు కారుస్తూ నిక్కచ్చి నిలబడ్డాడు గోపి వూపిరైనా పీల్చుకోకుండా.

''గుడ్! మెల్లగా కాళ్ళూ చేతులూ కదుపుతూ అడుగులెయ్. దెబ్బతో వీళ్ళ మొఖాలు మాడిపోవాలి. లేకపోతే ఘటం తల మీదుంచుకుని డాన్స్ చెయ్యలేర్ట... వెయ్యరా"

వణుకుతూ జెంపాక్రలా నిలబడ్డాడు తప్ప కదల్లేదు.

వురిమి చూసింది శ్రీదేవి.

జాలిగా చూశాడు.

కానామె కరగలేదు.

''వేస్తావా? చంపనా?" నిప్పులు కురిపిస్తూ చూసింది.

"ఇంకచాలు శ్రీ! మేం నీ మాటల్ని పూర్తిగా నమ్ముతున్నాం...ఒట్టు" సరిని అంది ధైర్యంచేసి.

కానీ శ్రీ తన పట్టు వదల్లేదు. "నీ పని ఇలా కాదు" అంటూ వేగంగా మేడ దిగి హాల్లోకెళ్ళి గోడకి అలంకారప్రాయంగా తగిలించివున్న కొరడాని తీసింది. ఒక్కసారి జాడించేసరికి సర్‌మని శబ్దం వచ్చింది. విసురుగా పైకి వచ్చింది శ్రీదేవి.

ఎర్రటి ఆమె కళ్ళనీ, ఆమె చేతిలోని

కొరడానీ చూసి నిశ్చేష్టులై కూర్చున్న వాళ్ళల్లా భయంగా లేచి నిలబడ్డారు స్నేహితురాళ్ళు. వూహించని ఈ పరిణామానికు ప్రేక్షకులుగా వుండలేక, వుండకుండా వెళ్ళలేక, ఏమంటే ఏమవుతుందోనని బెదురుతూ కళ్ళప్పగించి చూస్తున్నారు.

గోపి ఏడుస్తోంటే కొరడా ఝళిపించి "వూ..అడుగులెయ్. వెయ్యరా రాస్కెల్" అంది శ్రీ.

"అమ్మగారూ..నన్నొదిలెయ్యండమ్మగారూ" ఏడుస్తూ చేతులు జోడించి అన్నాడు వాడు.

"నోరు తెరిస్తే చంపుతాను ఇడియట్. నీ తలమీది లైట్ పడకుండా గంతులెయ్" అంటూ కొరడా ఎత్తింది.

"చచ్చిపోతున్నాను బాబోయ్" అని కేక పెట్టాడు గోపి.

శ్రీకి ఒళ్లు మండిపోయి కొరడాతో ఛెళ్లున కొట్టింది. వాడు దభీమని పడ్డాడు. టేబుల్ లైట్ అల్లంతదూరాన పడి ముక్కలయ్యింది.

అంతటితో ఆమె వూరుకోలేదు. "డర్టీ రోగ్ ... వాళ్ళముందు నా పరువు తీస్తావ్రటా!" అంటూ కొరడాతో ఎడాపెడా బాదేస్తోంటే, "అమ్మోయ్ నాయనోయ్ చచ్చేనోయ్..." అంటూ కేకలు పెట్టసాగాడు గోపి.

అప్పుడే కారు దిగి లోపలి కొచ్చిన నీలకంఠరావుగారా కేకలకి అదిరిపోయారు. హాల్లోని సోఫాలో నిమ్మకి నీరెత్తినట్టు కూర్చుని వీక్లీ చదువుకుంటున్న భార్యని వింతగా చూస్తూ "గోపీగాడు కేకలు పెడుతూంటే విన్పించడం లేదూ?" అనడిగారు.

"ఏముందీ...అమ్మాయి చెప్పిన పనేదో చెయ్యనని వుంటాడూ, శ్రీకి కోపం వచ్చి వుంటుంది" అంది మీనాక్షమ్మ.

"హా" అని గబగబా మేడమీది కెళ్ళారాయన.

గొడ్డుని బాదినట్టు గోపీని బాదుతోన్న కూతుర్ని చూసి చలించిపోయి "శ్రీ!" అని అరిచారు నీలకంఠరావుగారు.

"చూడు డాడీ...ఈ రోగ్ నా మాట వినడంలేదు.వీణ్ని చంపి వుప్పు పాతరేసినా పాపంలేదు" అంది కొరడాని విసిరేసి తండ్రిని సమీపిస్తూ.

"అయ్యగారూ" అంటూ వెళ్ళి ఆయన కాళ్ళ మీద పడ్డాడు గోపి.

"నువ్వెళ్ళరా" అనడం ఆలస్యం వాయువేగంతో వెళ్ళిపోయాడు వాడు.

కూతురి మనస్తత్వం గురించి బాగా తెలిసిన నీలకంఠరావుగారు "పోన్లేమ్మా.. పూర్ ఫెలో. అద్సరే...మీరింకా ఇక్కడే వున్నారేం? ఇవాళ మన హాల్లో కొత్త హిందీ పిక్చర్‌గా"

"ఇప్పుడే వెళతాం డాడీ" అంటూ బాత్‌రూమ్‌లోకి పరుగెత్తింది శ్రీ - అంతక్రితం జరిగిందంతా పూర్తిగా మర్చిపోయి.

నిట్టూర్చి కిందికి దిగివచ్చారు నీలకంఠరావుగారు.

"ఏం జరిగిందిట ... కొంపలంటుకుపోయినట్టు కేకలెట్టాడు వెధవ" పుస్తకంలోంచోసారి తలెత్తి అడిగింది మీనాక్షమ్మ.

"ఇప్పుడిటే పరుగెత్తుకొచ్చాడుగా. చూళ్ళేదా?"

"వూహూ .... పాపం ఈ నవల్లో అమాయకురాలైన హీరోయిన్‌ని హీరో చావబాదేస్తాడండీ. అది చదవడంలో పడిపోయాను"

"నీ కూతురు చేసిన పనీ అదే"

ఆమె భృకుటి ముడివడింది.

"కొరడాతో చావబాదితే ఒళ్ళంతా





నెత్తురు మడుగయ్యింది వాడికి"

"ఏదో తప్పుపని చేసుంటాడూ. ఈ మాత్రం దానికే ఇదవ్వాలా! అలగా జనాన్ని వెనకేసుకొచ్చి కన్నకూతుర్ని తప్పుబట్టే తండ్రిని నేనెక్కడా చూళ్ళేదు" కాళ్ళూపుతూ అని మళ్ళీ పుస్తకంలో తలదూర్చిందామె.

ఇంతలో శ్రీదేవి తన స్నేహితురాళ్ళతో నవ్వుతూ తుళ్ళుతూ మేడ దిగి వచ్చి, "పిక్చర్‌కెళుతున్నాం మమ్మీ ... వస్తాం డాడీ" అంది.

"జాగ్రత్తగా వెళ్ళిరా చిట్టి తల్లీ" అంది మీనాక్షమ్మ ప్రేమగా చూస్తూ.

"మంచిదమ్మా" అన్నారు నీలకంఠ రావుగారు.

కారు స్టార్టయిన శబ్దం విన్నాక లేచి తమ బంగళాకో పక్కనున్న సర్వెంట్ క్వార్టర్స్ వైపు నడిచారాయన.

గోపి తన గదిలో మోకాళ్ళలో తల దూర్చి కూర్చుని ఏడుస్తోంటే ముసలి నౌకరు రంగయ్య ఓదారుస్తున్నాడు.

గోపీనలా చూసేసరికాయన కళ్ళు చెమ్మగిల్లాయ్. "రంగయ్యా" అని పిలిచారు భారంగా!

ఇద్దరూ ఉలిక్కిపడి లేచి నిలబడ్డారు.

"రంగయ్యా..గోపీని డాక్టర్ సదాశివ రావుగారి ఆసుపత్రికి తీసుకెళ్ళు. నేను పంపించానని చెప్పు. పూర్తిగా నయమయ్యే వరకూ నువ్వుకూడా అక్కడే వుండు" అంటూ కోటు జేబులోంచి పర్సు తీసి డబ్బిచ్చారు "ఖర్చులకుంచు" అంటూ.

అందుకుని చేతులు జోడించాడు రంగయ్య.

వెనుదిరిగి ఒక్కడుగు వేసినవారే ఆగి "ఇక్కడుండటం గోపీకిష్టం లేకపోతే మన ఫ్యాక్టరీలోనో, సినిమా హాల్లోనో జేరమను. మేనేజర్‌కి నేన్చెబుతాలే" అన్నారాయన.

"ఇది మర్చిపోండి బాబూ! అమ్మాయిగోరింకా సిన్నపిల్ల ..."

"చిన్నపిల్లే రంగయ్యా..పద్దెనిమిదేళ్ళ చిన్నపిల్ల! లేకలేకపుట్టిందని గారాబంగా చూస్తోంటే రోజురోజుకీ పెంకెగా తయారవుతోంది"

"ఏదో తెల్సీ తెలీని ఒయసు బాబు గోరూ! ఇంకొన్నాళ్ళు పోతే ఆరే తెల్సుకుంటారు"

"ఆఁ అదృసరే...గోపీని వెంటనే తీసు వెళ్ళు రంగయ్యా" అంటూ వెళ్ళిపోయారు నీలకంఠరావుగారు.

"పెద్దయ్యగోరు నిజ్జంగా దేవుడ్రా!" అన్న రంగయ్య మాటలకి తలూపుతూ చేతులు జోడించాడు గోపి.

* * *

థియేటర్ ముందు ఇసుకవేస్తే రాలనంత జనం వున్నారు. కొత్త హిందీ సినిమా ఆవేళే రిలీజయ్యింది. అప్పటికే ఆ సినిమా సూపర్‌హిట్ అయ్యిందని విని వున్న జనం వేలం వెర్రిగా వచ్చారు.

బుకింగ్ కౌంటర్లింకా తెరవలేదుగాని, కొందరు బ్లాక్‌లో టిక్కెట్లమ్మేస్తున్నారు.

ఎట్టకేలకు బుక్కింగ్ తెరిచారు. ఓ పాతిక ముప్పై టిక్కెట్లమ్మారో లేదో కౌంటర్ మూసేసి 'హౌస్‌ఫుల్' బోర్డు పెట్టేశారు.

జనానికి ఆశ్చర్యమూ, క్రోధమూ కూడా కలిగాయ్.

"పది టిక్కెట్లన్నా అమ్మలేదు ... అప్పుడే హౌస్‌ఫుల్లా?" గట్టిగా అన్నారు కొందరు యువకులు.

"టిక్కెట్లన్నీ బ్లాకులో అమ్మేసి హౌస్‌ఫుల్ అంటే ఒప్పుకోం. పదండ

డుగుదాం"

పదండంటే పదండన్నారు.

ఓ యువకుడా గుంపుకి ముందున్నాడు. అతడు కాస్త పొడుగ్గా, బలంగా ఆరోగ్యంగా వున్నాడు. కోల మొఖం, వంకీల జుట్టూ, చురుకైనకళ్ళూ అతడికి ప్రత్యేకతని తెచ్చిపెడుతున్నాయ్. తెల్లని టెరీన్ పాంటూ, తెల్లని పోలిస్టర్ షర్టూ తొడుక్కుని టక్ చేశాడు. అతడా వూరికి కొత్తగా వచ్చాడు. బంధువుతో కలిసి సినిమాకొచ్చిన అతడు ఇక్కడంతా బ్లాక్ చేస్తుండటం చూసి సహించలేక ఆవేశంతో తన అక్కసుని వెళ్ళబుచ్చేసరికి గుంపంతా అతన్ని నాయకుణ్ని చేసేసింది. అతడికిక ముందు నడవక తప్పలేదు.

పొలోమంటూ జనం మేనేజర్ గది వైపెళ్ళబోతోంటే గేట్ కీపర్స్ వచ్చి అడ్డగించారు. జరగబోతోన్న సంఘటనలకి సాక్షులుగా ఉండటానికిష్టం లేక కాబోలు అంతవరకూ క్యూలో నిలబడండంటూ లాఠీలూపుతూ అదిలించి బెదిరించిన పోలీసులు ఎటో సర్దుకున్నారు.

"మేనేజర్‌ని పిలవండి" ఆ యువకుడు గర్జించాడు గేట్ కీపర్స్‌ని తినేశాలా చూస్తూ.

"ఆయన రారు"

"రాకపోతే మేమే లాక్కురావాల్సొస్తుంది" వెనకనుంచెవరో అరిచారు.

"పోలీసుల్ని పిలవాల్సొస్తుంది"

"పోలీసుల్ని పిలుస్తారంట..రాళ్ళందుకోండ్రా" అన్నారింకెవరో.

గబుక్కున నాలుగురాళ్లు గాలిలో ఎగిరాయ్. హాలు ముందు భాగానున్న అద్దాలు పగిలి ముక్కలయ్యాయ్.

జనం రెచ్చిపోతుండటం గమనించిన ఆ యువకుడు "ఫ్రెండ్స్...కొంచెం శాంతం వహించండి. ముందు మేనేజర్‌తో మాట్లాడదాం. అంతవరకూ ఓపికపట్టాలి" అన్నాడు.

అందరూ చేతులు దించారు.

"మేనేజర్ బయటికి రావాలి" అంటూ కేకలుపెట్టారు కొందరు.

తన గదిలో కూర్చునున్న మేనేజర్ ఆంజనేయులుగారికి బయట సంభాషణంతా వినబడుతూనే వుంది. ముచ్చెమటలకి బట్టలు తడుస్తూనే వున్నాయ్. అయినా చేష్టలు దక్కి కూర్చుండిపోయారు. పోలీస్‌కి ఫోన్ చేద్దామని ఒకట రెండుసార్లు రిసీవర్ అందుకునే ఆగిపోయారు. ఆ థియేటర్‌కి ఏ సినిమా వచ్చినా మొదటి రెండు మూడ్రోజులూ టిక్కెట్లు బ్లాక్ చేస్తుంటారు. అందులో ప్రధాన పాత్ర తనదే! ప్రొప్రయిటర్‌కి తెలీకుండా కనీసం అనుమానం రాకుండా చాలాకాలంనుంచీ ఆ పని చేస్తున్నారు ఆయన. పోలీసుల్ని పిలిస్తే తీగ లాగితే డొంకంతా కదిలినట్లవుతుందేమోనని ఆయన భయం.

ఇంతలో హాలు అద్దాలు బద్దలు గొట్టడంతో ఇక వుండలేక బయటికొచ్చారు.

జనం సద్దుమణిగారు.

"మీకేం కావాలి?" ఆంజనేయులుగారు అడిగారు.

"టిక్కెట్లు కావాలి" అని సవ్వారు.

"క్షమించాలి. టిక్కెట్లన్నీ అమ్ముడైపోయాయ్. హౌస్‌ఫుల్ అయ్యింది. ఇంకొద్ది క్షణాల్లో ఫస్ట్‌షో మొదలవ్వబోతోందికూడా. దయచేసి సెకండ్‌షోకి రావాల్సిందిగా కోరుతున్నాను" వినయంగా అన్నారాయన.

 

''అన్యాయం. బుక్కింగ్ తెరవకుండానే టిక్కెట్లన్నీ బ్లాకులో అమ్మేసి టిక్కెట్లయిపోయాయనడం దారుణం. దీన్ని మేంసహించం'' యువకుడరిచాడు.

మిగిలినవాళ్లందుకున్నారు.

అటువంటి సమయంలో ఓ చిన్న కారు వచ్చి హాలు కాంపౌండ్‌కో పక్కనాగింది. అందులోంచి శ్రీదేవి,ఆమెస్నేహితురాళ్ళు దిగారు.

మేనేజర్ రూమ్ ముందున్న జనాన్ని చూసి "డర్టీరోగ్స్..ఏదో గొడవ చేస్తున్నట్టున్నారు. పోలీస్‌ని పిలిస్తేగాని వీళ్ళ పొగరణగదు" అనుకుంటూ విసవిసా అడుగులేస్తూ మేనేజర్ రూమ్ ముందున్న పెద్ద గేట్ దగ్గరికెళ్ళింది శ్రీదేవి ''వాటీజ్ దిస్ న్యూసెన్స్?'' అంటూ. అసలే జరుగుతున్న గొడవకి ఇదైపోతున్న ఆంజనేయులుగారామెను చూసి మరీ కంగారు పడిపోగా ఆమె ప్రశ్న ఆయన్ని తల్లకిందులే చేసేసింది.

"ఏం లేదమ్మా..హౌస్‌ఫుల్ అయ్యిందంటే వినకుండా గొడవ చేస్తున్నారు. మీరు వెళ్ళండమ్మా...నేను చూసుకుంటానుగా" అన్నాడు. "మేనేజర్ చెబుతోంది అబద్ధం మేడమ్" అన్నాడు గట్టిగా తెల్లబట్టల యువకుడు.

శ్రీ అటు చూసింది విసురుగా. ఆమె కోపం చప్పగా చల్లబడిపోయిందతడి రూపాన్నీ, ఆకర్షణీయమైన మొఖాన్నీ చూసేసరికి. అమితాబ్‌లా పొడుగ్గా, స్టయిల్‌గా, అందంగా, హుందాగా వున్న అతణ్ని చూడగానే అన్పించిందామెకి 'ఎంత బావున్నాడూ' అని. కొన్ని క్షణాలు రెప్ప వెయ్యకుండా అతణ్నే చూసిందల్లా పరిసరాలు గుర్తొచ్చి సర్దుకుంటూ ''అసలేం జరిగిందో మీరు చెప్పండి" అంది.

"వాళ్ళ మాటలకేమమ్మా...ఎన్ని భారతాలైనా చెబుతారు. ఆ గొడవలు నేను చక్కబెడతానుగానీ నువ్వెళ్ళమ్మా... సినిమా మొదలవుతోంది" వెన్నులోంచి వణకు పుట్టుకొస్తోంటే అన్నారు ఆంజనేయులుగారు.

''వాళ్ళని చెప్పనీండి'' అంది శ్రీ.

''మూడొంతుల టిక్కెట్లు బ్లాక్ చేశారండీ''

''అసంభవం. మా హాల్లో ఎప్పుడూ అలాటి పన్లు జరగవ్" తీక్షణంగా అందామె.

''హాలు ఓనర్లంతా అలాగే అంటారు'' ఎవరో అన్నారు వెనుకనుంచి.

మాడ్చేసేలా చూసిందటు.

''వాళ్ల వాగుడుకేమమ్మా...ముందు మీరిలారండి చెబుతా'' అంటోన్న మేనేజర్ వంక ఆ చూపుల్ని తిప్పేసరికి తేలుకుట్టిన దొంగలా ఉండిపోయాడాయన.

"మీరెవరో మాకు తెలీదుగాని మా మాటలు అబద్ధమని తోస్తే మేనేజర్‌గార్నే అడగండి. మీకు ప్రత్యక్ష రుజువు కావాలంటే ఓసారి హాల్లోకెళ్ళి చూడండి..ఎంతమంది వున్నారో తెలుస్తుంది''

''మీ పేరు?" అనడిగింది శ్రీ.

"సుధాకర్" ఆ యువకుడు చెప్పాడు.

"సుధాకర్‌గారూ...రెండు నిమిషాలు ఓపిక పట్టండి. మేనేజర్‌గారూ...ఇలా రండి" అంటూ శ్రీదేవి మేనేజర్ గదిలోకి దారి తీసింది.

"ఆ అమ్మాయెవరూ? హాలు ఓనర్ కూతురా?" సుధాకర్ మాటలకి వెంటనున్న అతడి బంధువులబ్బాయి అన్నాడు ''నీలకంఠరావుగారమ్మాయి"

ఆ పేరు వింటూనే అదిరిపడ్డాడతడు. "అయితే ఈ హాలు..."

''ఆయనదే''

"మైగాడ్!" అప్రయత్నంగా అతడి నోటివెంట వచ్చిన మాటలకి అతడి చుట్టూ వున్న వాళ్ళు వింతగా, కాస్త అనుమానంగా చూశారు. అతడు తబ్బిబ్బుపడ్డాడు.

"ఫోన్‌చేసి డాడీని పిలవండి...ఇంటి దగ్గరే వున్నారు" మేనేజర్ కుర్చీలో కూర్చుంటూ అంది శ్రీదేవి ఆంజనేయులు గారితో.

"అబ్బే ... ఈమాత్రందానికి డాడీ ఎందుకమ్మా. ఇలాంటివన్నీ మాకు కొట్టిన పిండే. నేను సర్దిచెబుతానుగా"

"అంటే టిక్కెట్లు బ్లాక్‌చేస్తున్నట్టు డాడీకి తెలుసా?"

ఆయన కంగారుపడ్డాడు. "అబ్బే..మరి అసలు బ్లాక్‌చెయ్యలేదమ్మా. సీరూ, మీ ఫ్రెండ్సూ వస్తారని డాడీ చెబితేనూ ఏసీ బాక్సు టిక్కెట్లు మాత్రం అమ్మలేదమ్మా! దాంతో వీళ్లు బ్లాక్‌చేశామంటూ గోల చేస్తున్నారు...."

"అంటే ఓ పది టిక్కెట్లకోసం వీళ్లి ఇంత గొడవచేస్తున్నారంటారు?"

"అహ...అదికాదమ్మా! ఆ కుర్రాడు అబద్ధం....''

"నేన్నమ్మను. పోనీ హాల్లోకెళ్ళి చూసి రమ్మన్నారా?"

ఆమె సూటిగా అడిగేసరికి తల గోక్కుంటూ వుండిపోయాడాయన. విషయం అర్థమైపోయిందామెకి.

"బ్లాక్‌లో ఎన్ని టిక్కెట్లు ఇచ్చారో అవన్నీ కాన్సిల్‌చేసి మళ్ళీ కొత్త టిక్కెట్లు అమ్మండి. లేకపోతే డాడీని పిలవాల్సొస్తుంది"

"అబ్బే ... ఎందుకమ్మా! అలాగే అమ్ముతాం"

"త్వరగా ఆ ఏర్పాట్లు చూడండి. ఇంకెప్పుడూ ఇలాటి కంప్లైంట్స్ రాకూడదు. లేకపోతే డాడీకి చెప్పాల్సొస్తుంది" అనేసి బయటికొచ్చింది వడివడిగా.

"థాంక్యూ మిస్టర్ సుధాకర్! మా హాల్లో టిక్కెట్స్ బ్లాక్‌చేస్తున్నారని మాకింతవరకూ తెలీదు. ఇకనుంచలా జరగకుండా జాగ్రత్తలు తీసుకుంటాం..." ఆమె మాటలు పూర్తిగాకుండానే "అయితే ఇవాల్టి సంగతేమిటి?" అనడిగాడో కుర్రాడు.

"బ్లాక్‌లో అమ్ముతున్న టిక్కెట్లు చెల్లవు. ఇప్పటికే టిక్కెట్లు కొన్నవాళ్ళు లోపలికెళ్ళిపోయారు గనుక ఖాళీవున్న సీట్స్ అన్నిటికీ, అన్ని తరగతులకీ కొత్తగా టిక్కెట్స్ అమ్ముతాం. ఈ కొత్త టిక్కెట్స్ కొన్నవాళ్ళనే లోపలికి రానివ్వమని గేట్‌కీపర్స్‌కి చెబుతాం. మీరెళ్ళి క్యూల్లో నిలబడొచ్చు. టిక్కెట్సన్నీ అమ్మేవరకూ పిక్చర్ మొదలవ్వదు"

"థాంక్యూ మేడమ్" సుధాకర్ మాటలకీ, కృతజ్ఞతాపూర్వకంగా చూసిన చూపులకీ శ్రీదేవికి సిగ్గుగా అన్పించింది. కనురెప్పలు వాటంతటవే బరువుగా వాలిపోతోంటే అతడెళ్ళినవేపే చూస్తూండిపోయింది.

"హాయ్ శ్రీ...కంగ్రాట్యులేషన్స్!" అంటూ చుట్టుముట్టారామె స్నేహితులు.

"అంత పెద్ద విషయాన్ని భలేగా డీల్ చేశావోయ్'' "నువ్వు ఒకటోరకం కావ్యనాయికవని నాకు ముందే తెలుసు." "ఏమైనామన శ్రీది డేరింగ్ అండ్ డేషింగ్ నేచరోయ్" తలోరకంగా అన్నారు.

వాళ్ళ పొగడ్తలకి వుప్పొంగుతూ వాళ్ళు కోరిన డ్రింక్స్ అవీ ఇప్పిస్తోంటే ఫస్ట్ బెల్ మోగింది. గబగబా థియేటర్‌లోకి




నడిచారంతా.

ఏసీ బాక్సులోకడుగు పెట్టిన శ్రీదేవి ఒక్కక్షణం ఆగిపోయింది. తనెప్పుడూ కూర్చునేచోటులో కూర్చున్న దెవరోకాదు- ఇంతక్రితం జరిగిన సంఘటనలో జనానికి నాయకత్వం వహించిన సుధాకర్.

"మన సీట్లలో ఎవరో బైఠాయించారోయ్...లేపెయ్యమా?" అందో చెలికత్తె.

"వద్దులే" అంది శ్రీదేవి.

ఆశ్చర్యంతో నోరు తెరిచారంతా. ఆమె ప్రవర్తనలో హఠాత్తుగా ఇంత మార్పు ఎలావచ్చేసిందో ఎంత తల బద్దలుగొట్టుకున్నా వారికర్థంగాలేదు.

మరోపక్క కెళ్ళి కూర్చున్నారు.

తెరమీద అమితాబ్ విజృంభిస్తున్నాడు. ఎప్పట్లానే ఆమె స్నేహితురాళ్ళు తప్పట్లు కొడుతూ, ప్రశంసలు విసురుతూ అల్లరి చేస్తున్నారుగాని స్వభావ విరుద్ధంగా మౌనంగా వుండిపోయింది శ్రీ.

ఆమెకి తెరమీద అమితాబ్బచన్ కన్పించడంలేదు.

సుధాకర్ కన్పిస్తున్నాడు!

* * *

అలారం గణగణ మోగింది.

గబుక్కున లేచి కప్పుకున్న దుప్పటి తీసేసి కూర్చున్నాడు మురళి.

కళ్ళు మూసుకునే తడుముకుంటూ లేచి లైటు స్విచ్ నొక్కి దేవుడి ఫొటో వున్న వైపు నాలుగడుగులువేశాడు. చేతులు జోడించి కళ్ళు తెరచి శ్రీ వేంకటేశ్వరుణ్ణి చూసి మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు.

తన చదువు నిర్విఘ్నంగా సాగాలనీ, క్లాసుతో డిగ్రీ పాసవ్వాలనీ, ఆ వెంటనే మంచి వుద్యోగం రావాలనీ, తనపై కొండంత ఆశపెట్టుకున్న తనవాళ్ళ నాదుకోవాలనీ కోరుకుంటూ అందుక్కావాల్సిన శక్తినీ ధైర్యాన్నీ సహాయాన్నీ ఇమ్మని రోజూలానే ప్రార్థించాడు. ఆపైన లెంపలేసుకున్నాడు.

తదనంతరం తన చాప దగ్గరికొచ్చి దుప్పటి మడచి పుస్తకం అందుకున్నాడు మురళి.

అలారం గోలకీ, లైటు వెలుగుకీ మెలకువవచ్చింది మంచంమీద పడుకున్న బాబుకి. లోలోన విసుక్కుంటూ అన్నాడు "టైమెంతయ్యిందిరా?"

"నాలుగు"

"హా...అప్పుడే నీకు తెల్లారిందన్న మాట. ఒరే నాయనా..చిన్నప్పుడు సరిగ్గా నిద్రోయావో లేదోరా! పాపం ఇప్పుడన్నా తృప్తిగా ఎనిమిదింటిదాకా పడుకోరా. మళ్ళీ ఈ గోల్డెన్‌డేస్ తిరిగిరావురా చిట్టి నాయనా"

"అలా కబుర్లు చెప్పకపోతే లేచి చదువుకోకూడదట్రా"

"మొదలెట్టావూ హరికథ! ఒరేయ్ మురళీ...పరీక్షలకింకెంత టైముందిరా?"

''నాలుగు నెలలు''

"అవునుకదా. మరి ఎప్పుడో నాలుగు నెలల తర్వాత వచ్చే పరీక్షలకోసం ఇప్పట్నుంచీ ఈ జంఝాటం ఎందుకురా? లెటజ్ ఎంజాయ్ ది టైమ్. నీ వెధవ అలారం గోలవల్ల మధ్యలో చెడిపోయిందిగానీ అబ్బ...ఎంత గొప్ప కల వచ్చిందనుకున్నావు నాకు. చాలా చక్కని కలరా" లేచి బనీను వేసుకుని కూర్చుంటూ అన్నాడు బాబు.

వింతగా చూశాడు మురళి తన రూమ్మేట్ వైపు.

"అదేవిట్రా...అలా చూస్తావ్? నీకు ఎప్పుడూ చక్కని కలలు రావా?"

తలూపాడు.

"ఎలాటి వొస్తాయిరా?" కుతూహలంగా అడిగాడు బాబు.

"చదువు పూర్తయినట్టూ, వుద్యోగం వచ్చినట్లూ, మావాళ్ళని సంతోషపెట్టినట్టూ..."

"స్టాప్ స్టాప్ స్టాప్. నా ఐడియాస్‌ని ఖూనీ చేసేస్తున్నావుకదురా. చక్కని కలలంటే చక్కని చుక్కల గురించి వచ్చిన కలలేరా బుజ్జినాన్నా! అయినా జీవితమంటే చదువులూ, వుద్యోగాలే కాదురా...లైఫ్‌లో కావల్సినంత థ్రిల్లూ, లవ్వూ, రొమాన్సు-ఇంకా ఇలాటివి చాలా వున్నాయిలే" కాస్త ముందుకి జరుగుతూ అన్నాడు బాబు.

మురళి అయిష్టంగా వింటూ పుస్తకం వైపు చూపులు మళ్ళిస్తున్నాడు మధ్య మధ్య.

"అదేవిట్రా..బుద్ధుళ్ళా అలా కూర్చుండిపోయావ్. నాకొచ్చిన చక్కని కల గురించి తెలుసుకోవాలని 'ఇది'గా లేదుట్రా?"

"చదువుకోవాల్రా"

"అబ్బా...వెధవ చదువు"

ఇబ్బందిగా చూశాడు మురళి.

"ఇంకోసారి చదువు మాటెత్తితే నిన్ను నా రూములో వుండనివ్వనంతే"

బాబు మాటలకి మురళి భయపడ్డాడు. ఎందుకంటే ప్రత్యేకంగా గది తీసుకుని వుండగలిగే ఆర్థిక స్తోమతులేదు మురళికి. బాబు దయదలిచి అతన్ని తన గదిలో వుండమన్నాడు పూరికే. ఇందులో బాబు




స్వార్థంకూడా లేకపోలేదు. మురళి తెలివి తేటలూ ప్రతిభా పరీక్షల్లో తనకి వుపయోగిస్తాయని తన గదిలో వుండ మన్నాడు. తిండికీ బట్టకీ ఫీజులకీ డబ్బు సర్దుకోవడానికి తలకిందులవుతూ రూము అద్దెకూడా భరించడం ఎలాగా అని సత మతమవుతుంటే బాబు తనతో వుండ మన్నాడు. అందుకే మురళి ఎప్పుడూ బాబుకి ఎదురుచెప్పకుండా వుండటం అలవాటు చేసుకున్నాడు. ఎప్పుడైనా కాదంటే రూములోంచి వెళ్ళిపో అని బె ది రి ం చి లొంగదీసుకుంటూండటం బాబుకి అలవాటు.

"అబ్బే ... ఇంకేమన్రా. చెప్పు వింటాను" పుస్తకం మడిచి ఒళ్లో పెట్టుకున్నాడు మురళి మరి గత్యంతరంలేక.

"అలా దారికిరా మరి. ఇందాక కలలోకి ఓ అప్సరస వచ్చిందిరా. అప్సరసంటే ఎవరో తెలుసా?"

తల అడ్డంగా వూపాడు.

"పోనీ కాలేజీ బ్యూటీ అంటే ఎవరో తెలుసా?"

మళ్ళీ తలాడించాడు తెలీదన్నట్టు.

"ఖర్మ ! ఇంకెలా బతుకుతావురా నాయనా. ఇవాళ రేపు నెగ్గుకురావడానికి జనరల్ నాలెడ్జి కావాలోయ్. పోనీ శ్రీదేవి అన్న పేరైనా విన్నావా బుజ్జి తండ్రీ?"

తెలీదన్నట్టు తలాడించాడు.

"ఘోరం! దారుణం! మీ క్లాస్‌మేట్ శ్రీదేవి తెలీదూ? శ్రీదేవి గురించి కలలు కనని స్టూడెంటూ, ఆమె పరిచయంకోసం పాకులాడని పడుచువాడూ వుండడే! అటువంటిదామె ఎవరో కూడా నువ్వెరగవూ? నాయనా మురళీ! నువ్వర్జంటుగా ఆత్మహత్య చేసేసుకోవాలోయ్. ఇంక నీ బతుకు వద్దవండగ"

అంతవరకూ వెర్రిముఖం వేసుకుని చూస్తున్న మురళి ఆ చివరి మాటలకి హర్టు అయ్యాడు. తలొంచుకుని మౌనంగా వుండిపోయాడు-కళ్లల్లో కదిలిన కన్నీటి పొరని బాబుకి చూపించడం ఇష్టంలేక.

"సర్లే...ఓ శుభముహూర్తాన ఆ అందాలరాశిని నీకు చూపిస్తాన్లే గాని ముందు నా కల విను"

మురళి మాట్లాడలేదు. అతడు శ్రీదేవి గురించిగానీ, బాబుకి వచ్చిన కల గురించి గానీ ఆలోచించడంలేదు.తన ఆలోచనంతా చదువు గురించే. చదవాల్సిన పుస్తకాల గురించే!

"మాట్లాడవేం మురళీ?"

"ఏవిటీ" వులిక్కిపడ్డాడు.

"నేన్చెప్పింది విన్నావా లేదా?"

"ఆ...విన్నాను"

"ఇప్పుడు నీకేమన్పిస్తోంది చెప్పు." కొంటెగా చూస్తూ అడిగాడు.

'చదువుకోవాలన్పిస్తోంది' అనబోయి ఆగి "ఏమీ అన్పించట్లేదు" అన్నాడు.

"ఏమీ అన్పించడంలేదా ? నీకంటే రాయిూరప్పా నయంరా. శ్రీదేవి గురించి చెప్పేకైనా ఆమె గురించి నీకాలోచనలు రాలేదంటే ఇంక నీ బతుక్కి అర్థంలేదురా మురళీ"

మురళి కళ్లల్లోంచి వురికి వచ్చిన కన్నీళ్లు చూసి నిశ్చేష్టుడయ్యాడు బాబు.

"అదేవిట్రా మురళీ...ఏడుస్తున్నావా? నేనేదో సరదాగా అంటే ఛా..వూరుకోరా"

"నీకు తెలీదురా బాబూ...మా ఇంటి పరిస్థితులు నీకు తెలిసుంటే నువ్విలా మాట్లాడవురా. మా అమ్మా నాన్నా రెక్కలు ముక్కలు చేసుకుంటూ, పైసా పైసా కూడబెడుతూ తినీ తినకా నాకు పంపుతున్నార్రా. నేనేదో వుద్ధరిస్తాననీ, వారి

కష్టాలు కడతేరుస్తాననీ వాళ్ళ నమ్మకం. అందుకే వాళ్ళ కలల్ని నిజం చెయ్యడానికీ, వాళ్ళిస్తోన్న డబ్బుకి సార్థకత చేకూర్చడానికీ నా సమయాన్నంతా చదువుకే కేటాయిస్తున్నా! మా నాన్న ఇస్తోన్న డబ్బుచాలకే ప్రైవేట్లు చెబుతున్న సంగతి నీకూ తెలిసిందే కదా....ఇపుడు చెప్పు! అవన్నీ మర్చిపోయి ప్రేమలంటూ పలవరించగలనా?" బాధగా అన్నాడు మురళి.

అతడి మాటలకి కదలిపోయాడు బాబు. "సారీ..ఈసారికి క్షమించు. ఇంకెప్పుడూ అలా ప్రవర్తించన్నా. నీ దీక్షే నీకు శ్రీరామరక్ష అవుతుందిరా. తప్పకుండా నువ్వు మీవాళ్ళ కలల్ని నిజం చేస్తావురా. నాకా నమ్మకం వుంది మురళీ''

మురళి కళ్ళల్లో కోటి తారల కాంతులు తళతళ మెరిశాయ్.



## 2

ఉదయమే లేచి స్నానాదులు ముగించి ట్రిమ్‌గా తయారయ్యాడు సుధాకర్.

"నువ్వెప్పుడూ టినోపాల్ ఏజెంట్లా వైట్ డ్రెస్సే తొడుగుతావేం అన్నయ్యా" కాఫీ కప్పు అందిస్తూ అంది సుధాకర్ పెద్దమ్మగారమ్మాయి ప్రభ.

"నాకు తెల్లబట్టలంటే ఎంతో ఇష్టమమ్మా"

"తెల్లబట్టలేనా...తెల్లమనసు కూడా ఇష్టమేనా" హాస్యమాడిందా అమ్మాయి.

"అబ్బో...మాటలు బాగా వచ్చునే. ఇక లాభంలేదు. ఈ మాటలు తగ్గించే మందుని వెదకమని పెదనాన్నతో చెప్పేస్తాను"

"ఫో అన్నయ్యా" సిగ్గుపడిందా పిల్ల.

""నిన్ను పంపేక పోతాన్లే" నవ్వేడు సుధాకర్.

''ఇల్లరికమా? ఎంతాశ!" కిసుక్కున నవ్వింది.

''ఏవిటే...పొద్దున్నే అన్నయ్యని ఆటలు పట్టిస్తున్నావ్" లోపలికొస్తూ అంది సుధాకర్ పెద్దమ్మ.

"నేనేం అనటంలేదమ్మా! అన్నయ్యే అంటున్నాడు తనకి తెల్ల బట్టలంటే ఇష్టంట. తెల్లగా స్వచ్ఛంగా వుండే అమ్మాయి మనసంటే మరీ ఇష్టంట. అలాటి మనసుగల అమ్మాయిని నేనెక్కడ వెదికిపెట్టనూ" అంది ప్రభ గబగబా.

"పెద్దమ్మా...చెల్లాయి మాటలకర్థం ఏవిటంటే త్వరగా బావగార్ని..."

సుధాకర్ మాటలు పూర్తిగాకుండానే-

"అలా మాట్లాడితే నే వెళ్ళిపోతానంతే" అంది బుంగమూతి పెట్టుకుని.

"నిన్ను పంపడం గురించే మాట్లాడుతున్నాను ప్రభా"

"చూడమ్మా" తల్లిచాటుకెళ్తూ అంది.

''పిచ్చిపిల్లా....ఆడపిల్ల ఏదో ఒక రోజున పుట్టింటి గడప దాటకా తప్పదు. మెట్టినింట్లో అడుగు పెట్టకా తప్పదు, ఆ శుభ ఘడియ ఎప్పుడొస్తుందో ఏమో! అసలే మాయదారి కాలం మండిపోతోంది" అందామె.

"నీకెందుకు పెద్దమ్మా. నాకుద్యోగం రానీ ప్రభ నోటికి తాళంవేసే బావగార్ని వెదికి మరీ తీసుకొస్తాను"

"సరేగానీ...త్వరగా తెములు సుధా! ప్రభా...నువ్వెళ్ళి అన్నయ్యకుదారిచూడు"

"చూస్తానుగానీ వుద్యోగం వస్తే అన్నయ్య నాకేం తెస్తాడో కనుక్కో ముందు''

"బావగార్ని తెస్తానని చెప్పేనుగా"

"ఫో అన్నయ్యా" అంటూ విసురుగా జడవెనక్కేసుకుని వీధిలోకినడిచింది ప్రభ.

"దేవుడు మేలుచేస్తే నీకు తప్పకుండా వుద్యోగం వస్తుంది సుధా"

"నీ మాటలు నిజమవుతాయి పెద్దమ్మా" అంటూనే బూట్లు తొడుక్కుని బయటికి నడిచాడు సుధాకర్.

ప్రభ ఎదురొస్తోంటే ఆమె తలమీద చిన్నగా కొట్టి నవ్వుతూ ముందుకు నడిచాడు నీలకంఠరావుగారి ల్లు వెదుక్కుంటూ.

పాలరాతి పలక మీద 'శ్రీ నిలయం' అని రాసివున్న బంగారు వర్ణపు అక్షరాలు కన్పించాయ్. ఆగి తలెత్తి చూశాడు - ఎత్తైన గేటు. గేటు పక్కనే ఘూర్ఖా. గేటుకవతల ఓ చిన్న పూలతోట. మధ్యలో రెండంతస్తుల భవనం. ఓ పక్క సర్వెంట్ క్వార్టర్స్. మరోపక్క కారు గేరేజ్. మొత్తానికోచిన్న సైజు జమిందారు బంగళాలా కన్పించింది సుధాకర్‌కి.

'అమ్మ చెప్పింది అక్షరాలా నిజం. మంచి వుద్యోగం తప్పకుండా దొరుకుతుంది' అనుకుంటూ గేటుదాటి లోపలికి నడిచాడు.

అతడి డ్రెస్ చూసేసరికేమన్పించిందో గాని శాల్యూట్ చేసి నిలబడ్డాడు ఘూర్ఖా.

అదురుతోన్న గుండెల్తో అడుగులేస్తూ లోపలికెళ్లాడు. హాలు సౌందర్యాన్నీ, ఖరీదైన ఫర్నిచర్నీ, వివిధ అలంకారాలనీ చూసి 'రాజమండిరంలో ప్రవేశించలేదు కదా?' అని తబ్బిబ్బుపడ్డాడు.

ఇంతలో అటుగా వచ్చిన నౌకరు ''అయ్యగారి కోసమా?" అనడిగాడు సుధాకర్‌ని.

అతడు తలూపడం ఆలస్యం "కూర్చోండి" అనేసి వెళ్ళిపోయాడు.

సోఫాలో కూర్చుని హాల్లోని ఖరీదైన ఫర్నిచర్ని చూస్తూ నీలకంఠరావుగారి ఐశ్వర్యం గురించి అంచనావెయ్యసాగాడు.

కొంచెం సేపటికొచ్చిన నీలకంఠరావు గారు ఆ అపరిచిత యువకుడి వంక ఎవరన్నట్టు చూశారు.

ఆయన్ని చూస్తూనే లేచి ఆయనకీ, ఆయన వెనుకే వచ్చిన మీనాక్షమ్మగారికీ వినయంగా నమస్కరించాడు.

"నన్ను మీ రెరుగరనుకోండి..." అంటూ జేబులోంచో ఉత్తరం తీసిచ్చాడు.

నీలకంఠరావుగారి నుదురు ముడి పడింది.

కవరు చించి లోపలున్న కాగితం తీసి చదివారు. ఎందుకో ఆయన ముఖం కొంచెం నల్లబడింది. చిరుచెమటలు కూడా పట్టాయ్.

ఆయన్లో అర్ధాంతరంగా వచ్చిన మార్పులకి సుధాకర్ విస్తుబోయాడు. మీనాక్షమ్మగారి క్కూడా కొంచెం ఆశ్చర్యం, కొంచెం అనుమానం కలిగాయ్. "ఎవ్రరాశారండీ?" అనడిగిందామె.

"ఆ- అబ్బే... ఓ స్నేహితుడి... ఛా... బంధువు రాశార్లే. మామూలు విషయమే. రికమండేషన్ లెటర్"

అపనమ్మకంగా చూస్తోన్న భార్య చూపుల్ని ఎదుర్కోలేక సుధాకర్ వైపు తిరిగి "ఎంతవరకూ చదువుకున్నావు బాబూ?" అని ప్రశ్నించాడు.

"బి.కామ్ ఫస్ట్‌క్లాసండి"

"బావుంది. పాపం మీరు చాలాకష్టాల్లు పడ్డారన్న మాట. నిజంగా నాకింతవరకూ ఆ విషయాలు తెలీవనుకో. లేకపోతే ఎప్పుడో వచ్చి మీ అ...మిమ్మల్ని ఓదార్చేవాణ్ని. అంతేలే బాబూ...మంచి వాళ్ళకి దేవుడెప్పుడూ అన్యాయమే చేస్తాడు"

"మీ నాన్నగారిది సహజ మరణమేనా లేక ...." మీనాక్షమ్మగారడిగారు.

"ప్రమాదవశాత్తూ పోయారండీ. అది జరిగి అప్పుడే ఇరవై సంవత్సరాలు కావస్తోందండి"

"అలాగా..." అంటూ ఆవిడేదో అనబోతోంటే ఆ మాటల్ని పొడిగించడం ఇష్టంలేని నీలకంఠరావుగారు మధ్యలో అందుకున్నారు – "నీకు తప్పకుండా వుద్యోగం ఇవ్వాలనే వుందోయ్. కాని ప్రస్తుతం ఎందులోనూ ఖాళీల్లేవు. అయినా చూద్దాం...ఓ వారంరోజులు పోయాక కన్పించు"

"అలాగేనండి... వస్తానండి" లేచి చేతులు జోడించాడు.

ఏదో హిందీ పాట పాడుకుంటూ మేడమీంచి దిగివచ్చిన శ్రీదేవి సుధాకర్‌ని చూసి బ్రమ్మపడిపోయింది. రాత్రి సినిమా హాలు వద్ద తనకి కన్పించి కవ్వించిన యువకుడు మళ్ళీ ఇంత త్వరగా కన్పిస్తాడనీ, అదీ తమ ఇంటికొచ్చి మరీ కన్పిస్తాడనీ ఊహించలేదామె. ఊహించనిది వాస్తవమై కళ్ళముందు సాక్షాత్కరించేసరికి ఏంచేయాలో తెలీక కాలిగోటితో నేలని రాస్తూ నిలుచుండిపోయింది.

అతడు వెళ్తూవెళ్తూ ఆమె వంక చూసి చిన్నగా నవ్వి వెళ్ళిపోయాడు. ఆ నవ్వుకి మరింత కుంచించుకుపోయిందామె.





శ్రీ ఎందుకలా మెట్ల దగ్గరే నిలుచుండిపోయిందో అర్థంకాని మీనాక్షమ్మగారు "శ్రీ" అని పిలిచారు.

వులిక్కిపడి కంగారుగా అంది "ఏం లేదు మమ్మీ...నథింగ్! వూరికే...నథింగ్ నథింగ్..."

ఆవిడ గట్టిగా నవ్వేసి "బావుంది. నేనేమీ అడగందే అలా ఇదై పోతావేమే" అన్నారు.

తండ్రితోబాటు శ్రీ కూడా నవ్వేసింది – "మమ్మీ కూడా పేలే జోకు లేస్తోంది డాడీ" అంటూ.

"అవును డాడీ...ఇప్పుడొచ్చాడే అతడెవరూ?"

"కావల్సినవాళ్ళే" ఆ విషయం ఇష్టం లేనట్టుగా అన్నారు.

"కావల్సినవాడంటే మనకి బంధువా? నీ తరఫు బంధువా? మమ్మీ తరఫా?"

"వుద్యోగాలు కావాలంటూ వచ్చే చుట్టాలంతా మీ డాడీ తరఫువాళ్ళే శ్రీ"

"అయితే అతను నిజంగా మన బంధువా డాడీ? రియల్లీ వెరీ నైస్‌ఫెలో డాడీ. రాత్రి మన థియేటర్ దగర జరిగిన సంఘటనలకి ఇతడే హీరో డాడీ"

"రాత్రి మన థియేటర్ దగ్గరేం జరిగింది శ్రీ?"

రాత్రి జరిగిన సంగతులన్నీ వుత్సాహంగా వివరించిందామె.

"చూశారా చూశారా! ఆ ఆంజనేయులు మన వెనకనెన్ని గోతులు తీస్తున్నాడో. మన శ్రీ అవన్నీ మనకు చెప్పేస్తుందని లేనిపోనివి కల్పించి రాత్రి మీకు చెప్పేడండీ" మీనాక్షమ్మ అంది.

"వ్వాట్ డాడీ? ఆ డర్టీ క్రీచర్ నా గురించి మీకు ఫోన్‌చేసి చెప్పేడా?" బుస్‌మని లేస్తూ అంది శ్రీ.

"అబ్బే...నీ గురించి కాదులేమ్మా!

అయితే మన మేనేజర్ మన వెనుక బాగానే నాటకమాడుతున్నాడన్న మాట" సాలోచనగా అన్నారు నీలకంఠరావుగారు.

"నాటకమని మెల్లగా అంటావేం డాడీ...జనంలో మన టాకీస్ పరువు తీసేస్తుంటేనూ. మనకి తెలీదుగాని మన టాకీస్‌లో టిక్కెట్లన్నీ బ్లాక్ చేస్తామని అంతా అనుకుంటున్నారు డాడీ. రియల్లీ ఇటీజ్ షేమ్‌టు అజ్"

"మనకి తెలీకుండా ఇంకేంచేస్తున్నాడో. అతగాణ్ని పన్లోంచి పీకి ఆ పీడ వదిలించెయ్యండి" అంది మీనాక్షమ్మ.

"అలాటి విషయాల్లో తొందరపడకూడదు. మన గుట్టుమట్లు తెలుసుగనుక ఎంతకైనా తెగిస్తారు. ముందు ముందరి కాళ్ళకి బంధంవేసి తర్వాత మెల్లగా ఆట కట్టించాలి"

"పోనీ ఇందాకొచ్చిన యువకుణ్ని అసిస్టెంట్ మేనేజర్‌గా వేస్తే?" శ్రీ అంది.

"అతణ్నా!" కాస్త తేలిగ్గా అన్నారాయన.

"అమ్మాయి చెప్పింది బావుందండోయ్! ఆ కుర్రాడు కూడా బుద్ధిమంతుళ్లా, నమ్మకస్తుళ్లా వున్నాడు" కూతురికి వంత పాడింది మీనాక్షమ్మ.

"వెల్ సెడ్ మమ్మీ ... ఇంక యస్ అను డాడీ"

"అలాగేనమ్మా! నీ మాటకి అప్పీలుంటే కదా నో అనడానికి'' నీలకంఠరావుగారు నవ్వేశారు.

"థాంక్యూ .... థాంక్యూ డాడీ" హుషారుగా గంతులేస్తూ వెళ్ళిపోయింది శ్రీదేవి లోపలికి.

"చూశారా..మన శ్రీకేం తెలీదన్నారు. సినిమాహాలు గొడవల్ని ఎంత చక్కగా చక్కదిద్దిందో చూడండి"

"అదెవరనుకున్నావ్?నా కూతురోయ్" గర్వంగా అన్నారు నీలకంఠరావుగారు.

"మీ కూతురేగాని తెలివితేటలు మాత్రం నావేనండీ" ఒళ్లు కదిలేలా నవ్వుతూ అందావిడ.

* * *

పిక్నిక్‌కి వెళుతున్నంత సరంజామాతో తన స్నేహబృందంతో కార్లో కాలేజీకి బయల్దేరింది శ్రీదేవి.

దార్లో రాణి కన్పించింది ఆటోని పిలుస్తూ.

"హాయ్ శ్రీ...అదిగో రాణి. తన గొప్ప కారు ట్రబులిచ్చింది కాబోలు ఆటోని పిలుస్తోంది" అంది రమ.

"తను ఛైర్మన్‌గారమ్మాయని పెద్ద గర్వం. పదవోయ్ శ్రీ..ఓ ఆట పట్టిద్దాం" కాంతం అంది.

శ్రీ తన కారుని తీసుకెళ్ళి రాణి పక్కనాపింది.

ఆమె కంటబడేసరికి రాణి ముఖం పాలిపోయింది.

పాలిపోయిన రాణి మొఖం చూసి సంబరపడిపోయింది శ్రీ.

కాలేజీకి కార్లలో వచ్చేది ఇద్దరే... శ్రీదేవీ, రాణీనూ.ఇద్దరూ ధనికులే అయినా ఒకరికంటే ఒకరు అధికులమని నిరూపించుకోడానిగ్గాను తెగ తాపత్రయ పడుతూంటారు.ఎదురైనప్పుడు స్నేహంగా మాట్లాడుకున్నా ఆ స్నేహం మాటల్ని దాటి ముందుకెళ్ళదు. దానికితోడు వారి చుట్టూ తిరిగే వుపగ్రహాలు అక్కడ పొగడ్తూ, ఇక్కడ తెగడ్తూ ఒక రకమైన కోల్డ్‌వార్ వాతావరణ సృష్టికి యధాశక్తి తోడ్పడ్డారు.

"హలో రాణీ .... నీ కారుకి జ్వరమొచ్చిందా?" శ్రీ అడిగింది.

''ఆసుపత్రికెళ్ళిందేమోనే" నళిని అంది.

''సెకండ్ హేండ్ సరుకులు కొనే షాపు చూట్టానికెళ్ళింది కాబోలే" రమ మాటల కంతా పగలబడి నవ్వేశారు.

రాణి మొఖం కందగడ్డలా చేసుకుని కోపంగా చూసింది.

అది గ్రహించిన శ్రీ తన స్నేహితుల నాగమని సైగచేసి ''కారేదే?" అనడి గింది మళ్ళీ.

''స్టేట్స్‌నుంచి మా బ్రదర్ వచ్చాడు. ఏదో పనుండి తను వేసుకెళ్లాడు'' పోజు కొడుతూ అంది రాణి.

''సర్లే...కమాన్'' డోర్ తీసింది శ్రీదేవి.

''థాంక్స్. ఆటోవుందిగా" బింకంగా అంది రాణి.

"ఆ ముసలి ఆటో ఎక్కితే నువ్వొచ్చే సరికి కాలేజీ వదిలిపెట్టడం ఖాయం" సుబ్బలక్ష్మి అంది తనేమీ అనకపోతే బావుండదని.

"ఈ కారెక్కితే నేవెళ్ళేది కాలేజీ క్కాదు...హాస్పిటల్‌కి"

ఆ మాటలు శ్రీకి కోపం తెప్పించాయి. ''అంటే నాకు డ్రైవింగ్ సరిగ్గా రాదనా నీ వుద్దేశం?" అంది సూటిగా.

"మూడు నిమిషాల్లో కాలేజీ ముందు దింపుతుంది మా శ్రీ! ఏమనుకున్నావో" రమ అంది సవాలుచేస్తున్న ధోరణిలో.

''కబుర్లకేం! మూలన కూర్చున్న ముసల్దికూడా చెబుతుంది" వెటకారంగా అంది రాణి.

శ్రీదేవికి రోషం వచ్చింది.

"నేన్నిన్ను మూడు నిమిషాల్లో కాలేజీముందు డ్రాప్ చేస్తాను. బెట్?''

"ఓకే"

"కమాన్"

రాణి కారెక్కింది.

"ఇప్పుడు టైము 9-45...గుర్తుం చుకో'' అంటూనే కారు స్టార్ట్ చేసింది.

మామూలు స్పీడులోవెళ్తే 8నిమిషాలు పడుతుంది. శ్రీ రోజూకొంచెం స్పీడుగానే తోలుతూంటుంది. అయినా ఆరేడు నిమిషాలుపడుతూంటుంది. అలాటిదిప్పుడు కేవలం మూడునిమిషాల్లో వెళ్ళాలి!

ఏమైనాసరే పందెం గెలవాలన్న పట్టు దలతో దృష్టి రోడ్డుమీదే కేంద్రీకరించి అత్యంత వేగంగా నడుపుతోంది శ్రీదేవి. ఆమె చేతిలో స్టీరింగ్ చక్రం గిర్రున తిరుగుతోంది. తన సర్వశక్తినీ డ్రైవింగ్ మీద నిలిపి బండిని దూకిస్తోంది ముందుకి.

కార్లో కూర్చున్న శ్రీ స్నేహితురాళ్లకి ఎక్కడలేని గాభరాగానూవుంది. అనవస రంగా వాళ్ళని రెచ్చగొట్టామే అని బాధ పడసాగారు. ఎగిరెగిరి పడుతోన్న కారు నడకని చూసి ఏ ఏక్సిడెంటో అయ్యి హాస్పటల్ పాలవ్వంకదాని భయపడుతూ వుగ్గబెట్టుకుని కూర్చున్నారు.

రాణి ప్రమాదం గురించాలోచించడం లేదు. పందెం ఓడిపోతానేమోనని భయ పడుతోంది. ఓడిపోతే తలెత్తుకోవడం ఎలాగా అని తీవ్రంగా ఆలోచిస్తోంది.

ఇంక వ్యవధి ఒక్క నిమిషం మాత్రం వుంది. ప్రయాణించాల్సిన దూరం మాత్రం చాలా వుంది. రాణికి ఆనందంగా వుంది. మిగిలినవాళ్లకి కంగారుగా వుంది.

శ్రీదేవి పళ్లు బిగించింది. మొఖం ఎర్రగా వికృతంగా చేసుకుని స్పీడు మరింత హెచ్చించింది.

ఎదురొస్తున్న కారుకి దారివ్వడానికి ఓ పక్కకి కోసిందల్లా ఆ పక్కనుంచి





రిక్షా రావడంతో మరో పక్కకి తిప్పింది.

కారు కీచుమంది.

ఈ గొడవలో కాలేజీకి వెళ్తోన్న మురళికి చిన్నగా డేష్ ఇచ్చింది కారు.

అతడు పడిపోయాడు రోడ్డుపక్కన.

అదేదో ఘనకార్యమైనట్లు అమ్మాయిలు నవ్వారు.

మురళి ట్రాన్పడి చూడసాగాడు పరుగులు తీస్తోన్న కారువంక.

అదేమీ పట్టించుకోకుండా అసలేమీ జరగనట్టే తన మానాన తను కారు నడిపి కాలేజీ గేటుముందు సడన్ బ్రేకుతో ఆపింది శ్రీ.

టైము సరిగ్గా 9-48.

శ్రీ స్నేహితురాళ్ళ హర్షధ్వానాలు చేశారు. హుర్రే హుర్రే, గోవిందో గోవింద అంటూ గోలచేసి రాణిని ఆట పట్టించారు.

మొఖం ఎర్రగా చేసుకున్న రాణికి వాళ్ళ కాకిగోలకన్నా శ్రీదేవి చూపూ, నవ్వూ భరించరానివిగా వున్నాయి. వుడుకుమోత్తనమూ వచ్చింది.

"ఇదీ ఓ గొప్పేనేవిటి'' పొంగి రాబోతోన్న దుఃఖాన్ని నిగ్రహించుకుంటూ అంది.

"గొప్పనేకదా పందెం వేశావ్" రమ అంది.

''కాలేజీకి టైమైపోతుందని అన్నాను గాని పందెం అంటే ఇదేనేమిటి?"

"ఓడిపోయిన ప్రతివాళ్ళూ అనేమాటే ఇది" అని శ్రీ అందోలేదో 'అవునవును' అంటూ గేలిచేస్తూ నవ్వేశారు మిగిలిన



వాళ్ళు.

"వూరికే పళ్ళికిలించి నవ్వితే కాదు. చేవవుంటే ఇంకో పందెం వేస్తాను...కాసు కోమను" సవాలు విసిరింది రాణి.

"ఎన్నిటినైనా మేం రెడీయే. ప్రతి పందెంలోనూ గెలుపు మా శ్రీదే" సుబ్బలక్ష్మి అంది.

"పందెమంటే అల్లాటప్పా మాటకాదు. సరిగ్గా ఆలోచించుకోమను"

"ఏం ఆలోచించక్కర్లేదు. ఎలాంటి పందెమైనాసరే నాదే గెలుపు" గర్వంగా తలెగరేస్తూ అంది శ్రీ.

"ఇప్పుడు చెప్పవోయ్...నీ బోడి పందెం ఏమిటో" కాంతం, రమ ఒక్కసారే అన్నారు.

ఏం పందెం వెయ్యడమా అని అటూ ఇటూ చూస్తోంటే కుంటుకుంటూ తమ వంక వింతగా చూస్తూ కంగారుగా కాలేజీ కెళ్తోన్న మురళి కన్పించాడు. ఆమె కళ్లు మెరిశాయ్.

"అదిగో ఆ మురళిని చూశారుకదా?"

''చూట్టమేమిటి...ఇందాకేకదా అతడి చేత పిల్లిమొగ్గలేయించాం" పగలబడి నవ్వింది రమ.

"అతడు నిన్ను ప్రేమించాలి. పిచ్చిగా ఆరాధించాలి. ఇదంతా నాలుగు నెలల్లోగా జరగాలి. అదీ పందెం..సిద్ధమేనా?" రాణి అంది శ్రీదేవితో సూటిగా.

శ్రీ విస్తుబోయింది.

"ఇదేం పందెం?" మిగిలినవాళ్ళ న్నారు మొఖా మొఖాలు చూసుకుంటూ.

"పందెమంటే ఇదే. వూరికే కబుర్లు చెబితేకాదు ... చేవవుంటే, సత్తావుంటే ఈ పందేనికి ఒప్పుకోమని మీ గ్రేట్ శ్రీదేవికి చెప్పండి" డీలాపడ్డవాళ్ల మొఖాల్ని చూస్తోన్నకొద్దీ విజృంభిస్తోన్న ఆనందంతో అంది రాణి.

"ప్రేమల్తో పందెం ఏమిటి రాణీ! ఆ తర్వాత ఏం జరుగుతుందో, ఎలాటి పరిణామాలు సంభవిస్తాయో ఎవరికి తెలుసు?" నళిని అంది.

"లేకపోతే చిన్నప్పుడు స్కూల్లో పెట్టిన పరుగు పందేల్లాటివి పెట్టమ న్నావా?"

హేళనగా అంది.

శ్రీ మౌనం ఆమె స్నేహితురాళ్లని సందిగ్ధంలో పడేసింది.

"ఏం పాపం...బెల్లంకొట్టిన రాయిల్లా వుండిపోయారు?" కంపరం పుట్టేలా నవ్వింది.

"నేను రెడీ" శ్రీదేవి అంది.

అంతా అదిరిపోయారు.

"నీకు మతిపోయిందా శ్రీ! ఈ వదప బోతు ఏదో పందెం వేసిందని..." నళిని మాటల్ని మధ్యలోనే తుంచేస్తూ, "మీరేం చెప్పొద్దు. రాణీ బెట్‌కి నేను రెడీ" అంది శ్రీదేవి.

ఆమె మాటల్ని కాదనగల ధైర్యంలేక మిగిలినవాళ్ళు బొమ్మల్లా చూస్తూండి పోయారు.

రాణి పరిస్థితి కూడా అలాగే వుంది. ఏదో ఆ పరిస్థితినుండి తప్పించుకోడాని కలా అనేసిందిగాని శ్రీ ఒప్పుకుంటుం దనీ, సరదా పందెం నిజమైన పందెం అవుతుందనీ ఆమె వూహించలేదు!

"అప్పుడే రాణికి ఓడిపోతానన్న భయంపట్టుకుందోయ్" శ్రీ నవ్వింది.

"అదేం కాదు"

"అయితే నువ్వోడిపోతే ఏమిస్తావో ఏమిటో చెప్పు"

"నువ్వోడిపోతే ఏం చేస్తావో చెప్పు"

"నళిని తెలివైంది. తను చెబుతుందిలే..

చెప్పవే" శ్రీ అంది.

నళినికి చెప్పక తప్పలేదు "ఇద్దరికీ కావల్సినన్ని ఆస్తిపాస్తులున్నాయి గనుక ఇచ్చిపుచ్చుకోవటాలు వద్దు. పైగా ఇది పరువు ప్రతిష్టల విషయం గనుక వాటితోనే పందెం వేద్దాం"

"అంటే?" అంతా ఒక్కసారే అన్నారు.

"అంటే... ముందు మామూలుగా చెబుతాను. మీకు నచ్చితే సరే సరి. లేకపోతే ఇంకోటనుకుందాం"

"డోంట్ వర్రీ నళినీ! నువ్వేం చెప్పినా సరే, అదెలాటిదైనాసరే దానికి నేను సిద్ధం. మరి రాణి సంగతి?" శ్రీ మాటలకి "నేన్నీ కన్నా ముందే సిద్ధం" అంది రాణి.

"అయితే చెప్పేస్తున్నాను. ఓడిపోయినవాళ్ళు ఇక్కడున్న వాళ్ళందరి ముందూ గుండు గీయించుకోవాలి. గెలిచినవారి పాదాలమీద గుండుని మూడు సార్లు ఆన్చాలి. ఆ పిమ్మట తనొక్కతే స్వయంగా అందరికీ సర్వ్ చేస్తూ పెద్ద పార్టీ ఇవ్వాలి. అప్పుడెవరేమన్నా అన్నిట్నీ సహించాలి"

అంతా కొయ్యబారిపోయారు.

రాణి మొహంలో కత్తివేటుకి నెత్తురు చుక్కలేదు.

శ్రీకి కూడా మొదట కొంచెం భయమేసినా 'తను ఓడిపోవడమన్నది అసంభవం' అన్న విశ్వాసంతో గర్వంగా నవ్వుతూ, "నువ్వేసిన పందేనికిలాటి శిక్షే వుండాలి. ఏమంటావ్ రాణీ..ఒప్పుకున్నట్టా లేక మాకు తలొంచినట్టా?" అంది.

మురళి గురించి బాగా విన్న రాణి 'తను ఓడిపోవడం కల్ల' అనుకుని "వెన్నిచ్చి పారిపోవడం మా రక్తంలోనే లేదు" అంది.

"అయితే ఓకే'' బొటనవేలు చూపుతూ అంది శ్రీదేవి.

"డబుల్ ఓకే'' రాణి కూడా బొటన వేలు చూపించింది ఆమోద సూచకంగా.

ఈ పందెం పరిణామం ఎలా వుంటుందో అని బెంబేలుపడిపోసాగారు శ్రీ స్నేహితురాండ్రు!



## 3

పాపారాయుడిని గిట్టనివాళ్లు పాపాల రాయుడని పిలుస్తూంటారు.

అతడు చిల్లర జనానికి గురువు, పెద్ద వాళ్ళకి నమ్మిన బంటు, మరీ పెద్దవాళ్ళకి శిష్యుడూనూ.

అతడేం చేస్తాడనేదానికన్నా ఏం చెయ్యడో చెప్పటం తేలిక.

అతడికి నలభై అయిదేళ్ళ వుండొచ్చు గాక, అతడు ఎనిమిదో క్లాసు మాత్రమే చదివి వుండొచ్చుగాక - అయితేనేం అతడికి తెలీని విషయంగాని, రాని విద్య గాని లేదు.

చిల్లర దొంగలూ, బ్లాక్‌లో టిక్కెట్లమ్మే వాళ్ళూ, వీధి రౌడీలూ వగైరా జనమంతా అతడి శిష్యగణంలోనివారే. ఓ రెండు వ్యభిచార కొంపలు వారి పూర్తి యాజమాన్యంలోనూ, అలాటి మిగతా కొంపలు వారి పర్యవేక్షణలోనూ నడుస్తున్నాయ్. ఓ పదిమంది రౌడీలు ఆయన పన్ను సవ్యంగా నిర్వర్తిస్తూంటారు. ఇక ఆ

జిల్లా సారా కాంట్రాక్టును వారే పాడేశారు. ఇవిగాక పోలీసు గొడవల్ని వదిలిస్తూ, రాజకీయ నాయకులకి తోడ్పడుతూ ఎదిరి పక్షంవార్ని యాక్సిడెంట్ల పాలు చేస్తూ మకుటంలేని మహారాజుగా వెలుగొందుతున్నాడు. అతడి కత్తికీ గురికీ మాటకీ ఆ ఊళ్లో ఎదురులేదనే చెప్పాలి.

పదకొండు గంటల ప్రాంతాన పాపారాయుడి జీపు దేవీ థియేటర్ ముందాగింది. దిగాడో లేదో అతగాడొచ్చిన వర్త లోపలికి పాకడం, మేనేజర్ ఆంజనేయులుగారు అక్కణ్నుంచే నమస్కరిస్తూ పరుగున రావడం ఒక్కసారే జరిగిపోయాయ్.

"నమస్కారం నమస్కారం...ఇలా దయచేసేరేవిటి? కాకితో కబురంపితే రెక్కలు కట్టుకుని వాలేవాణ్ని కదా" అన్నాడు మేనేజరు.

"కాకులు గోల చెయ్యడానికే పనికొస్తాయ్ పంతులూ"

"చిత్తం. ఎంత బాగా శలవిచ్చారు. రండి..దయచేయండి" తన గదిలోకి దారి తీస్తూ అన్నాడు ఆంజనేయులు.

"ఏంటి పంతులూ..ఎలావుంది కథ?" కుర్చీలో కూర్చుని వెనక్కి జేరబడి అన్నాడు పాపారాయుడు.

"ఏదో తమ దయవల్ల బాగానే సాగిపోతోందనుకోండి. కానీ..."

"కథ కానీలో కొచ్చిందన్నమాట"

"తమకు తెలీందేవుంది మహాప్రభో! వారం రోజులక్రితం మన కథకి బ్రేక్ పడిపోయిందండి"

"విన్నాను. బ్లాక్‌లో అమ్మడానికి టిక్కెట్లివ్వ నన్నావని మావాళ్లొచ్చి ఏడిస్తేనూ కథేవిటో కనుక్కుందామనే వచ్చాను"

"అబ్బెబ్బే...తమరు కల్పించుకోవల్సినంత వ్యవహారం కాదనుకోండి కానీ మరేమో..."

"పంతులూ .... కథలొద్దు. కారణం చెప్పు"

"చిత్తం. వారం రోజులక్రితం ఓ రోజున మామూలుగానే మనవాళ్ళకి టిక్కెట్లిచ్చేశానండి. అది తెలిసి ఓ కుర్ర వెధవ నేనమ్మా తగుదునంటూ పది మందిని వెనకేసుకొచ్చి అల్లరి చేస్తోంచే నీలకంఠరావుగారమ్మాయి వచ్చి వాళ్ళ పక్షమే మాట్లాడిందండి. టిక్కెట్లు బ్లాక్ చేస్తే నీలకంఠరావుగార్తో చెప్పి నా వుద్యోగం పీకేయిస్తానని బెదిరిస్తేనూ"

"బెదిరిపోయావన్నమాట"

"చిత్తం"

"పంతులూ..నీ గుండెకాయ మరీ ఇంత బెదురుగొడ్డు అయితే ఎలాగయ్యా! వెనక ముగ్గు పెట్టడానికి నేనున్నానుకదా. నీ పని నువ్వు కానిచ్చెయ్..ఏమైనా వస్తే నేన్చూసుకుంటాను. కథ ఇదివరకట్లా సాగాల్సిందే"

"చిత్తం. కానీ నీలకంఠరావుగారికి తెలిస్తే...."

"ముందు తెలియజేసినోడికి టిక్కెట్టిచ్చి పంపించేద్దాం" నవ్వేడు పాపారాయుడు.

వణుకుతూ చేతులు జోడించాడు ఆంజనేయులు.

లేచి "ఎప్పుడైనా ఏ కుర్ర వెధవైనా హీరోనంటూ వచ్చి గొడవచేస్తే ఓ మనిషిని తోలు పంతులూ. ఆ హీరో తోలువలిచి నీకు జోళ్ళు కుట్టిస్తాను" అంటూ వెళ్ళి జీపెక్కాడు పాపారాయుడు.

జీపు గేటుదాటేవరకూ నిలబడి రెట్టింపైన వుత్సాహంతో వెనుదిరిగి తన గదిలో కెళ్ళాడు ఆంజనేయులు.

 

ఆయన తనగదిలో అడుగుపెట్టాడో లేదో "అయ్యగారొచ్చారు" అని గేట్ మేన్ పోలయ్య అరవడంలో కంగారుగా బయటికొచ్చి నీలకంఠరావుగార్నీ, సుధాకర్‌నీ వినయంగా ఆహ్వానించాడు ఓపక్క వారెందుకొచ్చారో అని ఇదైపోతూనే.

"ఏం ఆంజనేయులుగారూ! బావున్నారా" నీలకంఠరావుగారడిగారు.

"అంతా తమ దయ"

"కలెక్షన్స్ ఎలావుంటున్నాయ్? అన్నట్టు పాపారాయుడిలా వచ్చాడేం?" మేనేజర్‌సీట్లో కూర్చుంటూ అడిగారు నీలకంఠరావుగారు.

ఆంజనేయులు కంగారుపడ్డాడు.

సుధాకర్ వింతగా చూశాడాయనవంక.

"అబ్బే...ఏంలేదండీ! మరేమో-ఏం లేదండీ...నిన్న మన హాలుదగ్గర చిన్న గొడవయ్యిందిలెండి. నేను పోలీసుల్ని పిలిస్తేనూ వాళ్ళొచ్చి కొందర్ని నాలుగు తన్నారండి. వాళ్ళలో ఇద్దరు పాపారాయుడి మనుషులంటండి..."

"ఓహో...అయితే మనల్ని బెదిరించడానికి వచ్చాడన్నమాట"

"రామరామ ... అందుక్కాదండి. అసలేం జరిగిందో తెలుసుకోడానికొచ్చాట్ట"

"ఏం జరిగిందో మనల్నడిగి తెలుసుకోడానికి పాపారాయుడు స్వయంగా మద్దగరకి వచ్చాడా? గొప్ప చిత్రమేనే!" ప్రతిమాటా ఒత్తిపలుకుతూ అన్నారు నీలకంఠరావుగారు.

ఆంజనేయులుకి ముచ్చెమటలు పోస్తూంటే, "అవునండి...చిత్రమేనండి. నేనంతా సర్దిచెప్పేశానండి" అన్నారు.

"సరే..దుష్టులకి దూరంగా వుండటం మంచిది"

"చిత్తం"

"ఎన్నడూ లేందీ మధ్య మన హాలు దగ్గర గొడవలుకూడా జరుగుతున్నాయంటే పాపం మీరెక్కువగా శ్రమపడాల్సొస్తున్నదన్నమాటే"

"కరక్ట్‌గా చెప్పేరు. అవతల తేవాల్సిన సినిమాలగురించి, ఇవతలతెచ్చిన సినిమాల గురించి, ఆ పక్కన ఎక్కౌంట్స్‌గురించి, ఈ పక్కన హాలుమెయిన్‌టెనెన్స్ గురించి, మధ్యలో టిక్కెట్ల గొడవ గురించి-ఒకటేమిటి అన్నిపనులూ నేనే ఒంటిచేత్తో చూసుకోవల్సొస్తోందేమో నాకు క్షణంతీరిక వుండటంలేదంటే నమ్మండి"

"నిజమే పాపం. మీకు పనెక్కువయ్యిందని నేనూ వింటున్నాను"

"ఏదో తమరన్నీ తెలిసినవారుగనుక నా కష్టం గుర్తించారుగాని లేకపోతే నా గోడు ఎవరు వింటారు చెప్పండి?"

"అంతమాటనకండిగాని ఇతను సుధాకర్ అని ఈమధ్యే పట్టాపుచ్చుకున్నవాడు. మనక్కావల్సినవాడు. మీకు సాయంగా వుంటాడని అసిస్టెంట్ మేనేజర్‌గా వేశాను"

నెత్తిమీద పిడుగుపడ్డట్టు అదిరిపోయాడు ఆంజనేయులు. అయోమయంగాచూశాడు-నీలకంఠరావుగారి వంకా సుధాకర్‌వంకా ఓ క్షణంసేపు. అంతవరకూ సుధాకర్‌ని పరిశీలనగా చూడని ఆయనిప్పుడు చూసి వులిక్కిపడ్డారతన్ని గుర్తించి. ఇంతలో నీలకంఠరావుగారి మాటలు గుర్తొచ్చాయ్. వారంరోజుల్రితం బ్లాక్‌లో టిక్కెట్లమ్మడంగురించి జరిగిన సంఘటన సుధాకర్, నీలకంఠరావు, శ్రీదేవి కలిసి ఆడిన నాటకం కాదుకదా అని బెంబేలుపడ్డాడు. అయినా తన భయాలేం బయటికి కన్పించకుండా నవ్వి, "తమరేంచేసినా మంచిపనే

చేస్తారని మరోసారి రుజువుచేసుకున్నారు" అన్నాడు ఆంజనేయులు.

"సర్లెండి. ఇతడివాళ్టినుంచీ డ్యూటీలో జాయినైనట్టు రాసుకుని ఏమేంచెయ్యాలో చెప్పండి. చురుకైనవాళ్ళెండి. తేలిగ్గా అందుకుపోతాడు"

"అలాగేనండి"

"మరి వస్తానోయ్" నీలకంఠరావు గారు కారువైపు నడుస్తూ అన్నారు సుధాకర్‌తో.

"మీ రుణం తీర్చుకోలేనండి"

"దీన్దేముంది లేవోయ్... ఇకవుండు"

ఆయనెక్కగానే కారు స్టార్టయ్యింది.

"హు..అబ్బాయ్. నీ పేరేవిటన్నావ్" ఆంజనేయులడిగాడు అదోలా ముఖం పెట్టుకుని.

''సుధాకరండి''

''అయ్యగారికి కావల్సినవాడివన్న మాట. ఫర్లేదు... పెద్దపట్టే పట్టావ్"

''మీరేమంటున్నారో నాకు తెలీడం లేదండి''

''తెలుస్తుందయ్యా .... తెలుస్తుంది. ఇంతకీ నువ్వు అయ్యగారికేమవుతావ్?''

''ఏమీ అవ్వనండి''

''అవ్వవూ?"

''అవ్వనండి''

''మరైతే ముక్కూమొఖమూ ఎరగని సిన్నెలా తీసుకొచ్చి అసిస్టెంట్ మేనేజర్ చేశారయ్యా"

''క్షమించాలి. మా నాన్నగారూ, నీల కంఠరావుగారూ చిన్ననాటి స్నేహితు లండి''

''ఓహో ... అలా చెప్పు. మీ నాన్నగారేం చేస్తారేవిటి?''

''ఆయనిప్పుడు లేరండి''





''సరిసరి. నీ గొడవలకేంగానబ్బాయ్ ఇక్కడంతా రూల్‌ప్రకారం నడుచుకో వాలి. అయ్యగారు నీకేవేవో చెప్పివుం డొచ్చుగాక కాని థియేటర్‌కి నేను మేనేజర్ని. అంతా నేను చెప్పినట్లు నడచుకోవాలి. మీకు సంబంధం లేని వ్యవహారాల్లో తల దూర్చకూడదు. మీ పనేమిటో తలొంచుకుని చేసుకుపోవాలి తప్ప ఇదన్యాయం అదన్యాయం అని జనాన్ని పోగుజేసి అరవకూడదు. నీకెంత చనువున్నా ప్రతిదీ నీలకంఠ రావుగారికి చెప్పకూడదు. చెబితే నీకే నష్టం. నువ్వు చెప్పేదంతా ప్రసన్నంగా విని నీ తోక కత్తిరించడం నీలకంఠరావు గార్లాటి పెద్దల పద్ధతి...తెల్సిందా? నా మాటిని అందర్లా నీమానాన నువ్వుంటే నీకూ లాభం వుంటుంది. ఏమంటావ్?"

"అలాగేనండి"

"అదీ మంచిమాట. తప్పకుండా వృద్ధిలోకొస్తావోయ్. పెద్దలమీద ఆ మాత్రం గురీ, గౌరవంవుంటే చుక్కల్ని చూస్తావోయ్. ఇక ఎకౌంట్స్ సెక్షన్‌లో కెళదాంరా. ఈమధ్య మన థియేటర్ కనుబంధంగా ఓ చిన్న ఫిల్మ్ డిస్ట్రి బ్యూటింగ్‌సంస్థకూడా పెట్టాంలే. ప్రస్తుతం మన జిల్లాకే పరిమితమైనా మెల్ల మెల్లగా విస్తరింపజెయ్యాలని పథకం. అంచేత ఎకౌంట్స్ సెక్షన్ని పకడ్బందీగా ఏర్పాటుచేశాం" అంటూ సెక్షన్‌లోకి తీసుకెళ్ళి సుధాకర్‌ని అందరికీ పరిచయం చేసి ఆ పిమ్మట అతడు చెయ్యాల్సిన పనుల గురించి వివరించి చెప్పాడు ఆంజనేయులు.

మేట్నీ వదిలేక ఆంజనేయులుతో చెప్పి వచ్చేశాడు సుధాకర్.

అతడికివాళెంతో ఆనందంగా వుంది. నిరుద్యోగం విలయతాండవం

చేస్తోన్న ఈరోజుల్లో తనకో చక్కని ఉద్యోగం ఇంత త్వరగా వస్తుందనీ, తనింత త్వరగా జీవితంలో సెటిల్ అవుతాననీ, తన కలలన్నీ ఇంత వేగంగా



వాస్తవ రూపం ధరిస్తాయనీ అతడు వూహించలేదు.

"నీలకంఠరావుగారూ, మీ నాన్నా స్నేహితులు. నువ్వెళ్ళి అడిగితే ఆదుకోక పోరు" అని తల్లి ఓ చిన్న ఉత్తరం రాసిచ్చినప్పుడు కూడా కోటీశ్వరులకి చిన్ననాటి స్నేహాలు గుర్తుంటాయా అనుకున్నాడుగాని గుర్తుంచుకుని తనకి ఆశ్రయం ఇస్తారనుకోలేదు. ఓ నాల్రోజులుపోయాకకన్పించమన్నప్పుడు కూడా – 'ఇది మొండిచెయ్యి చూపే బేరమే' అనుకున్నాడు గానీ విందు భోజనంలాంటి ఉద్యోగం 'ఇస్తారనుకో లేదు.

ఎంతలో ఎంత మార్పు!

తన అదృష్టానికి పొంగిపోతూ గాలిలో తేలిపోతూ పెద్దమ్మగారింటి కెళ్ళాడు సుధాకర్ – దారిలో పూలూ, అరకేజీ స్వీట్సూ కొనుక్కుని.

"నీకోసమే చూస్తున్నాం సుధా! వెళ్ళిన పనేమయ్యిందీ..కాయా పండా?" అన్నపూర్ణమ్మగారన్నారు ఎదురొస్తూ.

"నీ మాట నిజమవుతుందని ముందే చెప్పేసుగా పెద్దమ్మా! పండే. మామూలు పండు కాదు...ఆపిల్ పండు. నీలకంఠ రావుగారు చాలా మంచివారు పెద్దమ్మా!

నాల్రోజులు పోయాక రమ్మంటే ఏవిటో అనుకున్నానుగానీ వారి థియేటర్లోనే అసిస్టెంట్ మేనేజర్‌గా వేసుకుంటారనుకో లేదు"

"అలాగుట్రా. మీ అమ్మ కడుపు చల్లగా మంచి ఉద్యోగమే వచ్చింది"

"అది అన్నయ్య గొప్ప కాదమ్మా! నేను ఎదురొచ్చినందువల్లే ఉద్యోగం వచ్చింది'' అక్కడే వున్న ప్రభ అంది.

"నువ్వు మొన్నెప్పుడో ఎదురొస్తే ఇప్పుడు కలిసొచ్చిందన్నమాట"

"మన మహత్యం అంతే అన్నయ్యా! కాస్త ఆలస్యంగా పనిచేస్తూంటుంది''

''సర్లేగాని ఈ పువ్వు తీసుకో''

"వట్టి పువ్వులేనా?"

"ఇప్పటికి వట్టి పువ్వులేగాని తీసుకో. పెద్దమ్మా ... నీలకంఠరావుగారు చాలా ధనవంతులమ్మా. వాళ్ళ బంగళా చాలా బావుంటుందనుకో ..." అంటున్న సుధ మాటలకడ్డొస్తూ అంది ప్రభ -

"ఈ కాకా కబుర్లెందుగ్గానీ వున్న మాటేదో సూటిగా చెప్పెయ్యి అన్నయ్యా''

"ఏం లేందే ఏం చెప్పను?''

''పోనీ ఈ మాట చెప్పన్నయ్యా! నీలకంఠరావుగారూ, ఆయన భవనం బావున్నాయి. మరి వారమ్మాయి బావుందా లేదా?''

"నిన్నూ..." చెయ్యెత్తాడు.

తల్లి చాటున దాక్కుని వెక్కిరించింది ప్రభ.

"మీ నాన్నే బతికుండి వుంటే వియ్యమందుకునేవారేమో....ఎవరు చెప్ప గలరు"

"భలేదానివే పెద్దమ్మా! వాళ్ళంతస్తే మిటి, మన అంతస్తేమిటి? వాళ్ళు తలచు కోవాలేగాని కొండమీది కోతిని తేగలరు"

"నువ్వూ కోతివేకదా అన్నయ్యా"

"వాడు కోతి అయితే మరి నువ్వే మవుతావే?" అన్న పూర్ణమ్మగారు నవ్వేరు.

"పిల్లకోతి'' అని నవ్వి ''రేపు ఎల్లుండో ఇల్లు చూసి అమ్మని తీసుకొచ్చే స్తాను పెద్దమ్మా" అన్నాడు సుధ.

''ఇప్పుడు దానికేం తొందరొచ్చింది లేరా. నాల్రోజులు మా ఇంట్లో వుండు''

"నాక్కాదమ్మా తొందర....ప్రభకే తొందరగావుంది. త్వరగా బావగారి అన్వేషణలో పడాలి, తేవాలి, ముక్కుకి మూడుముళ్ళతాడు వేయించాలి. ఇంకా..''

"చూడమ్మా" ఏడుపు మొఖంపెట్టి అంది ప్రభ.

అంతా నవ్వేశారు. ప్రభ కూడా శృతికలపకుండా వుండలేకపోయింది.

* * *

శ్రీదేవి గదిలో నళిని, రమ, కాంతం, సుబ్బలక్ష్మి తలలు పట్టుకుని కూర్చు న్నారు.

శ్రీ తన మెడలోని బీడ్స్ దండని చేతి వేలికి చుట్టుకుంటూ మధ్య మధ్య నోట్లో పెట్టుకుని కొరుకుతూ పచార్లు చేస్తోంది.

"ఆ రాణి ఒట్టి పుడుకుమోతుగొడ్డు. లేకపోతే ఇలాటి పందెం వేస్తుందా?" కాంతం అంది.

"రాణి వేసిందే అనుకో...మన నళిని తెలివేమయ్యిందే? ఓడినవాళ్ళు బుర్ర గొరిగించుకోవాలంటుందా? ఏవెయ్యో రెండు వేలో ఇచ్చుకోవాలంటే సరిపోదూ?" రమ అంది నళిని వంక చూస్తూ.

నళినేమీ మాట్లాడలేదుగాని శ్రీ అంది- "రాణి పొగరణచడానికలాటి శిక్షే వుండాలే. మన ప్రతాపం చూపించడానికిది





చక్కని అవకాశం"

"బాగానేవుందిగానీ ఆ మురళి వట్టి ప్రవరాఖ్యుడే. ఆడగాలి తగిలేనే వంకర్లు తిరిగిపోతాడే. అలాటివాడు నీ ప్రేమలో పడతాడా అని. అదీ నాలుగు నెలల్లో!"

సుబ్బలక్ష్మి మాటల్ని సపోర్ట్ చేస్తూ అంది కాంతం– "అవునే. పైగా అతడొట్టి పుస్తకాల పురుగంట. ఆఖరికి సినిమాలు కూడా చూడడంట. అలాటివాణ్ని బోల్తా కొట్టించి వలలో వేసుకోవడం అసాధ్యం"

''నాన్సెన్స్. మీవన్నీ చేతకాని కబుర్లు. చేవలేని కబుర్లు. అందం, ఐశ్వర్యం అన్నీ వున్న అమ్మాయి వలచా సంచే బోల్తాపడని మగవాడీ భూమ్మీదే లేడు" శ్రీదేవి అంది ఎదురుగా నిలువు టద్దంలో కనిపిస్తోన్న తన యవ్వనశోభని అలవోకగా తిలకిస్తూ.

"నువ్వన్నది అక్షరాలా నిజం శ్రీ! కాని ఆ మురళి కలియుగ ప్రవరాఖ్యుడు" నళిని అంది.

"కావొచ్చు. కాని నేను వరూధినిని కాదు...శ్రీదేవినని గుర్తుంచుకోండి. ఒక్క మూడు నెలల్లో ఆ ప్రవరాఖ్యుణ్ని నా కాళ్ళమీద పడేయించి ప్రేమ పాఠాలు వల్లించేట్లు చెయ్యకపోతే నేను శ్రీదేవినే కాదు" అనేసి విసవిసా మేడ దిగి వెళ్ళి పోయింది శ్రీ.

మిగిలినవాళ్ళంతా ఆశ్చర్యంతో మొఖామొఖాలు చూసుకుని ఆపైన నిట్టూర్చారు మౌనంగా.

శ్రీ వస్తుంది వస్తుందని ఓ అరగంట ఎదురుచూశారుగాని ఆమె రాలేదు.

ఒకవేళ తమకి చెప్పకుండా, పిలవ కుండా బయటికెళ్ళిపోయిందేమోనన్పించి బజర్ నొక్కారు.

గోపి వచ్చి లోపలున్న ఆడపిల్లల్ని చూసి గుమ్మం దగ్గరే ఆగిపోయాడు.

అతడి భయాన్ని చూసి ఆనాటి సంఘటన గుర్తొచ్చి రమ, కాంతం, సుబ్బలక్ష్మి పగలబడి నవ్వితే నళిని వారించింది.

''శ్రీ లోపలేం చేస్తోంది?"

"లేరండి"

"లేదూ?" అంతా ఒక్కసారే అన్నారు.

"కారేసుకుని ఎక్కడికో స్పీడుగా వెళ్ళిపోయారండి"

"ఎంతసేపయ్యిందీ?"

"చాలా సేపయ్యిందండీ?"

ఒకరి మొఖాలొకరు చూసుకుని "పోదాం పదండే" అనుకుంటూ బయటి కొచ్చేశారంతా.

"చూశారా....మనల్ని పిలవకుండా, మాటమాత్రంగానైనా చెప్పకుండా ఎలా వెళ్ళిపోయిందో" కాంతం అంది వుక్రోషంగా.

"ఆవిడ కంటికి మనం చీమల్లా దోమల్లా కన్పిస్తామే బాబూ" రమ అంది.

"అదేం కాదే. ఏదో అత్యవసర పని మీద వెళ్లుంటుంది" అంటూ నళిని శ్రీదేవిని సమర్థించడంతో, "శ్రీ అంటే అంత ప్రేమున్నదానివి తల గొరిగించు కోవాలనెందుకు చెప్పేవు.. పేద్ద గొప్పగా" అంది కాంతం.

"ఆ పోటీకలాటి పందెమే వుందాలే" నొచ్చుకొంటూనే అంది నళిని.

"గొప్ప పందెమేలే!" నిరసనగా అంది సుబ్బలక్ష్మి.

"వాళ్ళకలాటి పందెమే వెయ్యాలే సుబ్బూ! రాణికి, శ్రీకీ తాము కోటీశ్వరుల పిల్లలమని అహంకారమూ, మిడిసి పాటూనూ'' తన అసూయని బయట



పెట్టుకుంది రమ.

"రాణీకన్నా శ్రీ రెండాకు లెక్కువే చదివిందే బాబూ! ఈ ప్రపంచం మొత్తం మీద తనే అందగత్తెననీ ధనికురాల్ననీ ఒకటే గర్వం. ఇందాక చూశావా మన మేడో శ్రీని గురించి జాలిపడితే ఆ మురళిని కాళ్ళమీద పడేట్టు చేస్తానని మనతోనే సవాలు చేసింది. ఇలాటివాళ్ళకలా బుర్ర గొరిగించి సున్నంబొట్లు పెట్టి గాడిదమీదవూరేగించే పందెమే వెయ్యాలి"

కాంతం మాటలకంతా పగలబడి నవ్వారు నళిని తప్ప. శ్రీ ఎదుట ఆమెను పొగడుతూ ఆమె వెనుక పేర్లుపెట్టేవారి మనస్తత్వానికి అబ్బురపడిందామె.

## 4



ఊరి చివరికెళ్ళి ఆగింది చెవర్లెట్ కారు. కారు దిగి విసుగ్గా డోర్ వేసేసి ఆ పక్కనేవున్న చిన్నకొండ ఎక్కింది శ్రీదేవి.

వాతావరణం ప్రశాంతంగా ఆహ్లాద కరంగా వుంది.

కాని శ్రీకి అసహనంగావుంది. కొండ మీద అటూ ఇటూ పచార్లు చేసింది ఎడతెగని ఆలోచనల్తో.

ఎంత ఇదైతే మాత్రం తననంత తక్కువగా అంచనావేసి తనెదుటే తన గురించి చులకనగా మాట్లాడతారా?

కొన్ని నిమిషాలక్రితం స్నేహితురాళ్ళన్న మాటల్ని మళ్ళీ మళ్ళీ మననం చేసుకుంటూ ఆవేశంతో వూగిపోతోంది శ్రీ.

'తన చుట్టూ చేరి తన భజనచేస్తూ' తనిప్పించింది తింటూ, తను చెప్పినట్టు వింటూ తిరిగేవాళ్ళు...ఆ బ్లడీ గాల్స్... రాణితో వేసిన పందెంలో తను గెలవలేనంటారా? తన గురించేమనుకుంటున్నారా దర్టీరోగ్స్?

వుహూ... వాళ్ళ మాటలు తను సహించలేదు. అసలు హేట్ చెయ్యాల్సిన వాళ్ళని చేరదియ్యటం తనదే పొరబాటు. లేకపోతే వాళ్ళకెంత పొగరు! తననంత హీనంగా తీసిపారేస్తారా? వాళ్లసలు తన గురించేమనుకుంటున్నారు?

రాణితోబాటు వీళ్ళక్కూడా తగిన బుద్ధి చెప్పాలి. హైహీల్స్ చెప్పుతో కొట్టినట్టు చెప్పాలి....'

మరికొంచెం సేపటికో స్థిర నిశ్చయాని కొచ్చింది.

గబగబా కొండ దిగి వచ్చి కారెక్కింది శ్రీదేవి. రమ చెప్పిన మురళి అడ్రస్సును గుర్తుతెచ్చుకుంటూ ఆ వైపెళ్ళింది.

ఆడబోయిన తీర్థం ఎదురైనట్లుగా ఎటో వెళ్తూ మురళి కన్పించాడు. ఆమె మనస్సంద్రంలో ఆనందపు కెరటాలు ఎగిసిపడ్డాయ్.

అతడి పక్కగా కారు పోనిచ్చి ఆపి "హాయ్" అని పలకరించింది శ్రీ.

తన పక్కన కారాగినందుకే ఆశ్చర్యపోతున్న మురళి కార్లోని అందాల భరిణె తనని పలకరించేసరికి శిలాప్రతిమే అయ్యాడు.

"ఏమిటలా అయిపోయారు? నన్ను గుర్తుపట్లా...నేనండీ శ్రీదేవిని" కిలకిలా నవ్వుతూ అంది.

తబ్బిబ్బుపడ్డాడు మురళి. "మీరు..."

"నేను నేనేనండీ. ఇలా ఎక్కడికి వెళుతున్నారూ?"

ఆమె అలా కోరకుండానే ప్రత్యక్షమై అడక్కుండానే వరాలిచ్చేస్తోన్న దేవతలా తనతో అన్ని మాటలు మాట్లాడేసరికి ఇది కలో నిజమో తేల్చుకోలేకుండా వున్నాడు మురళి.

అతడి భావాలని చదివిన శ్రీ అందంగా నవ్వి, "ఇది కలో వైష్ణవమాయో అనుకుంటున్నారు కదూ?" అంది. తను మాట్లాడిలేచాలు కలల్లో తేలని పురుషుడుండడని ఆమె నమ్మకం.

"క్షమించండి. మీకు నాతో ఏమైనా పని వుందా?" తేరుకుంటూ అన్నాడు.

"పని లేకపోతే మీతో మాట్లాడకూడదా?"

"మాట్లాడకూడదని కాదుగాని నాకు కొంచెం పని వుందండీ"

"ఆదివారం రోజున పన్లేవిటండి బాబూ! సండే అంటేనే జాలీడే అనర్థం. కమాన్.. కారెక్కండి" డోర్ తీసింది.

"సారీ మేడమ్! నేనత్యవసరంగా లైబ్రరీకెళ్ళి కొన్ని పుస్తకాలు రిఫర్ చెయ్యాల్సుంది"

"చదువూ చదువూ చదువూ! ఏవిటండీ.. పుస్తకాల పురుగులా ఒకటే కలవరిస్తున్నారూ. ఈ రోజుల్లో చదువుకి విలువ లేదండీ...యమ్మేలు కూడా రోడ్లు సర్వే చేస్తున్నారు"

"చదువుకి విలువున్నా లేకున్నా నేను విద్యార్థిని. విద్యని ఆర్జించడమే నా ప్రధాన విధి"

చప్పట్లుకొట్టి "గోల్డెన్ వర్డ్స్ రియల్లీ. మీరు చాలా బాగా మాట్లాడతారు. కాలేజీ డిబేట్స్‌లో ఎప్పుడూ ఫస్టేనా?" అంది శ్రీ.

"అంతా మనవంటే చూస్తున్నారు. నాకనుమతిస్తే వెళ్తాను"

"అయ్ డోంట్ కేర్"

"కాని నేను కేర్ చేస్తాను"

"వై?"

"నేనూ ఈ సంఘంలోని ఒకణ్నే గనుక"

ఆమె నుదురు ముడివడిందో క్షణం.

"పోనీ లైబ్రరీ దగ్గర డ్రాప్‌చేస్తాను రండి"

"సారీ. నాకు కాళ్ళున్నాయండీ..నడిచి వెళ్ళగలను"

"అయితే మాకు కాళ్లు లేవనా మీ వుద్దేశం?" జేవురించిన మొఖంతో అంది శ్రీ.

"మీకు కాళ్ళతోబాటు కార్లూ వున్నాయి గనుక మీరా కార్లని నమ్ముకోవడంలో తప్పులేదు"

"కారు లేదని మీకంత అసూయగా వుంటే కారిస్తాను తీసుకోండి"

"కారుల్లో షికారు చెయ్యాలన్న అత్యాశల్లేవులెండి"

"అత్యాశ లేకపోయినా ఆయాచితంగా అంది వస్తే?"

ఆమెవంక సూటిగా చూసి "నిష్కర్షగా తిరస్కరిస్తాను" అన్నాడు.

ఆ మాటలకామె అహం దెబ్బతింది. ఇంక అతడితో మాట్లాడాలన్పించలేదు. కనీసం వెళ్తున్నానని కూడా చెప్పకుండా విసురుగా డోర్‌వేసి వేగంగా డ్రైవ్ చేసుకుంటూ వెళ్ళిపోయింది శ్రీదేవి.

ఆమె అనుగ్రహానికీ, ఆగ్రహానికీ కారణాలు బోధపడక, 'డబ్బున్నవాలి మూడ్స్ ఎప్పుడెలా మారతాయో ఎవరూ చెప్పలేరు' అనుకుంటూ ఆమె వెళ్ళిన

వైపో అరక్షణంపాటు చూసి నిట్టూర్చి లైబ్రరీ వైపెళ్ళిపోయాడు మురళి.

* * *

"అయితే మీ నాన్నగారూ, నీలకంఠరావుగారూ మంచి స్నేహితులేనన్నమాట" సాభిప్రాయంగా అన్నాడు ఆంజనేయులు.

"అవునండి"జవాబిచ్చాడు సుధాకర్.

"బావుంది బావుంది" అంటూ ఆలోచనలో పడ్డారాయన.

దేవీఫిలిమ్స్, దేవీ థియేటర్ల మేనేజ్‌మెంట్లో సుధాకర్ కూడా ముఖ్యుడు కావడం ఆంజనేయులుకి ఇబ్బందిగావుంది. దానికి తోడతడు ప్రతిదానికీ ఆరాలు తీస్తూండటంతో తేలుకుట్టినట్లుంటోంది. పైగా తను జిల్లాలోని థియేటర్లకి దేవీ ఫిలిమ్స్‌ద్వారా తక్కువరేట్లకి చిత్రాలివ్వడం, చిత్రాల హక్కులు ఎక్కువకి కొనడం, టిక్కెట్లు బ్లాక్‌లో అమ్మించడం, ఖర్చులు అధికంగా చూపించడం వగైరా వగైరాలద్వారా డబ్బుచేసుకోవడం సుధాకర్ పసిగట్టేశాడని ఆంజనేయులుకి రూఢిగా తెలిసిపోయింది. అందుచేత అతగాడు విషయాల్ని నీలకంఠరావుగారికి చేరవెయ్యకుండానే ఆయనకతడిమీద దురభిప్రాయం కలిగించి మెల్లగా తన దార్లోంచే తొలగించెయ్యాలని ఆలోచిస్తున్నాడు.

ఇంతలో శ్రీదేవి వచ్చింది రూమ్‌లోకి.

"మీరా అమ్మాయిగారూ .... రండి రండి" వినయంగా ఆహ్వానించాడు ఆంజనేయులు.

అక్కడేవున్న సుధాకర్ కూడా విష్ చేశాడు.

"హలో .... హౌ ఆర్యూ" అంటూ వచ్చి కూర్చుంది.

"ఫైన్"

ఆమె ఇదివరకట్లా నవ్వుతూ తుళ్ళుతూ చలాకీగా లేకపోయేసరికి ఏవిటోగా అన్పించింది సుధకి. ఆమె మోముకాస్త ఎర్రబడి కళాహీనంగా వుండటం చూసి ఇక వుండబట్టలేక అన్నాడు, "మీరివాళేదోలా చాలా టైర్డ్‌గావున్నారు"

"అవునమ్మా... మీరు గమనించారో లేదోగాని మీరుచాలా డల్‌గా వున్నారు" అన్నాడు ఆంజనేయులు.

"కొంచెం తలపోటుగా వుందండీ" నుదురు సవరించుకుంటూ అంది.

"అయ్యో... అలాగుటండీ" అంటూ హడావిడిపడిపోతూ ప్యూన్‌ని పిలిచి "నువ్వు పరుగునెళ్ళి ఒక సారిడన్ పట్రా. వచ్చేప్పుడు మన సాయిబు హోటల్లో వేడి వేడి ఫస్టాసైన టీ పంపించమని చెప్పిరా" అన్నాడాయన.

"మూడు టీలు చెప్పండి"

"అలాగలాగే. ఒరే... మూడు టీలు చెప్పు. డబులర్జంట్ సుమా''

అతగాడు పరుగెత్తాడు.

"వినేవాళ్ళకి వెర్రిగా అన్పించొచ్చుగానీ మీక్కాస్త జలుబుచేస్తేచాలు... నాపై ప్రాణాలు పైనేపోతాయంటే నమ్మండి. నాన్నగారు మా యజమానైనా ఈ ఆస్తిపాస్తులకి వారసులూ, అసలైన యజమానీ మీరేకదా'' అన్నాడు ఆంజనేయులు.

'ఈ జిడ్డేవిటి?' అన్నట్టు చూసింది శ్రీ సుధాకర్ వంక చాటుగా నవ్వుతూ.

ప్యూన్ రాగానే అతడి చేతిలోని టాబ్లెట్టూ, టీ అందుకుని ఆమెకందించాడు అత్యంత వినయంగా ఆంజనేయులు.

"పిక్చర్ సగమయ్యిందనుకుంటాను" శ్రీదేవి అంది టీతాగుతూ సుధనుద్దేశించి.

"అప్పుడే సగమేవిటమ్మా... నాలుగో




రీలు జరుగుతూంటుంది'' అన్నాడు ఆంజనేయులు.

"నాకు చాలా బోరింగ్‌గావుంది. మీకర్జంటు పనుల్లేకపోతే ఓ గంటసేపు కంపెనీ ఇవ్వగలరా?'' అంది శ్రీ సుధాకర్‌తో.

అతడు ఇబ్బందిగా కదిలాడు, ఆంజనేయులు వంకచూస్తూ. వెంటనే ఆయనందుకున్నాడు, "వెళ్ళవయ్యా...నీ పని నేన్చూసుకుంటాన్లే. అమ్మగారు పిలిస్తే రాననడానికి మనకెన్ని గుండెలుండాలి''

నవ్వి థాంక్స్‌చెప్పి లేచింది శ్రీ.

సుధాకర్ కూడా లేచాడు.

ఇద్దరూ థియేటర్లోకెళుతూంటే రెప్ప వెయ్యడం మర్చిపోయాడు ఆంజనేయులు. ఎంత అయిష్టంగావున్నా 'చిలకాగోరింకల్లా వున్నారు సుమా' అనుకోకుండా వుండలేకపోయాడు.

"పెరగనీ పెరగనీ వీళ్ళ పరిచయం, తిరుగుళ్ళూ ఇంకా పెరగనీ. మెల్లగా ఈ పిల్లకాకిని గుప్పిట్లోబంధిస్తే నీలకంఠరావు గార్తో ఆట ఆడించొచ్చు.పరువు ప్రతిష్టల కంటే డబ్బులెక్కువకాదు కదా! కావల్సినంత డబ్బు విసిరేస్తారు తండ్రీకూతుళ్ళు. ఇందుకు పాపారాయుడి సాయం చాలా అవసరం. ఈ దెబ్బతో తన కడుపు తీరిపోవాలి. లేకపోతే తనని నవ్వులపాలు చెయ్యడంగాక తనమీద నిఘాగా ఆ సుధాకర్‌గాణ్ని తన అసిస్టెంటుగా అప్పాయింట్ చేస్తారా? చూస్తాను...వీళ్ళ అంతు చూస్తాను'' అనుకున్నాడాయన.

ఏ. సి. బాక్సులో అడుగుపెడుతూనే గేట్‌కీపర్‌ని పిలిచి రెండు కూల్‌డ్రింక్స్ తెమ్మన్నాడు సుధాకర్.

''ఇప్పుడెందుకండీ'' ఓడియంగా అంది శ్రీ.

''నోనో...మీరలా అనొద్దు. నాకు మీరు వుద్యోగం ఇప్పించినందుగ్గాను నేను మీకివ్వగలిగిన బుల్లిపార్టీ ఇదే''

''నేను మీకు జాబ్ ఇప్పించానా?''

''ముమ్మాటికీ మీరే. ఇది ఆనాటి సంఘటన ప్రభావమే అనుకుంటాను. దానిగురించి మనకు తెలుసుగాని మీ నాన్నగారికి తెలీదుకదా?''

"తెలీదని ఎలా చెప్పగలరు?''

''ఒకవేళ తెలిసినా మీ ద్వారాతప్ప మరోవిధంగా తెలియడానికవకాశం లేదు.. ఏమంటారు?''

ఆమె అందంగా సిగ్గుపడింది.

"మీరు నాకింత త్వరగా ఇంతమంచి జాబ్ ఇప్పించి ఇంతవాణ్ని చేసినందుకు మీ ఋణం ఎలా తీర్చుకోవాలో తెలీడం లేదు''

"చిన్న విషయం గురించి మీరు చాలా పెద్దమాటలు మాట్లాడుతున్నారు''

"లేదు మేడమ్..''

"ప్లీజ్...నన్ను శ్రీ అని పిలవండి చాలు''

''దేవీ అని పిలవకూడదా?'' నవ్వుతూ అన్నాడు.

''మీరెలా పిలిచినా సరే! మీ ఇష్టం''

ఇంతలో గేట్‌కీపర్ డ్రింక్స్‌తో రావడంతో సర్దుకుని కూర్చున్నారిద్దరూ.

"అన్నట్టు...మీతో ఓ ముఖ్యవిషయం చెప్పాలి''

సుధ మాటలకి ఏవిటన్నట్టు చూసింది.

"ఏంలేదు మేడమ్! మీ నాన్నగారికి ఆంజనేయుగారిమీద చాలా నమ్మకమని తెలుసనుకోండి. కానీ ఆంజనేయులుగారి మీద నాకు నమ్మకంలేదు. ఆయన చేస్తున్న చాలా అవకతవక పనుల గురించి నేను చాలా విన్నాను.

అసూయతో నేనీమాటలు చెప్పడంలేదు. ప్లీజ్...నన్నర్థం చేసుకోండి"

"ఎందుకలా మీలో మీరే కంగారు పడతారు? కేరీ ఆన్"

"దొంగలెక్కలు కూడా ఎక్కువగానే చూపుతూ చాలా మొత్తాలు స్వాహా చేస్తున్నారు. పాపారాయుడి పేరు వినే వుంటారు. అతగాడితో చేతులు కలిపి టిక్కెట్స్ బ్లాక్‌లో అమ్మిస్తున్నారు. దేవీ ఫిలిమ్స్ ఇన్నాళ్ళూ నష్టంలోనే నడుస్తున్నట్టు చూపిస్తున్నారుగాని నిజానికి చాలా లాభాలు వస్తున్నాయ్. కాని పుస్తకాల్లో కరెక్ట్ ఫిగర్స్ చూపించడంలేదు. మీ నాన్నగారికెన్నో వ్యాపారాలూ, వ్యాపకాలూ వుండటంతో వీటినంతగా పట్టించుకోవడం లేదనుకుంటాను. మీరు యస్సంటే కనీసం ఈ దేవీ ఫిలిమ్స్ అండ్ థియేటర్‌లో అన్నీ సవ్యంగా జరిగేట్లు చూట్టానికి ప్రయత్నిస్తాను"

"ఓకే మిస్టర్ సుధాకర్! మీరు ఆంజనేయులుగారి ఆటలు కట్టించి మా సంస్థల పేరూ తద్వారా మా నాన్నగారి పేరూ నిలుపుతారనే మిమ్మల్ని అసిస్టెంట్ మేనేజర్‌గా వేయించాను. మీవిధి నిర్వహణలో ఏది న్యాయమన్పిస్తే అది చెయ్యండి.... మాకేం అభ్యంతరంలేదు. డాడీతో కూడా చెబుతాను. మీకెలాటి సాయం కావల్సొచ్చినా నాకు చెప్పండి... నేను చేస్తాను. కానీ ఒక్కమాట. ఆంజనేయులుగారు పైకి కన్పిస్తున్నంత మంచి వారు కాదు. ఆయన వెనుక పాపారాయుడి హస్తం వుందని మీరూ గ్రహించారుకదా. వాళ్ళెంతకైనా తెగించగలరు. మీ జాగ్రత్తలో మీరుండండి. మాగురించి మీకు కష్టం కలగటం నాకిష్టంలేదు"

"థాంక్యూ"

"నో మెన్షన్. మీకింకేం ఇబ్బందుల్లేవు కదా?"

"మీ నాన్నగారిలాంటియజమానులూ, మీవంటి గొప్పమనసూగలవారు దొరికేక మాకు ఇబ్బందులేవిటండీ"

"నన్ను వర్ణించమనటంలేదు మహానుభావా! చెప్పమంటున్నానంతే"

"ఇదొక వర్ణనా! నిజానికి నా భావాలు వ్యక్తపరచడానికే సరైన పదాలు నా దగ్గరలేవు. ఉన్నమాటలేవీ మీ గురించి చెప్పటానికి సరిపోవు"

"పోనీ మీకు తెలిసిన మాటల్లోనే చెప్పండి" తన గురించిన పొగడ్త అతడి నోటంట వినాలని వుత్సుకతతో అంది శ్రీదేవి.

"సింప్లీ మార్వలెస్. సాలార్‌జంగ్ మ్యూజియమ్‌లోని వీల్డ్ రెబెక్కా శిల్పం చూసి ఈ శిల్పమే ఇంత గొప్పగా వుండే అసలా శిల్పి వూహల్లోని మూర్తి మరెంత అద్భుతంగా వుండి వుంటుందో గదా అనుకునేంతో ఆశ్చర్యబోయాను. ఇప్పుడన్పిస్తోంది. బహుశా ఆ ముగ్ధమనోహర మూర్తి మీలాగే వుండి వుంటుందని"

"మాటలు రావంటూనేచాలాచెప్పేరు" పొంగిపోతూ అంది.

"మిమ్మల్ని చూస్తోంటే మాటలేమిటి కవిత్వమే పొంగివస్తోంటేనూ"

"అమ్మమ్మ.కవిత్వం చెప్పిచంపకండి బాబూ" గట్టిగా నవ్వేసింది. అతడూ శృతికలిపాడు. తన గురించంత గొప్ప ప్రశంస వినడంతో ఆమె భుజాలు రెండంగుళాలు పొంగాయ్. విజయగర్వంతో నవ్వుకుంది శ్రీ.

కాని అంతలోనే మురళి గుర్తుకొచ్చి ఆమె ఆనందాన్ని హరించేశాడు. మహామహులే తనఅందాన్నీ,ఐశ్వర్యాన్నీ





చూసి మూర్ఛబోతోంటే ఆఫ్టారాల్ ఓ బక్కపీనుగు తననలా తీసిపారేస్తాడా? తన కారెక్కనని అవమానిస్తాడా? ఎంత ఘోరం!!

"ఏవిటలాఅయిపోయారు?" గాభరాగా అన్నాడు సుధాకర్.

"ఏం లేదండీ! పిక్చర్ కూడా బోరింగ్ గానే వుంది. ఇక వస్తానండీ... బైబై" మరోమాట కవకాశమివ్వకుండా వడివడిగా హాల్లోంచి బయటికి నడిచింది శ్రీదేవి.

తన మాటలవల్ల హర్ట్ అయ్యిందేమో లేక తను మితిమీరిన చనువు ప్రదర్శించాదని ఆగ్రహించిందేమో అనుకుంటూ ఆందోళనపడుతూ ఆమె వెనుకే హాలు బయటికొచ్చాడు సుధాకర్.

ఆమె వెనుదిరిగి అతణ్ని చూడనైనా చూడకుండానే వేగంగా వెళ్ళి కారెక్కింది.

మరుక్షణంలో కారు బయటికి దూసుకుపోయింది.

ఆమె స్వభావం అర్థంగాక నిశ్చేష్టుడై అటే చూస్తుండిపోయాడు సుధాకర్. ఆమె తనంతట తాను తనకెందుకంత దగ్గరగా వస్తుందో మళ్ళీ అంతలోనే ఎందుకంత దూరమైపోతుందో ఎంతాలోచించినా అతడికి అర్థంకావట్లేదు.

అతడి అవస్థ చూసి మర్మంగా నవ్వుకున్నాడు ఆంజనేయులు. "వాళ్ళగురించి ముందు ముందు తెలుస్తుందోయ్ పిల్లకాకీ! డబ్బున్నవాళ్లు నీలాటి బొమ్మల్తో సరదాగా వున్నంతసేపూ ఆడుకుంటారు. ఆ

తర్వాత విసిరిపారేసారు. ఆ సంగతెలీక వాళ్ళ సరదాని ప్రేమని భ్రమ పడ్డావో నీ పని – శ్రీమతే రామానుజాయన్న మహా!" అనుకున్నాడు ఆంజనేయులు.

* * *

"గుడీవినింగ్ డాడీ" హడావిడిగా డైనింగ్ హాల్లో అడుగు పెడుతూ అంది శ్రీదేవి.

"ఏవిటింత ఆలస్యమయిందీ? నీ కోసం ఇప్పటివరకూ చూసి ఇప్పుడే కూర్చున్నాం" నీలకంఠరావుగారన్నారు.

మీనాక్షమ్మగారు మాత్రం కూతురి వంకోసారి చూసి తలతిప్పుకుని భోంచేయ సాగారు.

వాష్‌బేసిన్ దగ్గరికెళ్ళి చేతులు కడుక్కుని నేప్‌కిన్‌తో తుడుచుకుంటూ వచ్చి డైనింగ్‌టేబుల్ ముందు తండ్రి పక్కన కూర్చుంది శ్రీ. "కొంచెం బోరుకొడితేనూ అలా షికారెళ్ళొచ్చాను డాడీ"

రంగయ్య ప్లేటు తెచ్చి ఆమె ముందు పెట్టి వడ్డించాడు.

"మమ్మీ ఏమిటివాళ మౌనవ్రతం పాటిస్తోంది" శ్రీ అంది నవ్వుతూ క్రీగంట తల్లిని చూస్తూ.

"ఏంలేదు శ్రీ... పిక్చర్‌కెళ్ళేవా?" నీలకంఠరావుగారడిగారు – అడగటమా, మానటమా అని ఓ పక్క వూగిస లాడుతూనే.

"అవును డాడీ... ఇవాళ కర్రీ బ్రహ్మాండంగా వుందికదూ డాడీ. ఏమైనా మన రంగయ్యది నలభీమపాకమే డాడీ. పద్మశ్రీ ఇచ్చినా తప్పులేదు" గట్టిగా నవ్వేసింది.

రంగయ్య ఆమె మాటలకి పొంగిపోతే మిగిలినవాళ్ళు కాస్త ఇబ్బందిగా కదిలారు. అది గ్రహించి విస్తుబోయిందామె. ఏమిటి వీళ్ళలో హఠాత్తుగా ఇంత మార్పొచ్చిందీ అనుకుందిగాని నోరుతెరచి అడగలేకపోయింది.

ఇంతలో నీలకంఠరావుగారు మెల్లగా అన్నారు. "నీతోబాటు ఇంకెవరో సినిమా చూశారటగా... ఎవరతను?"

కళ్ళు పెద్దవిచేసి చూసిందాశ్చర్యంగా. తండ్రి నోట ఇలాటి మాటలు వినడం ఇదే ప్రథమం!

"డాడీ... ఇవాళ కొంచెం కొత్తగా మాట్లాడుతున్నారే'' వుక్రోషం తన్నుకొస్తోంటే నిగ్రహించుకో ప్రయత్నిస్తూ అంది.

"అహ..అదికాదమ్మా! మరేమో...''

"ఇంకేం చెప్పొద్దుడాడీ! మీకావిషయం ఎవరు చెప్పివుంటారో కూడా నాకు తెలుసు. బట్ అయ్ డోంట్ కేర్''

''అసలు మేం విన్నది నిజమా కాదా అది చెప్పు ముందు'' మీనాక్షమ్మగారు నోరు తెరిచారు.

"ఓహో.,.బోనులో నిలబెట్టి ప్రశ్నిస్తున్నారన్నమాట. ఓకే. మీరు విన్నది నిజమే మమ్మీ. నాతో వున్న ఫ్రెండ్ పేరు మీకు చెప్పేరోలేదో మీ సిఐడీలు. అతడి పేరు సుధాకర్. మన హాల్‌లో అసిస్టెంట్ మేనేజర్‌గా పనిచేస్తున్నాడు. ఈ వివరాలు చాలా? ఇంకా కావాలా?'' కన్నీళ్ళు చిప్పిల్లగా తీక్షణంగా అంది.

నీలకంఠరావు దంపతులు కంగారు పడ్డారు.

"సీరియస్‌గా తీసుకోకు శ్రీ. ఎవరో ఏదో అంటేనూ... ఇదివరకెప్పుడైనా ఎక్కడికెళ్ళేవనిగాని, ఏం చేశావనిగాని ఏమైనా అడిగామా?''

"అడగలేదు డాడీ! మొట్టమొదటి

 

సారిగా ఇప్పుడే అడుగుతున్నారు. ఎందుకడుగుతున్నారోకూడా నాకు తెలుసు''

"ఏవిటే...ప్రతిదీ తెలుసు తెలుసంటూ పూరికే ఎగురుతున్నావ్. పెళ్ళి కావల్సిన పిల్లవి మనకింద పనిచేసే గుమస్తాగాడితో నవ్వుతూ, కేరింతలు కొడుతూ సినిమా చూస్తావా? ఎవరైనా చూస్తే ఏమనుకుంటారోనన్న ఇంగితమన్నా వుందా నీకు?" మీనాక్షమ్మగారన్నారు.

శ్రీదేవి సుధాకర్‌తో కలిసి అల్లరిచేస్తూ సినిమా చూస్తోందనీ, నలుగురూ ముక్కుమీద వేలేసుకుంటున్నారనీ వున్నవీ లేనివీ కల్పించి ఆంజనేయులు ఫోన్‌చేసి చెప్పినప్పట్నుంచీ మీనాక్షమ్మగారి మనసు మనసులో లేకుండాపోయింది.

తమ మోచేతి నీళ్ళు తాగే కుర్రాడితో తమ కూతురు భుజం భుజం కలిపి తిరగటమేమింగుడుపడకుండావుందామెకి. తీరా శ్రీ ప్రేమా దోమా అంటుందేమోనన్న భయం తోడవడంతో కూతురిమీదా సుధాకర్ మీదా అంతులేని కోపంగా వుందామెకి. ఇక వుండబట్టలేక ఆ కోపాన్ని వెళ్ళగక్కేసింది.

కొన్ని క్షణాలవరకూ శ్రీ మాట్లాడలేదు. ముక్కు పుటాలదురు తోంటే తల్లివంకే సూటిగా చూస్తూండి పోయింది.

నీలకంఠరావుగారు పరిస్థితి గ్రహించారు.ఇంకా వూరుకుంటే శ్రీ ఆ కుర్రాణ్నే పెళ్లాడతానని సవాలు చేస్తుందేమోనని భయపడి వెంటనే కల్పించుకుంటూ అన్నారు, "టేకిట్ ఈజీ శ్రీ! ఎవరో ఏదో అన్నారన్న వుక్రోషంతో మమ్మీ ఏదో అంటే అంత ఇదైపోవాలా? నోనో.. ఏం బావోలేదమ్మా! ఆస్తీ అంతస్తూ, పరువూ ప్రతిష్టా చూడకుండా కూతురు ఎవరి వలలోనో పడిపోతోందని ఎవరైనా చెబితే కన్నకడుపు ఆమాత్రం ఆత్రుత పడదా చెప్పు? అయినా ఏదో మా పిచ్చిగానీ ఇవన్నీ నీకు తెలీవా. మన మర్యాదలు మంటగలిపే పని కలలో కూడా నువ్వు చెయ్యవని మాకు తెలీదూ. ఏదో పెద్దవాళ్ళం గనుక ఏదో వాగుతూంటాంగానీ అవన్నీ నువ్వు పట్టించుకోకూడదు శ్రీ. కాదంటే మనం చేసే ప్రతిపనీ మన స్టేటస్‌నిదృష్టిలో పెట్టుకుని చెయ్యాలంతే.. ఏమంటావమ్మా?"

"ఒకళ్ళు చెప్పినట్టు నడవటమంటే నాకసహ్యం "ప్లేట్లో చేతులు కడిగేసుకుని విసురుగా లేచి వెళ్ళిపోయింది శ్రీ.

అవాక్కైపోయారు నీలకంఠరావు దంపతులు.

*   *   *

కాలేజీ లేడీస్ వెయిటింగ్ రూమ్‌లో సీతాకోకచిలుకల్లాంటి ఆడపిల్లలు తెలుగు సినీ హీరోల్లో నెంబర్ వన్ ఎవరా అని తర్జనభర్జనలు పడుతోంటే శ్రీదేవి వచ్చిందక్కడికి తన ఫ్రెండ్స్‌తో.

"దేన్ని గురించే తలలు బద్దలుగొట్టుకుంటున్నారూ" కారు కీ చెయిన్‌ని విలాసంగా తిప్పుతూ అంది శ్రీ.

"మన తెలుగు హీరోల్లో ఎవరు సూపర్‌స్టార్ అని''

"ఛస్ దర్టీ. ముసలివాళ్ళని పట్టుకుని హీరోలని పిలవడమే దారుణం. ఇక వాళ్ళల్లో ఎవరు గొప్పేవిటి నాన్సెన్స్. అసలు వాళ్ళూ హీరోలేనా? అమితాబ్బచన్ ద గ్రేట్ ముందు వీళ్ళసలు నిలవగలరా అని! హీరో లక్షణాలని చెబుతారు చూశావూ....అవన్నీ అమితాబ్‌లో మూర్తీభవించి వున్నాయే. ఆ నడక, ఆ పెర్సనాలిటీ, ఆ చూపు, ఆ సైలెంట్ యాక్షన్, ఆ డైలాగ్ డెలివరీ–ఓహ్.... మార్వెలెస్

కదుటే. మీరూ చూస్తూండండి ఇంకో రెండేళ్ళలో హాలీవుడ్ స్టార్ అయిపోక పోతే నన్నడగండి. రియల్లీ ఎ గ్రేట్ యాక్టర్..."

శ్రీదేవి మాటలు పూర్తికాకుండానే రాణి వచ్చింది-"శ్రీ నోరకాయలు కోస్తు న్నట్టుందే. కేజీ ఎంతేవిటి?" అంటూ.

"నేనేం కోతలు కొయ్యడంలేదు. మా అమితాబ్ సూపర్‌స్టార్ అని తెలీని నీలాటి వాళ్ళకి తెలియజెబుతున్నానంతే"

"ఓహో...ఆ లాంగ్ మాన్ గురించి చెబుతున్నావా!" రాణి గొంతునిండా హేళన.

"నీలా గుంటనక్కలాలేడని అసూయ కాబోలు పాపం" శ్రీ తీసిపోలేదు..

''పోన్లే...వూరుకోండే" సంభాషణ ముదరకుండా మధ్యలో కల్పించుకుంది నళిని.

"సర్లేగాని... మీ ఫ్రండ్‌కి పందెం గుర్తుందోలేదో కనుక్కో. పాపం. అప్పుడే 15 రోజులు కాలగర్భంలో కలిసి పోయాయ్"

రాణి మాటలకి శ్రీ విసురుగా అంది- "తమ సానుభూతికోసం ఎవరూ జోలె పట్టుకుని నిలవలేదిక్కడ. పందెం పందెమే.ఆ పందెమెంత నిజమో రేపు నేను గెలవటమూ అంతే నిజం... గుర్తుంచుకో"

రాణి మాటలకి వెతుక్కొంటోంటే- "పందెం పందెం అంటున్నారు... ఏం పందెమే'' అంటూ చుట్టుముట్టారు అమ్మాయిలు. దాంతో ఆమెకి వుత్సాహం వచ్చి అంది ''శ్రీ, నేనూ పందెం వేసు కున్నామే. శ్రీ క్లాస్‌మేట్ మురళి లేడూ అదేనే... బుద్ధావతారం''

"బుద్ధావతారమా? అంటే కామ్ గోయింగా?"

''ఆఁ...అతడే. అతగాడు మన శ్రీ వెంట ప్రేమ ప్రేమంటూ పడాలి. అదీ పందెం. అలా మూడు నెలల్లో పడకపోతే మన శ్రీ పాపం... ప్రేమగా పెంచుకుం టున్న మూడడుగుల జుత్తునీ కత్తిరిం పించుకోవాలి!"

""ఆఁ!'' బుగ్గలు నొక్కుకున్నా రంతా.

"ఆరోజు ఛస్తేరాదు రాణీ! శ్రీ సవాల్ అంటే సవాలే"

"పోదూ...వట్టిగొడ్డుకి అరుపు లెక్కువలే"

"అదీ చూపిస్తానే! శ్రీ అంటే ఓటమి కూడా భయమేనన్న సంగతి నీకు తెలీదు కాబోలు పాపం.ఇంకెంతలే...ఇంకో మూడునెలల్లో నువ్వు గుండు చేయించు కున్న రోజున నేనంటే ఏవిటో చూపిస్తా నుగా...బై బై" అనేసి ఓమారు తలెగరేసి విసురుగా తన కారువైపు నడిచింది శ్రీదేవి.

"కారు దగ్గరికెందుకు శ్రీ... క్లాసుకి రావా?"

"రాను''

కారెక్కి ఛడాలున డోర్‌వేసి కారుని ముందుకురికించింది శ్రీ.

* * *

"ఏమోయ్ సుధాకరం...ఏంచేస్తున్నావోయ్" మేనేజర్స్ రూమ్‌లోకొస్తూ అన్నాడు ఆంజనేయులు.

''దేవీ ఫిలిమ్స్ ఎకౌంట్ చూస్తున్నానండీ"

"చూడటం మంచిపనేఅనుకో. అయినా అంత సీరియస్‌గా చూడాల్సిన పనిలేదను కుంటాను''

ఆయన వంకోసారి సాభిప్రాయంగా చూసి తిరిగి తనపనిలోపడ్డాడు సుధాకర్.

"ఏవిటో ఈమధ్య అదోరకంగా





వుంటున్నావేమిటోయ్. నీకేమైనా అవసరాలూ, ఇబ్బందులూవుంటే నాతోచెప్పు... క్షణంలో తీర్చిపారేస్తాను. అవేంలేవు .... మనసే బావోలేదంటావూ రాత్రికి నాతో 'సవేరా'కిరా స్వర్గం చూపిస్తాను''

అదోరకంగా నవ్వారాయన.

కంపరంగా అన్పించింది సుధాకర్‌కి.

''చూడబ్బాయ్...నువ్వు కుర్రాడివి, లోకం తెలీనివాడివి. పెద్దవాణ్ని చెబుతున్నాను విను.నలుగుర్తో చేతులు కలిపితే నలభై లాభాలుంటాయి...''

''అలాటి లాభాలమీద నాకాశలేదులెండి''

''ఆశ లేకపోయినా భయమన్నా వుండాలే. అహ..నా వుద్దేశం ఏవిటంటే ఏ పనైనా చేసేటపుడు ముందూవెనకా ఆలోచించమన్నారు పెద్దలు. అన్నీ ఆలోచించికూడా తిన్నగా వెళ్ళి గోతిలో దిగుతానూ అంటావా..నీ ఇష్టంమరి''

ఆయన మాటలవెనుక దాక్కున్న హెచ్చరికలు స్పష్టంగా అర్థమైనా చేస్తున్న పనినాపలేదు సుధాకర్. దాంతో ఆంజనేయులుకి ఒళ్ళంతా తేళ్ళూ, జెర్రూ పాకుతున్నట్టన్పించి కుర్చీలో తిన్నగా కూర్చోలేక అసహనంగా పచార్లు చెయ్యసాగాడు.

ఇద్దరికీ కూడా క్రితంరోజున జరిగిన సంఘటనలు గుర్తుకొచ్చాయ్ ఒక్కసారే.

సుధాకర్ తన గుట్టుమట్లని పసిగట్టడమేగాక తను స్వాహాచేసిన మొత్తం గురించి కూడా తెలుసుకున్నాడని ఆంజనేయులు గమనించాడు. అతగాడా విషయాల్ని నీలకంఠరావుగారి చెవిని వెయ్యకముందే అతణ్ని దారిలోకి తెచ్చుకోవాలనీ, లేకపోతే తన వుద్యోగం వూడటమేగాక పోలీసు కేసుల్లో ఇరుక్కోవల్సివస్తుందనీ భయపడి తిన్నగా వెళ్ళి పాపారాయుణ్ని ఆశ్రయించారు.

''ఏవిటోయ్ పంతులూ..అంతలావు భయపడిపోతున్నావ్! ఏం కథ?''

పాపారాయుడి ప్రశ్నకీ, ఆ వెంట నవ్విన నవ్వుకీ ఆంజనేయులు గతుక్కుమన్నాడు.

"తమరికి తెలీందేవుంది మహాప్రభో! ఎన్నడూ మీ మాట జవదాటనివాడిని. పాల ముంచినా, నీట ముంచినా మీదే భారం''

''అద్సరే...అసలుకథ సంగతిచెప్పు. నీలకంఠరావుగారు నమ్మినబంటువని అన్నీ నీ మీద వదిలేసినందుకు బాగానే చక్కబెట్టుకున్నావన్న మాట"

"తమరే అలా అంటే..."

"తప్పులేదయ్యా! దీపం వుండగానే ఇల్లు చక్కబెట్టుకోమని పెద్దాళ్ళే చెప్పేరు గదా. నువ్వు చేసిందీ అంతేకదా''

ఆయన సర్వజ్ఞుడిలా నవ్వుతోంటే ఆంజనేయులుకి మతిపోయింది. కుడితిలో పడ్డ ఎలుకలా కొట్టుకుంటూ అన్నారు - "ఏదో అమ్మాయిపెళ్ళి చేద్దాంకదాని ఓ పదివేలు...''

''పదివేలకి నువ్వు కక్కుర్తి పడ్తావంటే గాడిదకూడా తుమ్ముద్దయ్యో పంతులూ! మనగ్గర హరికథలు చెప్పొద్దు. వున్న కథేవిటో డొంకతిరుగుళ్ళు లేకుండా సూటిగా చెప్పెయ్.

"మీదగ్గర అబద్ధం ఎందుగ్గాని 15 వేలు..."

"అంటే పాతిక వేలన్నమాట''

''వున్న యదార్థం విన్నవించుకున్నాను. ఇక మీదే భారం''

''భారం నామీద వేశావ్..బాగానేవుంది. మరి బహువుమాట?"

అయోమయంగా చూశాడు ఆంజ

నేయులు.

బిగ్గరగా నవ్వాడు పాపారాయుడు.

"ఇంకా అర్థంకాలేదుటోయ్! ఓ అయిదు పారెయ్... నిన్ను రక్షించేపూచీ నాది"

"అయ్యో! మరీ అంతం టే..."

"ఆ మాటనొద్దు. మనకీ మనకీ చాలా యవ్వారాలున్నాయి గనుక అయిదు దగ్గరే ఆగాను. ఆలోచించుకో...కంగార్లే దులే"

"ఇంక ఆలోచించేదేవిట్లెండి-అవతల నా కొంప అంటించడానికి అగ్గిపుల్ల కోసం వెదుకుతోంటే. అయ్యో ... అలాగే కానివ్వండి. మీరెంత త్వరగా రక్షిస్తే అంత కృతజ్ఞుణ్ని" అంటూ వ్యవహార మంతా వివరించాడు.

"తిన్నగా ఇంటికెళ్ళి విస్కీకొట్టేసి హాయిగా నిద్రపో పంతులూ...అన్నీ నేన్చూసుకుంటానుగా"

"మరి వెళ్ళమన్నారా"

"ఓ ... సాయంత్రం వస్తాను. ఆ కుర్రాడు చూస్తూండగానే టిక్కెట్లు మనవాళ్ళకిచ్చెయ్. మిగతాకథ నేన్చూసు కుంటా"

"చిత్తం"

అతగాడికి అయిదువేలు చదివించుకో వాల్సి వచ్చినందుకు బాధగానేవున్నా మొత్తానికి సుధాకర్ పని పట్టేస్తే ఇక తనకడ్డు వుండదనుకుంటూ పరమానంద భరితుడై తిరిగొచ్చేశాడు ఆంజనేయులు.

అన్నప్రకారం ఆ సాయంత్రం తన అనుచరులతో తిన్నగా మేనేజర్ గదిలో కొచ్చేశాడు పాపారాయుడు.

అతడెవరో తెలీని సుధాకర్ "ఏం కావాలండీ?" అనడిగాడు.

"ఆ సంగతి తర్వాత తెలుస్తుందిగానీ కొత్తగావచ్చిన కుర్రాడివి నువ్వేనా?" కుర్చీ లాక్కుని కూర్చుంటూ అన్నాడు పాపారాయుడు. అతడి అనుచరులు అతడివెనుక చేతులుకట్టుకుని నిలబడ్డారు.

"నేనేనండి"

"అనుకున్నాన్లే! చూడు పంతులూ... ఏటి కెదురీదటం మంచిదా కాదా?"

"కాదండి"

"మరి నువ్వు నలుగుర్తో నారాయణ అనకుండా ఎదురీదాలనుకోవడంలో ఏవైనా వ్యవహారాజ్ఞత వుందంటావా?"

"మీరు దేని గురించి చెబుతున్నారో తెలీడంలేదు"

"అయితే తిన్నగా కథలోకొచ్చేస్తున్నా. ఏం లేదూ మా ఆంజనేయుల్ని ఇబ్బంది పెట్టేస్తున్నావంటేమిటీ? కుర్రాడివి. పైకి రావాల్సినవాడివి ఇలా పెద్దలకెదురు తిరగటం ఏం బావుంటుంది చెప్పు?"

"ఓహో ... ఇంతకీ మీరెవరో చెబుతారా?"

"నేనెవరో అడిగేముందు అసలు నువ్వెవరో, నీ తాహతేమిటో తెలుసుకో నరుడా"

కృష్ణ పరమాత్మలా నవ్వాడు పాపా రాయుడు. ఆయన అనుచరులూ, అప్పుడే అక్కడికొచ్చిన ఆంజనేయులూ శృతి కలిపారు.

కోపాన్ని నిగ్రహించుకో ప్రయ త్నిస్తూ వారి వంక తీక్షణంగా చూశాడు సుధాకర్.

ఆంజనేయులు సినిమా టిక్కెట్ల దొత్తిని పాపారాయుడి చేతికిచ్చాడు - భక్తుడు దేవుడికి ప్రసాదం పెట్టినట్లుగా.

"అవేం టిక్కెట్లండీ?" అడిగాడు సుధాకర్.

"ఏసీపీ... బాల్కనీపీ... కొన్ని





కుర్చీలవీనూ"

"వాళ్ళకెందుకిస్తున్నారు?"

"బయట అమ్మి ప్రజా సేవచెయ్యమని" పాపారాయుడు నవ్వాడు బొజ్జ అదిరేలా.

"నేనెంత వారిస్తోన్నా వినకుండా రోజూ టిక్కెట్లు బ్లాక్‌లో అమ్మిస్తూనే వున్నారు. ఇవాళ హైక్లాసెస్ టిక్కెట్సన్నీ నాముందే బ్లాక్‌లో అమ్మమనిస్తున్నారు. ఇది నేను సహించను" గట్టిగా అన్నాడు.

"ఇవి పట్టుకెళ్ళి మీ పని మీరు చూసుకోండ్రా" సుధ మాటలు పట్టించుకోకుండా పాపారాయుడు టిక్కెట్లు తన అనుచరుల కిచ్చాడు. వాళ్ళెళ్ళిపోతూంటే "ఆంజనేయులుగారూ... మీతోనే నేను మాట్లాడుతూంట. ముందు వాటినాపండి" అన్నాడు సుధాకర్.

విననట్టే వుండిపోయారాయన.

"చూడబ్బాయ్... గట్టిగా అరిస్తే బీపీ పెరుగుద్ది తప్ప ఇంకేం ప్రయోజనంలేదు. వృద్ధిలోకి రావాలనుకుంటే మా ఆంజనేయులో చేతులు కలుపు. మంచి వాటా ఇప్పిస్తాను. నాకక్కర్లేదూ, నేను బుద్ధిమంతుణ్ని అంటావా బుద్ధిగా వుండు. అదీ ఇదీ గాక అరుస్తానంటే కరిచేస్తాడీ పాపారాయుడు. వీడి గురించి నీకు తెలీదని నాకెప్పుడో తెలిసిపోయిందిగానీ ఒక్కసారలా గదిలోంచిబయటికొచ్చి ఎవర్నైనా సరే అడుగు...నా లీలలు వర్ణించి చెబుతారు. పిచ్చిపిచ్చి వేషాలేస్తే నడిబజార్లో అందరూ చూస్తూండగానే లారీ గుద్దించి పచ్చడి చేసేస్తాను... జాగ్రత్త" మాటల మంటల్ని కక్కి విసురుగా బయటికెళ్ళిపోయాడు పాపారాయుడు.

గేటు వరకూ సాగనపడానికాయన్ని అనుసరించాడు ఆంజనేయులు.

పాపారాయుడి మాటలకి ప్రమాన్పడిపోయిన సుధాకర్ తేరుకోడానికి చాలా సేపేపట్టింది. అతడి గురించి పూర్తిగా తెలుసుకోకుండా అతడితో తలపడటం మంచిదికాదన్పించి అప్పటికి వూరుకుండిపోయాడు సుధాకర్.

డ్యూటీ అవగానే తిన్నగా పెత్తల్లి గారింటికెళ్ళాడు. కుశల ప్రశ్నలయ్యాక పెదనాన్న సుబ్బరామయ్యగారిని పాపారాయుడి గురించడిగాడు.

ఆయన వెంటనే కంగారుపడుతూ – "అతగాడితో ఏవన్నా గొడవ పడ్డావేమిట్రా కొంపలీసి" అనడిగారు.

"అబ్బే...అలాటిదేంలేదు పెదనాన్నా! వూరికే అడిగేనంతే. అతడెలాటి వాడేమిటి?"

"ఎలాటివాడని చెప్పను? వూళ్ళో జరిగే ప్రతి వెధవపనిలోనూ అతడి హస్తంవుండి తీరుతుందంటారు. సూటిగా చెప్పాలంటే అతడో గూండా. అతడి కెదురుతిరిగినవాళ్ళ ప్రాణాలు తీయడానిక్కూడా వెనుకాడడు. వాడితో నువ్వేం తగువు పెట్టుకోకు బాబూ"

"అలాగే పెదనాన్నా" అని పాపారాయుడి గురించే ఆలోచిస్తూ ఇంటికి వెళ్ళాడు.

"ఏవిటి సుధా... అలా వున్నావ్?" కొడుకు మొహం చూస్తూనే కంగారుగా అడిగారు విశాలాక్షమ్మగారు.

"ఏం లేదమ్మా...కొంచెం తలపోటుగా వుందంతే"

"పిచ్చినాన్నా! నేన్నిన్ను కన్న తల్లినిరా. తలపోటొస్తే ఎలా వుంటావో నాకు తెలీదూ? జరిగిందేవిటో చెప్పరా నాన్నా"

ఇక అబద్ధం ఆడటం సాధ్యంగాక ఆంజనేయులు సంగతీ, పాపారాయుడి

హెచ్చరికా వివరించి చెప్పేడు. అంతా చెప్పి, "ఇప్పుడేం చెయ్యాలో తోచడం లేదమ్మా! నాకేమని చూస్తూ వూరుకో లేను. కల్పించుకుని ప్రమాదంలో చిక్కు కోనూలేను" అన్నాడు.

"ప్రాణాల విలువ తెలీని మనుషుల్తో చాలా జాగ్రత్తగా వుండాల్రా నాన్నా. అయినా మన పనేమిటో మనం చూసుకోక అనవసరమైన విషయాలన్నీ నువ్వు నెత్తి నేసుకోవడం ఎందుకురా?" ఆందోళనగా అడిగారామె.

"అదేవిటమ్మా..ఆంజనేయులు మోసం చేస్తున్నాడనే కదా నాకుద్యోగమిచ్చింది. మరి నేనూ కళ్ళు మూసుకునెలా వుండను చెప్పు?"

"పోనీ ఓ పన్చెయ్యరా... జరిగిన సంగతులన్నీ పూసగుచ్చినట్టుగా నీలకంఠ రావుగారితో చెప్పెయ్యి. ఏం చేస్తే బావుంటుందో ఆయనే చెబుతారు"

"అలాగేనమ్మా"

"అలాగే అంటే కాదు.ఆయన్తో చెప్పి ఆయన సలహా తీసుకునే వరకూ ఆ పాపా రాయుడితోగాని, ఆంజనేయులుతోగాని గొడవలు పెట్టుకోనని నా చేతిలో చెయ్యి వెయ్యరా"

"అమ్మా!"

"ఒరే...నాకున్నది నువ్వొక్కడివేరా! నీకేమైనా అయితే నా బతుక్కింక అర్థమే ముంటుందిరా"

"అంత మాటనకమ్మా. సరేనమ్మా.. నీ ఇష్టప్రకారమే మాట ఇస్తున్నాను"

తల్లి చేతిలో చెయ్యివేశాడు సుధ.

తృప్తిగా కళ్ళు తుడుచుకుందా తల్లి.

* * *

ఆదివారం అవడంతో మురళి తన గదిలోనే కూర్చుని బోటనీ రికార్డు రాసుకుంటున్నాడు.

ఇంతలో చుట్టుపక్కల ఇళ్ళకు చెందిన అయిదారుగురు పిల్లలు "మురళన్నయ్యా" అంటూ గోలగా పిలుస్తూ బిలబిలమంటూ లోపలికొచ్చారు.

"ష్...తప్పమ్మా! గొడవ చెయ్య కూడదు. వెళ్ళాడుకోండి"

మురళి మాటలు విన్పించుకోకుండా ముందుకి తోసుకొచ్చి ఒగురుస్తూ అన్నా డొకడు, "మరేమో...మురళి అన్నయ్యా మరేమో..."

"నువ్వుండ్రా... నే న్చె బు తా ను. అన్నయ్యా...అమ్మాయొచ్చింది" మొదటి కుర్రాడి చొక్కా పట్టుకుని వెనక్కి లాగి అన్నాడింకో కుర్రాడు.

"అమ్మాయేంటి...సినిమా యాక్టరు" ఓ అమ్మాయి అంది బుగ్గలు నొక్కుకుంటూ ఆశ్చర్యంగా.

"కార్లో వచ్చిందన్నయ్యా" ఇంకెవరో అన్నారు.

"నీ కోసవే వచ్చింది మురళన్నయ్యా"

"నా కోసం కార్లో వచ్చిందా?" ఉలిక్కిపడి అన్నాడు మురళి.

"నీకోసమే వచ్చింది"అంతా కోరస్‌గా అన్నారు.

తనకోసం కార్లో వచ్చే సుందరి ఎవరబ్బా అని ఆలోచిస్తోంటే చిర్నవ్వులు గుమ్మరిస్తూ వయ్యారంగా అడుగులేస్తూ అప్సరాంగనలా నడచివచ్చింది శ్రీదేవి.

ఆమెని చూసి పక్కలకి తప్పుకుని దారిచ్చారు పిల్లలు.

పెన్సిలూ, రికార్డూ పక్కన పెట్టి కంగారుపడుతూలేచి ఎదురెళ్తూ "మీరు... ఇక్కడికి..." అన్నాడు మురళి అయో మయంగా చూస్తూ.

వరాలిచ్చే దేవతలా నవ్వి, "మీ కోసమే





వచ్చాను...మిమ్మల్ని వెదుక్కుంటూ వచ్చాను" అంది. అని అల్లరిగా చూసి నవ్వింది.

గాభరాపడిపోయాడతడు. ఏమనాలో తోచక తబ్బిబ్బుపడుతోంటే "వాట్ సార్.. గుమ్మానికడ్డంగా నిలబడ్డారు. లోపలికి రానివ్వరా?" అందామె.

"అబ్బే...అదేం కాదు. రండి.. రండి" అంటూనే గబగబా మంచం మీద పుస్తకాలవీ తీసేసి ఓ పక్కన పారేసి దుప్పటి దులిపేసి "కూర్చోండి" అన్నాడు కొంచెం దూరంగా చేతులు కట్టుకుని నిలబడి.

అతణ్ని, అతడి వాలకాన్నీ చూస్తోంటే శ్రీకి నవ్వాగటంలేదు. నవ్వితే వ్యవహారం బెడిసికొట్టొచ్చని అతి కష్టంమీద నిగ్రహించుకుంటూ "మీరూ కూర్చోండి" అంది.

"ఫరవాలేదండి"

గదిని పరిశీలనగా చూస్తూ "మీ గది నీట్ గా బావుందండీ" అంది.

ఆ మాటలతడికి విన్పించలేదు. మేక్సీ ధరించి వచ్చిన సంపూర్ణ యౌవనంలో వున్న ఆమెమీంచి దృష్టి మరల్చుకో




లేకుండా వున్నాడు.

ఆతడి చూపుల్ని చదివి గలగలా నవ్వేసింది శ్రీ. గుమ్మంలోనే నిలబడి చోద్యం చూస్తోన్న పిల్లలు కూడా నవ్వేశారు.

మురళి కంగారుపడ్డాడు. సిగ్గుతో చితికిపోయాడు. ఎన్నడూ లేనిది తనేవిటిలా అయిపోయాడివాళని తనని తాను నిందించుకొంటోంటే ఆమె అందుకుంది-

"అడవుల్లో తపస్సు చేసుకునే మహర్షులే అందమైన ఆడపిల్ల కొంగు తగిలేసరికి తపస్సువదిలి వెంటబడ్డారు. మీరేమం టారు?" అంటూ నవ్వింది.

తలొంచుకున్నాడతడు తప్పుచేసినట్లు.

"సారీ... సరదాగా ఏదో అన్నాను. మర్చిపోండి. అన్నట్టు మీరు నాక్కొంచెం హెల్ప్ చెయ్యాలి"

'నేనా?' అన్నట్టు చూశాడు.

"ఏంలేదు. కెమిస్ట్రీ బోరింగ్‌గా వుండి ఫాలో అవ్వలేకపోతున్నాను. మీరు నోట్సు ఏమైనా రాసివుంటే కొంచెం ఇస్తారా?"

మంత్రముగ్ధుడిలా తలూపి నోట్సు తీసిచ్చాడు.

పుస్తకం తిరగేస్తూ- "చాలా బాగా ప్రిపేర్ చేసినట్టున్నారే. బైదిబై... అలా బయటికొస్తారా వెళదాం'' అంది.

"కొంచెం రికార్డ్ వర్కుందండీ"

"ఆదివారం కూడా చదువే అయితే ఎలాగండీ! కాస్త మైండ్‌కి రిలీఫ్ ఇవ్వండి. అలా పార్కుకో, సినిమాకో వెళదాం రండి"

"సారీ... నాక్కొంచెం..."

అతడి వంక సాభిప్రాయంగా చూసింది. ఇంకోసారి రమ్మని అడగ డానికి ఆమె అభిమానం అడ్డొచ్చింది. 'ఈ షోకులెన్నాళ్ళులే. ఇంకో వారం రోజుల్లో ప్రేమభిక్ష పెట్టమంటూ తిరగడూ!' అనుకుని తలెగరేసి "ఓకే. వస్తానూ" అంటూ బయటికి నడిచింది.

పిల్లలు గోలగా ఆమెననుసరించారు.

జరిగిందంతా కలో నిజమో తెల్చు కోలేక కొన్ని క్షణాలపాటు నిశ్చేష్టుడై కూర్చుండిపోయాడు మురళి.





మెల్లగా వాస్తవంలోకొచ్చి ఆమె వచ్చినప్పుడు తను ప్రవర్తించిన తీరుకి సిగ్గుతో కుంచించుకుపోయాడు. చేదు మాత్ర మింగినట్టుగా అన్పించి కొంచెం సేపు మౌనంగా కూర్చుండిపోయాడు. తర్వాత రికార్డ్ అందుకున్నాడు. మరి కొన్ని క్షణాలకే ఆ గొడవ మర్చి పోయాడు.

ఓ అరగంటకి సుడిగాలిలా రూమ్‌లోకి వచ్చాడు రూమ్మేట్ బాబు- ''మురళీ... నిజమేన్రా" అంటూ.

"ఏవిట్రా?"

"నే విన్నది నిజంగా నిజమేన్రా"

"నువ్వేం విన్నావో తెలీకుండా నిజమో కాదో ఎలా చెప్పన్రా"

"అదేరా బాబూ ... మన రూమ్‌కి ఊర్వశి వచ్చిందటగా?"

"ఊర్వశి ఎవరు...?"

''శ్రీదేవేలేరా! అవిడ్ని ఊర్వశి అనీ, బ్యూటీక్వీన్ అనీ కుర్రాళ్ళంతా అంటూం టాంగా"

"నాకు తెలీదుకదరా"

"అది తెలుసుగాని ముందు సంగతి చెప్పరా బాబూ...చంపక"

"వచ్చింది"

"నీ కోసమే?!"

"వూఁ"

''ఏవిటీ...నిజంగా నీ కోసమే?"

తలూపాడు.

"అయితే ఇంకేం నీ రొట్టె విరిగి నేతిలో పడింది పోరా"

అర్థంకానట్టు చూశాడు మురళి.

"నీ ట్యూబ్‌లైట్ బుర్రకి తర్వాత అర్థమవ్వొద్దిగాని ఆమె నీతో ఏం మాట్లా డిందిరా? నా కలలో తరచూ మాట్లాడి నట్టు ఓ మైడియర్ లవ్, ఓ మై స్వీట్ హార్ట్ అందా?"

"అబ్బెబ్బే...ఆవిడ కెమిస్ట్రీ నోట్సు కోసం వచ్చింది. అడిగింది..ఇచ్చానంతే"

''అంతేనా?''

"అంతే''

"అవునూ...తనకి నీ నోట్సే ఎందు క్కావల్సొచ్చింది?"

"చదువుకోడానికి''

"అవిడా! చదవటమా! పోదూ. ఆవిడ కలాంటి దురలవాట్లు లేవు. వీలుంటే కాఫీలూ లేకుంటే యూనివర్శిటీ చుట్టూ ప్రదక్షిణలూనూ. అద్సరే ... ఆవిణ్ని కూర్చోమన్నావాలేదా? కాఫీగాని, టీ గాని తెప్పించావా?"

"ఆ మాట గుర్తులేదురా'' బుర్ర గోక్కున్నాడు మురళి.

"ఇంకెలా పైకొస్తావురా నాన్నా ప్రేమలో"

''ప్రేమేమిట్రా...భలేవాడివే"

''నీకర్థంగాదుగానీ ప్రేమంటే అంతేరా చిట్టినాన్నా! ఇక ఈ రికార్డులూ, పుస్తకాలూ కట్టగట్టి అటకమీద పారెయ్. చదువు గిదువూ అన్నీ మర్చిపోయి పూర్వశితో కార్లలో షికారు కెళుతూ డ్యూయెట్లు పాడెయ్. మొత్తానికి అదృష్టం అంటే నీదిరా మురళీ'' కొంచెం అసూయ ధ్వనించిందతడి కంఠంలో.

"ఎందుకొచ్చిన కబుర్లుగానీ సన్ను రాసుకోనీరా''

''అరె నాన్నా..ఇంక నీకెలా చెప్పాలో నాకు తెలీడంలేదురా. ఆమె నిన్నే వెదుక్కుంటూ ఎందుకొచ్చిందనుకు న్నావ్?''

''నోట్సుకోసం"తకీమని చెప్పాడు.

''అదో వంకరా బుజ్జితండ్రీ! ఆమె నిన్ను ప్రేమిస్తోంది. అందుకే నోట్సు వంకన వచ్చి కలుసుకుంది. అంతేగానీ నీ పుస్తకం చదవాలనీ, పాసవ్వాలనీ కాదు. ఇదివరకోసారి నిన్ను చూసి కారాపి ఎక్కమందని నువ్వు చెప్పావు... గుర్తుందా?''

''ఇవాళ కూడా రమ్మందిరా... పార్కుకో సినిమాకో వెళదామంది''

''నేన్చెప్పలేదూ...అక్షరాలా అది ప్రేమే. ఆ విషయం తెలుసుకోకుండా నువ్వొట్టి ఫూల్‌లా బిహేవ్‌చేసి ఎంత మంచి ఛాన్సు పోగొట్టుకున్నావురా! ఇదే నేనైతేనా ... అబ్బా-జన్మ ధన్యమై పోయేదికదురా. ఊర్వశి తమవంక చూస్తేనే చాలని కుర్రాళ్ళంతా అర్రులు చాస్తోంటే వలచి వచ్చిన వనిత కోర్కెని మొరటుగా తిరస్కరించావంటే...మైగాడ్ నీ గురించేమనుకోవాలో తెలీడంలేదురా మురళీ''

''నువ్వు మరీ ఇదిగా మాట్లాడ తావురా! లక్షాధికార్లూ, నీలాంటి కలవారూ ఆమెకోసం క్యూలో నిలబడుతోంటే ఆమెకి నన్ను ప్రేమించాల్సిన అవస రమేమిట్రా?"

''ప్రేమంటే అంతేరా నాన్నా! ఎప్పు డెలా ఎవరిమీద ఎందుకు పుడుతుందో ఎవరికీ తెలీదు. అంతెందుకూ - మన సినిమాల్లో...నువ్వు సినిమాలు సరిగ్గా చూడవుకదూ-ఇంకెలారా నాన్నా నీతో వేగడం? లవ్ ప్రిన్సిపుల్స్ .... అనగా ప్రేమసూత్రాలు తెలియాలంటే సినిమాలు ముఖ్యంగా తెలుగు సినిమాలు విరివిగా చూడాలోయ్. సర్లే...ఇప్పటికి నేన్చెప్తా గానీ జాగ్రత్తగా విను. కావలిస్తే నోట్ చేసుకో. ధనికులమ్మాయి పేద యువకుణ్నే ప్రేమించి పెళ్ళిచేసుకుంటుంది. ఒకవేళ అబ్బాయి భాగ్యవంతుడైతే అతగాడు తప్పనిసరిగా పేదింటి పిల్లనే

చేసుకుంటాడు ... చేసుకోవాలి కూడా. ఎంచేతంటే ప్రేమ కేసుల్లో అది రూలు''

''అవి కథల్లో తప్ప లోకంలో జరగవురా''

''అమ్మమ్మా..అలా అపార్థం చేసుకోకుమరి. లోకంలో జరిగేవాట్లనే సినిమాలుగా తీస్తున్నారోయ్. అంతెందుకూ ఎదురెదురు ధృవాలు ఆకర్షించుకుంటాయి. అవునా?''

''అవున్నిజమే''

''ప్రేమ సూత్రంకూడా అదేనోయ్! వున్నవాళ్ళమ్మాయీ లేనివాళ్ళబ్బాయి గాని, వున్నవాళ్లబ్బాయీ లేనివాళ్లమ్మాయి గానీ ప్రేమించుకుంటారుతప్ప ఇద్దరు వున్నవాళ్ళూ లేక ఇద్దరు లేనివాళ్ళూ ప్రేమించుకోరు. ఆ సూత్రాన్ని నీకన్వయిస్తే ఇక నీకు ఢోకాలేదనుకోరా మురళీ. ఆమె ప్రేమనందుకో-ఫో! అప్సరసలాంటి భార్య, కుబేరుడిలాంటి మావగారు - వోహ్ .... ఇక కలల్లో తేలవోయ్''

''క్షమించు బాబూ! కలలు కనడం, కోరికల గుర్రాలెక్కి స్వారీ చెయ్యడం నాకు తెలీదని నీకు తెలుసుగా. లేనిపోని ఆశలు పెట్టుకుని ఆరోగ్యాన్నీ, అవకాశాల్నీ పాడుచేసుకోవడం నాకిష్టంలేదు''

"అదికాదు మురళీ..."

"నీ అభిప్రాయం నాకు తెలుసు బాబూ! కాని నేను యదార్థజీవినితప్ప ఊహాజీవిని కాదు. నేనేమిటో, నా పరిస్థితులేమిటో, నేనెంతవరకూ ఎగరగలనో నాకు బాగా తెలుసు. ప్లీజ్...నన్నిలా వదిలెయ్"

పిచ్చివాణ్ని చూసినట్టు చూశాడు బాబు.

రికార్డులో తలదూర్చాడు మురళి.







## 5

"నీలకంఠరావుగారున్నారాండీ?"

హాల్లోని సోఫాలో కూర్చుని వీక్లీ చదువుతున్న మీనాక్షమ్మగారు తలెత్తి చూశారు. గుమ్మంలో సంకోచిస్తూ నిలబడ్డ సుధాకర్‌ని చూసి నుదురు చిట్లించారు.

ఆమె తననెందుకలా దోషిలా చూస్తోందో తెలీక గిలగిల తన్నుకున్నాడు సుధాకర్. రెండునిమిషాలు గడిచినా ఆమె నుండి జవాబు రాకపోయేసరికి "నీలకంఠరావుగారేరాండీ" అనడిగాడు మళ్ళీ. ఆమె ఎదుట ఆమె వాడిచూపులవేడిని భరిస్తూ నిలబడటం అతడికి భరింప శక్యంగాకుండా వుంది.

సమాధానం ఏమీ ఇవ్వకుండానే, కూర్చోమనైనా అనకుండానే లేచి విసురుగా వీక్లీని సోఫాలోకి విసిరేసి లోపలికెళ్ళిపోయిందావిడ.

నిట్టూర్చి ఓపిగ్గా ఎదురుచూస్తూ నిలబడ్డాడు.

కొంచెంసేపటికి పైపుకాలుస్తూ గంభీరంగా నడిచివచ్చారు నీలకంఠరావుగారు.

"నమస్తే సార్"

"నమస్తే! రావోయ్... కూర్చో"

ఆయనకెదురుగుండా వున్న సోఫాలో కూర్చున్నాడు సుధాకర్. ఆయన గంభీరత చూస్తోంటే అతడి గొంతు పెగలటంలేదు.

"ఏమోయ్ ... ఏదైనా పనిమీద

వచ్చావా?" వాడిచూపుల్ని ముద్దచేసి విసురుతూ అన్నారు.

"అవునండీ"

"ఏమిటో అది?" నోట్లోంచి పైపుని తీసి దానిని పరీక్షిస్తూ అన్నారు.

రెండు క్షణాలపాటు సంకోచించి అన్నాడు– "ఆంజనేయులుగారి మీద మీకెంతో నమ్మకమని నాకు తెలుసనుకోండి. కాని..."

"కాని?"

"ఆయనంత నమ్మదగ్గవ్యక్తి కాదండీ! మీ వెనుక చాలా గోతులు తీస్తున్నారు. అక్రమంగా మీ సొమ్ముని కాజేస్తున్నారు. యదార్థం మీకు చెప్పడం నా బాధ్యతగనుక చెప్పాలని వచ్చాను"

"అయ్యో! మేమింకా ఆయనో పెద్దమనిషనుకుంటున్నాం. మా శ్రీ అంటూనే వుంది సుమా! ఇంతకీ ఆయనేంచేస్తున్నారంటావ్?" సీరియస్‌నెస్ ఇట్టే మాయమవడంతో కుతూహలంగా అడిగారాయన. ఇంతసేపూ మీ అమ్మాయిని ప్రేమిస్తున్నాను, పెళ్లిచెయ్యండని అడగబోతున్నాదేమోనని బిగుసుకుపోయి కూర్చున్నారాయన.

ఆయన కంఠంలో వచ్చిన మార్పుకి సుధాకర్‌లో వుత్సాహం వుప్పొంగింది. మీనాక్షమ్మగారొచ్చి ఆయన పక్కనే కూర్చున్నా ఏమీ ఇదవ్వకుండా చెప్ప సాగాడు.

"ఆంజనేయులుగారిమీద విశ్వాసంతో దేవీ థియేటర్ మేనేజ్‌మెంటునీ, దేవీ ఫిల్మ్స్ మేనేజ్‌మెంటునీ కూడా మీరాయనకే వదిలెయ్యడంతో ఆ నమ్మకాన్ని కేష్‌చేసుకోవాలన్న దురాశ పట్టిందండాయనకి. ఫలితంగా అందినంత స్వాహాచెయ్యడం నేర్చుకున్నారు. దేవీ థియేటర్ కలెక్షన్స్‌ని ఫిల్మ్ రిప్రజెంటేటివ్స్‌తో కుమ్మక్కై తక్కువ చూపిస్తున్నారండి. బ్లాక్‌లో టిక్కెట్స్ అమ్మిస్తున్నారు. ఖర్చులెక్కువగా చూపిస్తున్నారు తప్ప ఒక్కపనీ చేయించడంలేదండి. ఇక దేవీ ఫిల్మ్స్ సంస్థకి లాభాలు బాగావస్తున్నా మొదట్నుంచీ నష్టమే చూపిస్తూ వస్తున్నారండి. ఆ సంస్థద్వారా కొన్ని చిత్రాలని మన జిల్లాకి ప్రదర్శనాహక్కులు కొంటున్నారు కదండీ ... తక్కువకి కొని ఎక్కువ కొన్నట్టు ఎకౌంట్స్‌లో రాస్తున్నారండీ! అలాగే జిల్లాలోని థియేటర్లవాళ్ళతో కూడా లాలూచీపడుతున్నారండి! మీకో ఐడియా రావడం కోసం కొన్ని ముఖ్య అయిటెమ్స్ నోట్ చేసుకొచ్చాను. మీరు పరిశీలించండి. ఓ సారి మీరే స్వయంగా ఎకౌంట్ బుక్స్ తిరగేస్తే పరిస్థితి పూర్తిగా అర్థమవుతుందండి"

అతడందిచ్చిన పేపర్‌లోని అంశాలు చదువుతోంటే నీలకంఠరావుగారి భృకుటి ముడివడింది. ముఖం ఎర్రగా మారసాగింది.

"బ్రూట్, ఇడియట్! ఎంత మోసం చేస్తున్నాడు" కోపంగా అన్నారాయన.

"నిజంగా చేశారంటారా ఆయన?" మీనాక్షమ్మగారడిగారు ఆశ్చర్యం, కోపం మిళితమైన స్వరంతో.

"నిజమేనోయ్! ఎంతో నమ్మకస్తుడని బాధ్యతలన్నీ అప్పగించినందుకు బాగానే మోసంచేశాడు. దీనినిబట్టి చూస్తోంటే అథమపక్షం నలభైవేలైనా తినివుంటాడు"

"ఓరి పీడి ఆశ తగలబడను! అతగాడి నక్కవినయాలుచూసి మోసపోయాంగాని గుండెలుతీసిన బంటన్నమాట. వెంటనే వుద్యోగంలోంచి పూడబీకెయ్యండి. పోలీసు కేసుపెట్టి జైల్లో పెట్టించండి

దొంగమాదచ్చోదుని" అన్నా రా వి డ మండిపోతూ.

"చూద్దాం. ఇలాటి విషయాల్లో తొందర పనికిరాదు" అని భార్యతో చెప్పి సుధాకర్‌తో అన్నారు, "సమయానికి విషయాలు చెప్పి చాలా మంచిపని చేశావోయ్. నువ్వు చెప్పకపోతే మేమింకా కళ్ళు మూసుకునే వుందుం సుమా. నేను కొంచెం తీరిక చేసుకునొచ్చి ఎకౌంట్సన్నీ చూస్తాను. అందాక నువ్వు నాకు చెప్పినవిషయం బయటికి పొక్కనీకు''

"అలాగేనండి"

"ఒరె గోపీ! మన...నీ పేరేమిటన్నావోయ్"

"సుధాకరండి"

"మన సుధాకర్‌కి కూల్‌డ్రింక్స్ తీసుకురా"

"ఇప్పుడెందుకండీ'' మొఖమాట పడ్డాడు.

"ఫరవాలేదోయ్... మా సంస్థల్లో ఇంకేవైనా అవకతవకలు జరుగుతూంటే మాకు తెలియజేస్తూండు. నీ పేరు బయటికి రానివ్వంలే. నీలాటి మెరికలాంటి కుర్రాడు మా దగ్గర పనిచేస్తున్నందుకు మాకెంతో సంతోషంగా, గర్వంగా వుందనుకో ఈ నెలనుంచి నీ జీతంకూడా పెంచుతున్నామోయ్"

"థాంక్సండీ"

గోపీ డ్రింక్ తెచ్చాడు.

బాటిల్ ఖాళీ అయ్యాక లేచి "నే వస్తానండీ ! అన్నట్టింకో మాట చెప్పడం మర్చిపోయానండి" అని ఆగాడు సందేహిస్తూ సుధ.

"ఏ విషయం? కూర్చుని చెప్పు"

"పెద్ద విషయం కాదనుకోండీ కానీ.. అదేనండీ ఆంజనేయులుగారికి పాపారాయుడిగారివత్తాసుందండి. ఆంజనేయులుగారి విషయం మీకు చెబితే నన్ను చంపుతానని మొన్న ఆఫీసుకొచ్చి మరీ బెదిరించాడండి"

"ఎవరు? పాపారాయుడే? బద్మాష్. వాడికెన్ని గుండెలూ ... నా ఆఫీసులో కొచ్చి నావాణ్ని బెదిరించేంత మొనగాడయ్యాడా... చూస్తాను''

"మా అమ్మకూడా విషయం మీతో చెప్పి మీ సలహా ప్రకారం నడచుకో మందండి"

ఆలోచనలోపడ్డారునీలకంఠరావుగారు.

అతడి తల్లి ఈయన్తో చెప్పి సలహా పొందమనటం ఏవిటో మీనాక్షమ్మ గారికర్థం కాలేదు. వారిద్దరికీ పరిచయం వుందేమోనని ఓక్షణం సందేహించారుగాని అదెంతోసేపు నిలవలేదు. తమకింద పనిచేస్తోన్న వుద్యోగి తల్లిగా యజమానికి మొరబెట్టుకోమని సలహా ఇచ్చుంటుందని సర్ది చెప్పుకున్నారావిడ.

"సరే...నువ్వు మాత్రం ఆంజనేయులుగార్తో మంచిగానే వుండవోయ్. మిగతా పని నేను చూసుకుంటాన్లే"

"వస్తానండీ... నేన్చెప్పినట్టెక్కడా చెప్పకండేం''

"భ లే వా డి వే. వెళ్ళిరా ... అప్పుడప్పుడూ వస్తూండవోయ్. సిగ్గుపడకు"

"అలాగేనండి...వస్తానండి...నమస్తే''

సుధాకర్ నిష్క్రమించాక మీనాక్షమ్మగారన్నారు- "ఏవిటో అనుకున్నాంగానీ ఈ కుర్రాడు మంచివాళ్ళానేవున్నాడండీ"

"వూఁ...ఆంజనేయులు చాలా తెలివైనవాడు. ఈ కుర్రాడు మనకతడి గురించి చెబుతాడని ఇతడి గురించి లేనిపోనివి చెప్పి ముందరి కాళ్ళకి బంధం వేశాడు. మనం నిజమేకాబోలని నమ్మేశాం."

"నేన్చెప్పలేదుటండీ ... మనమ్మాయి నిప్పులాంటి మనిషనీ, ఇలాటి చిల్లర కుర్రాళ్ళని దరిజేరనివ్వదనీనూ"

"అవునవును. ఇలాటి కుర్రాళ్లుండటం మనకి చాలా మంచిది. ఎప్పుడైనా ఇంటికొస్తే మర్యాదగా చూడు''

''ఏమయినా అబ్బాయి బుద్ధిమంతుడు లెండి''

నీలకంఠరావుగారు భార్య కళ్ళల్లోకి చూశారామె భావం అర్థంగాక. ఆమె కళ్ళల్లో ప్రత్యేక వుద్దేశాలు కన్పించక పోయేసరికి తేలిగ్గా నిట్టూర్చి అవునన్నట్టు తల పంకించారు.

* * *

''కంగ్రాట్యులేషన్స్ శ్రీ'' బిలబిల మంటూ శ్రీదేవి గదిలో ప్రవేశిస్తూ అన్నారామె స్నేహితురాళ్ళు రమ, నళిని కాంతం, సుబ్బలక్ష్మిను.

''హాయ్...కమాన్ కమాన్. ఏవిటంత హుషారుగా వున్నారు?'' అద్దంలోకి చూస్తూ లిప్‌స్టిక్ దిద్దుకుంటోన్న శ్రీ అంది.

"ముందు మా శుభాకాంక్షలు స్వీక రించు శ్రీ"

''ఇవాళ న్యూఇయర్స్‌డే కాదుకదా?"

"కొత్త సంవత్సరం మొదలు కాక పోయినా కొత్త అధ్యాయం మొదలయ్యిం దిగా" రమ అంది.

"మీరేమంటున్నారోనాకర్థంకావట్లేదు"

"నువ్వు మురళి గదికెళ్ళేవుట కదా?" సుబ్బలక్ష్మి అంది సూటిగా విషయంలో కొస్తూ.

"ఓహో... దాని గురించా"

"నీకది తేలిగ్గా కన్పించొచ్చుగాని బాపురే... మేమసలు వూహించను కూడా లేదనుకో. మురళిని కలుసుకోడానికి ప్రత్యేకంగా నువ్వెళ్ళడం, అతడి గదిలో పది నిమిషాలు గడపడం, అతడితో మాట్లాడటం-ఓహ్... తలచుకుంటేనే ఒళ్ళు జలదరిస్తోందనుకో. ఏమైనా నీది డేరింగ్ పెర్సనాలిటీ శ్రీ'' కాంతం పొగిడింది.

"మరేవిటనుకున్నారే ఇన్నాళ్ళూ? మీలా పిరికిగొడ్డునీ, సత్తా లేనిదాన్నీ అనుకున్నారా?''

శ్రీ మాటలకి ఆమె ఫ్రండ్స్ కాస్త నొచ్చుకున్నారు. అయినా ఆ భావం కన్పించకుండా నవ్వేశారు.

"అన్నట్టు మురళి ప్రవరాఖ్యుడనీ అదనీ ఇదనీ చెప్పిన మహాతల్లి ఎవరే?" శ్రీదేవి అంది ఎగతాళిగా నవ్వుతూ.

భుజాలు తడుముకున్నారంతా.

నవ్వేస్తూ "సర్లెండి. ఎవరా మాటన్నా అందరికీ చెబుతున్నాను వినండి. అతడు ప్రవరాఖ్యుడు కానేకాదు... మామూలు సగటు మానవుడంతే. పైట తగిలితే పొంగిపోయే రకమే'' అంది శ్రీ.

"ఆఁ!" అంతా నోళ్ళు తెరిచారు నమ్మలేనట్లు చూస్తూ.

"ఎందుకే అంతలా ఆశ్చర్యబోతారూ? ఇది మామూలు విషయమే. ప్రతి మగవాడికీ వుండే బలహీనతే ఇది"

"అంతేనంటావా?"

"ముమ్మాటికీనూ. దానికా మురళి ఎక్సెప్షన్ కాదు. అసలు క్లియోపాట్రా సౌందర్యానికి ముగ్ధులై మహామహులే ఆమె కాళ్ళముందు మోకరిల్లారూ అంటే ఇక ఈ మురళిలూ వీళ్ళూ ఎంతే!" తనే ఓ సౌందర్యరాణిగా ఫీలవుతూ ఠీవిగా అంది శ్రీ.

"అవునుసుమా... మాకా విషయాలు గుర్తే లేవు" అని కాంతం అంటే, "ఈ దెబ్బతో రాణి ఆట కట్టు" అంది రమ.

"పందేనికింకా రెండు నెలల టైమ్ వున్నా ఒక్క నెలలోనేఅతణ్ని నా చుట్టూ తిప్పించుకుంటాను...చూస్తూండండి"

"ఒక్క నెలలోనా?"

"ఆఁ... ఒక్క నెలలోనే. విథిన్ థర్టీ డేస్ ఓన్లీ"

"కాలేజీకి టైమవుతోంది ఫ్రెండ్స్" నళిని మాటలకంతా వాచీలు చూసుకుని లేచారు.

పందెం గెలవటం ఎలాగూ ఖాయమే గనుక రాణినెలా అవమానించాల్సిందీ, గుండు చేయిస్తూ ఎన్ని ఫొటోలెలా తీయాల్సిందీ చెప్పుకుంటూ మేడ దిగి వచ్చి కారెక్కారంతా.

ఎప్పట్లానే శ్రీ కారు వేగంగా నడుపుతోందిగాని ఆమె ఫ్రెండ్స్‌కి కాస్త గాభరాగా వుంది. పదిరోజులక్రితం ఆమె చేసిన యాక్సిడెంట్ నెవరూ మర్చిపోలేదు.

ఇక వుండబట్టలేక, "కాస్త స్లోగా పోనియ్ శ్రీ'' అంది సుబ్బలక్ష్మి

"ఏమే...మళ్ళీ యాక్సిడెంట్ చేస్తానని భయంగావుందా?"

"అబ్బే... అదికాదు. మరేమో..." తల గోక్కుందామె.

"మీకేం భయంలేదు. మీ ప్రాణానికి నా ప్రాణం అడ్డు" అంటూ స్పీడు హెచ్చించింది.

దాంతో మరీ భయపడిపోతూ 'ఇదంతా నీవల్లనే' అని సుబ్బలక్ష్మి వంక చూడసాగారు మిగిలిన ముగ్గురూ.

వారి కారుకంటే ముందు రాణి కారు వెళ్తూండటం చూస, "హాయ్ శ్రీ...రాణి కారదుగో. ఓవర్ టేక్ చేసెయ్'' అని అరిచింది రమ.

మిగిలినవాళ్ళకి వుత్సాహం పొంగి రాగా, "దాటించెయ్ శ్రీ. హిప్ హిప్ హుర్రే'' అంటూ గోలగా అరిచారు కోరస్‌గా.

ఆ గొడవ విన్పించి రాణి వెనుదిరిగి చూసింది. శ్రీ కారు విమానంలా దూసు కొస్తూండటం, ఆమె స్నేహితురాండ్రు గోల చేస్తూండటం చూసి గతుక్కుమంది. మరో ఆలోచన లేకుండా "డ్రైవర్ ! పోనియ్.... స్పీడుగా పోనియ్. వెనకా లొస్తోన్న కారుకి దారివ్వకు" అంది కంగారుగా.

అద్దంలో శ్రీ కారుని చూసి గేరు మార్చాడు డ్రైవర్.

శ్రీ ఓవర్ టేక్ చెయ్యాలని ఎంత ప్రయత్నిస్తోన్నా డ్రైవర్ దారివ్వటంలేదు.

రెండు కార్లూ రేసుగుర్రాల్లా పరుగులు తీస్తున్నాయ్.

ఓవర్ బ్రిడ్జి వచ్చింది. అయినా వేగాలు తగ్గలేదు.

బ్రిడ్జి దాటి రెండు ఫర్లాంగుల దూరం వెళితే కాలేజీ వచ్చేస్తుంది. అంచేత ఈలోగానే రాణి కారుని దాటెయ్యాలని శ్రీ ప్రయత్నం.

కార్లు ఓవర్ బ్రిడ్జిమీంచి కిందికి దిగుతున్నాయి.

అమాంతం శ్రీ తన కారునో పక్కకి కోసి రోడ్డు పక్కన సేఫ్టీకోసం కట్టిన సిమ్మెంట్ దిమ్మల్ని రాసుకుంటూనే ముందుకి దూకించి రాణి కారుని ఓవర్ టేక్ చేసింది.

కార్లోని ఆడపిల్లల గుండెలు ఝల్లు మన్నాయి- కొంచెంలో తప్పిన పెద్ద ప్రమాదాన్ని చూసేసరికి.

ఇంతలో రాణి కారు వెనకబడటం చూసి హర్షధ్వానాలు చేశారంతా - కారు బయటికి చేతులు పెట్టి జేబురుమాళ్ళాడిస్తూ.

మరింత వేగంగా వెళ్ళి కాలేజీ





కాంపౌండ్‌లో ఆగింది శ్రీ కారు.

మరో నిమిషానికొచ్చింది రాణి కారు.

ఫ్రంట్ డోర్ నానుకుని నిల్చుని, "కొందరితో పందెం వెయ్యడమంటే ఓటమిని కొని తెచ్చుకోవడమే అని చెప్పవే నళినీ" అంది శ్రీ రాణికి వినబడేట్లు.

"కారుని ఓవర్‌టేక్ చెయ్యడమూ ఓ గొప్పే. ఎందుకూ పనికిరాని డ్రైవర్ కూడా చెయ్యగలడా పని'' రాణి అంది నిరసనగా.

"అందుకే కాబోలు కారడ్డంపెట్టి అంత యాతనపడ్డారు పాపం!"

"మేం గట్టిగా అనుకుంటే చచ్చినా దారిచ్చేవాళ్ళం కాదు''

''వట్టిగొడ్డుకి అరుపులెక్కువలే''

"ఎవరు వట్టిగొడ్డో ఎవరు గట్టిగొడ్డో ఇంకో రెండు నెలల్లో తేలబోతోందిగా! చేవేమిటో చూపించుకో చూద్దాం''

''ఇంకా చూడటంలోనే వుంది పాపం. రెండు నెలలు కాదు... ఒక్క నెలలోనే రాణీగారు గుండు గీయించుకోవాలని చెప్పవే నళినీ"

షాక్‌తింది రాణి. ''ఏవిటీ?'' అంది అదిరిపడుతూ.

"ఇంకా అర్థంకాలేదు కాబోలు. శ్రీదేవి పందెం గెలవబోతోందీ, రాణి గుండు చేయించుకోబోతోందీ అని గట్టిగా అరిచి చెప్పండే. లేకపోతే వినబడదు పాపం"

శ్రీ మాటలకి ఆమె ఫ్రండ్సంతా నవ్వారు. వెక్కిరించారు. హేళనగా మాట్లాడుతూ తప్పట్లు కొట్టారు.

ఇంకక్కడ నిలబడలేక విసుగ్గా



వచ్చేసింది రాణి.

మురళి ఇంత తేలిగ్గా శ్రీ వలలో పడతాడనామె వూహించలేదు. అలాటిది జరిగితే...తను గుండు చేయించుకోవాలా? మైగాడ్!

ముచ్చెమటలు పోశాయ్. పిచ్చిదాన్లా బుర్రగోక్కొంది. ఇంతలో దేవుళ్ళా బాబు కన్పించాడు. అతడూ, మురళీ రూమ్మేట్స్ అని ఆమెకి తెలుసు.

రాణి ప్రాణాలు లేచి వచ్చాయి.

"బాబుగారూ..." అంటూ పిలిచింది క్షణంకూడా వృథా చెయ్యకుండా.

రాణి తనని, అవును అక్షరాలా తననే పేరు పెట్టి పిలిచినందుకుమహదానందంతో వంకర్లు తిరిగిపోతూ వచ్చి "వాట్ కెన్ ఐడూ ఫర్యూ మేడమ్" అన్నాడు.

"మీ మురళి బుద్ధిమంతుడనుకుంటు న్నాను.,. కాదటగా?"

"ఎవరన్నారు మేడమ్?"

"ఒకరేమిటి... కాలేజీ అంతా కోడై కూస్తూంటేనూ. ఆ తలబిరుసు శ్రీదేవితో ప్రేమలోపడ్డాడని..."

"సారీ మేడమ్! మీకెవరో మురళి అంటే కిట్టనివాళ్లుకల్పించి చెప్పివుంటారు. మురళి అసలైన ప్రవరాఖ్యుడు. అతడికి చదువుతప్ప ఏమీ పట్టదు. వేటిమీదా ధ్యాసలేదుకూడా. అలాటివాడు ప్రేమలో పడటం అసంభవం. కావలిస్తే స్టాంప్ పేపర్‌మీద రాసిస్తాను"

"నా నమ్మకం కూడా అదేనంపే! కాని శ్రీదేవి గొప్పగా చెబుతోందిలెండి మురళి తన వెంటబడ్డాడని"

"అబద్ధం.మురళి ఆమె వెంట పళ్ళేదు. ఆమె అతణ్ణి వెదుక్కుంటూ వచ్చింది. షికారుకి రమ్మందిగాని మావాడు రానని నిర్మొహమాటంగా చెప్పేశాడు. ఒకసారి కాదు...రెండు సార్లు"

"ఐసీ! ఏమైనా మీరూ మీ ఫ్రండ్‌కి చెప్పండి బాబుగారూ. శ్రీదేవి గురించి మీకు తెలుసుగా... దాని ఒళ్ళంతా అహం కారమే, తలబిరుసే. ప్రపంచంలో తన కంటే గొప్పవాళ్ళే లేరంటుంది. ఆమె ఏదో నాలుగు తియ్యని మాటలు మాట్లాడితే అదే ప్రేమనుకుని మోసపో వద్దని చెప్పండి"

"అలా ఎన్నటికీ జరగదని వాడి తరఫున నేను హామీ ఇస్తున్నానండీ! మీకు తెలుసో లేదో నా సలహాలేందే వాడేపనీ చెయ్యడు. వాడికి నామీదంత గురి" స్వంత డబ్బా వాయించాడు ఇదే అదననుకుని.

"అలాగా. ఇంకో రెండు నెలల వరకూ అలాటిది జరక్కుండా చూడండి చాలు. ఆ తర్వాత...ఆ తర్వాత మీకో శుభవార్తచెబుతాను" సిగ్గు నటిస్తూ అంది.

"నాకా? శుభవార్తా??"

"అవును...మీకే. మీకు తెలీదుగాని చాన్నాళ్లనుంచి మిమ్మల్ని గమనిస్తు న్నాను. మీకూ మాకూ ఓరకాయ పీచు బంధుత్వంకూడా వుంది. అందుకే ఓ నిర్ణయానికి రాగలిగేను. మన గుర్చిన ఆ తియ్యని వార్త రెణ్నెల్ల తర్వాత చెబుతాను ... వస్తానూ" అంటూ వయ్యారంగా నడచి వెళ్ళిపోయింది రాణి రాస్త తడబడుతూనే.

బాబు బుర్ర గిర్రున తిరిగింది.

మురళి శ్రీదేవిని ప్రేమించకుండా చూస్తే ఈవిడ తనకి శుభవార్త చెప్పడ మేమిటి? అందులోనూ మన గురించి శుభవార్తంటే ఆమె తనని ప్రేమిస్తోందా?

'బాపురే!' ఎగిరి గంతేశాడు బాబు.

* * *





"అదుగోనేవ్ శ్రీ...నీ హీరో" లైబ్రరీ నుంచి వస్తోన్న మురళిని చూసి అరిచినంత పనిచేసింది రమ.

శ్రీతోబాటు కాంతం, నళిని కూడా చూశారు.

"మామూలు హీరో కాదేబాబూ... అసలుసిసలు ప్రబంధ హీరో" అంటూ వచ్చి వారిని కలిసింది సుబ్బలక్ష్మి.

అంతా గలగలమని నవ్వేశారు.

శ్రీకెంతో గర్వంగా, ఆనందంగా వుంది.

"నీ మురళినోసారి వాయించకూడదుటే...అయ్ మీన్ పలకరించకూడదా శ్రీ?" అంది కాంతం.

"పలకరిస్తే ప్రేమ కబుర్లు చెబుతాడేమోనే" నళిని అంది నవ్వుతూ.

"చెప్పేస్తే ఇంకా మంచిది. రాజీగారి బుర్రచేత ఇవాళే రామకీర్తన పాడించేయొచ్చు"

"కంగారుపడకండే ఆరోజు అతి త్వరలో రాబోతోంది" శ్రీదేవి అంది స్టైయిల్‌గా.

"పోనీ ముందు శాంపిల్ టెస్ట్‌కోసం మీ పిచ్చిబాబుని బుచ్చిబాబు సినిమాకి రమ్మనకూడదూ?"

రమ మాటలకి నవ్వుతూనే తలాడించారంతా.

"అయితే మీరిక్కడే వుండండి. నే వెళ్ళి పిలుచుకొస్తాను" ప్రెస్టేజి ఇష్యూగా తీసుకుంటూ అంది శ్రీ.

"ఓకే-విష్యూ గుడ్‌లక్" అంటూ ఆగిపోయారామె ఫ్రెండ్స్.

శ్రీదేవి గబగబా లైబ్రరీవైపు నడిచింది. మురళి వెళ్ళిపోతూండటం చూసి తప్పట్లు కొట్టింది.

అతడామెను చూసి ఆగాడు.

"హలో...బావున్నారా?" శ్రీ పలకరించింది.

తలూపాడతడు.

"మీ నోట్సు చాలా బావుందండీ! కొంచెం నోట్ చేసుకుంటున్నాను. రేపు ఎల్లుండల్లో ఇచ్చేస్తాను"

"అలాగేనండి"

"లైబ్రరీనుంచి చాలా పెద్ద పెద్ద పుస్తకాలు పట్టుకెళ్తున్నారే. అవన్నీ చదవడానికే?" ఆశ్చర్యం నటిస్తూనే అసందర్భంగా నవ్వింది తన ఫ్రెండ్స్ 'ఏదో' అనుకోవాలని.

అతడు చిన్నగానవ్వుతూ తలూపాడు.

"బాపురే. అందుకేనన్నమాట మీకు ప్రతిసారీ ఫస్ట్ మార్కు వస్తోంది. గుడ్... మీరు చాలా జీనియస్సండీ" అంది. ఆ వెంటనే వెనుదిరిగి చూసింది యధాలాపంగా చూసినట్టు. రమ, కాంతం వగైరాలంతా తమవంకే కుతూహలంగా చూస్తూండటం గమనించి ఇతగాణ్నెలాగైనా సినిమాకి పిలుచుకుపోతేగాని పరువు దక్కదనుకుంది. కానితడొక పట్టాన కదిలొస్తాడన్న నమ్మకం మాత్రంలేదు. అలా అని పూరకుండటం, ఓటమినంగీకరించడం ఆమె పద్ధతి కాదు!

"మీరు బుచ్చిబాబుసినిమా చూశారా?" లేని వుత్సాహం తెచ్చుకుంటూ అడిగింది.

"సారీ ... ఎప్పుడో తప్ప నేను సినిమాలు చూడనండీ"

"పిక్చర్ చాలా బావుంటుందండీ! మీకు తెలుసోలేదో మా హాల్లోనే ఆడుతోంది"

"క్షమించాలి. చదువుకోసం ఎక్కణ్ణుంచో వచ్చినవాణ్ని సినిమాలూ షికార్లూ అంటూ తిరిగితే నా చదువేం కాను చెప్పండి?"

"భలేవారే! రిలీఫ్ కోసం మధ్యమధ్య సినిమాలైనా చూడకపోతే ఎలాగండీ! బోర్‌కొట్టదూ?"

"నాకు కొట్టదండీ.... ఎంచేతంటే నా లక్ష్యం ఏమిటో, నా బాధ్యతలేమిటో నాకు బాగా తెలుసు. అందుకోసం ఏం చెయ్యాలో కూడా తెలుసు. దయచేసి నన్నొదిలెయ్యండి"

"అలా షికారుకైనా..."

"క్షమించండి. మీరు మీ దృష్టితోనే ఆలోచిస్తున్నారు తప్ప నా దృష్టితో ఆలోచించడం లేదు. నేనిక్కడికి చదువు కోసం వచ్చాను. మావాళ్ళకి కాలేజీ చదువు చెప్పించగల తాహతులేకపోయినా అప్పో సప్పోచేసి చదువుతున్నాను. ఎందుకను కున్నారు? డిగ్రీ అయినా చదవకపోతే వుద్యోగం రాదని. వుద్యోగం రాకపోతే నామీదేఆధారపడిన నాతమ్ముళ్ళకీ,చెల్లెళ్ళకీ ఓ దారి చూపించలేనని. వాళ్ళముందు, ఆ బాధ్యతలముందు సినిమాలూ షికార్లూ, ప్రేమలూ గీమలూ ఏమీ నాకు కన్పించవ్. కన్పించక్కర్లేదుకూడా. ముందు నా బాధ్యతలునేన్నిర్వర్తించాలి. ఆతర్వాతే నా సుఖం సంగతి. నా పరిస్థితేమిటో మీకు అర్థమయ్యిందనుకుంటాను"

"అర్థమయ్యిందిలెండి.కాని మీరెందుకు నన్ను పరాయిదానిగా చూస్తున్నారో మాత్రం అర్థంకావడం లేదు. నన్ను మీ స్నేహితురాలిగా భావించండి. మీ సమస్యలు నాతో చెప్పండి..సాధ్యమైనంత వరకూ తీర్చడానికి ప్రయత్నిస్తాను. మీకుద్యోగం కావాలంటారా...మా ఇంటికి రండి ఇప్పటికిప్పుడే ఇప్పిస్తాను"

"థాంక్యూ! అవసరమొచ్చినప్పుడు మీ సహాయం తప్పక అర్థిస్తాను" చెమ్మ గిల్లిన కళ్ళతో అన్నాడు కృతజ్ఞతా పూర్వకంగా చూస్తూ.

"ఇప్పుడైనా సినిమా కొస్తారా?"

"రాలేనని చెప్పటానికి చింతిస్తున్నాను. ముందే చెప్పినట్టు చదువే నా ధ్యేయం. మంచి మార్కులు తెచ్చుకోవడం నాకు ముఖ్యం. వస్తానండీ....మిమ్మల్నేమైనా నొప్పించివుంటే క్షంతవ్యుణ్ని"

అతడు వడివడిగా వెళ్ళిపోయాడు.

అతణ్నెలా అర్థం చేసుకోవాలో తెలీక అక్కడే నిలుచుని అతడివంకే చూస్తూండి పోయింది శ్రీ.

ఇంతలో ఆమె స్నేహితురాళ్ళొచ్చి కలిశారు- "అదేవిటి శ్రీ! మన హీరో వెళ్ళిపోతున్నాడేం?" అంటూ.

గతుక్కుమంది శ్రీ. వాళ్ళకెలా ఏమని చెప్పాలో, ఏం చెప్పి నమ్మించాలో తెలీలేదు...అలా అని వూరుకుంటే తనని తక్కువచేసి చూసే ప్రమాదమూ వుంది!

"అతడికి వేరే ఎంగేజ్‌మెంట్ వుందిట. ఇంకో రోజు వస్తానన్నాడు. మనం వెళ్దాం పదండే"

ఎవరూ మాట్లాడలేదు. ఏం జరిగి వుంటుందో వూహించ ప్రయత్నిస్తూ శ్రీని అనుసరించారు కారువైపు.




తమ మేడ టెర్రస్‌మీద పచార్లు చేస్తోంది శ్రీదేవి.

ఆమె మనసంతా వికలంగా వుంది.

అశాంతిగా, ఆందోళనగా వుంది.

ఒకసారి కాదు రెండుసార్లు కాదు మొత్తం మూడుసార్లు మురళిని తను పిలిచింది - తనతో బయటకు రమ్మని. అతడు రాలేదు సరికదా రానని నిర్మొహమాటంగా చెప్పేశాడు. ఇదే మరో యువకుడైతే ఎగిరి గంతేసేవాడే. కాని మురళి మాత్రం కొరకరాని కొయ్యలానే వున్నాడు.

అవతల పందెపు గడువు మాత్రం పరుగులుతీస్తూ సమీపిస్తోంది.

మురళి ధోరణినిబట్టి చూస్తోంటే అతడు తన అందానికీ ఐశ్వర్యానికీకూడా కించిత్తు విలువ ఇచ్చినట్లు కూడా లేదు. తనేదేదో అనుకుందిగాని అతడికసలు స్త్రీ ఆకర్షణ వున్నట్టేలేదు. లేకపోతే అప్సరస లాంటి కన్నెపిల్ల కోరి సమీపిస్తోంటే వెనక్కెనక్కి జరుగుతాడా? సినిమాకి రమ్మంటే సారీ చెబుతాడా? సరదా కబుర్లు చెబితే తన బాధ్యతలు ఏకరువు పెడతాడా? ప్చ్... చూస్తోంటే అతడిది వింతైన స్వభావంలా కన్పిస్తోంది.

అలాటివాణ్ని తన ఆకర్షణలో పడేట్లు చెయ్యడం అసంభవంలానే అన్పిస్తోంది చూస్తోంటే!

అలాటి వూహే తను భరించలేక పోతోందే ఇక. అదే నిజమైతే?

నో నో... అలా జరక్కూడదు! చచ్చినా జరక్కూడదు. ఏదియేమైనాసరే తను ఓడిపోకూడదు. ఓడిపోతే రాణిచేసే అవమానాన్నీ, అవహేళననీ భరించి ఒక్క క్షణం కూడా బతకలేదు!

తన అహం అభిమానం గౌరవం గర్వం పరువూ బతుకూ - అన్నీ తన గెలుపుతో ముడిపడి వున్నాయ్!

అంచేత ఎలాగైనా తను గెలిచితీరాలి! రాణి పొగరణచాలి!

కాని... మురళిని లొంగదీసుకోవడం ఎలా? ఇంకెలా??

ఎంతసేపు బుర్రబద్దలుగొట్టుకున్నా అతణ్ని కట్టుకునే వుపాయం తోచలేదు.

మెడలోని పూసలదండని చూపుడు వేలికి చుట్టుకుంటూ మధ్య మధ్య ముని పంటితో కొరుకుతూ అటూ ఇటూ తిరుగుతూ ఆలోచిస్తోన్న శ్రీ దృష్టిలో గేటు తీసుకుని లోపలికొస్తోన్న సుధాకర్ పడ్డాడు.

అతడు కంటబడేసరికి ఆమె మనసెగిరి గంతేసింది. తన సమస్యలన్నీ మరచి ఎంతో రిలీఫ్‌గా ఫీలయ్యింది. గబగబా మేడ దిగి వెళ్దామనుకుంటూనే ఆగింది. అతడు తన గురించే వచ్చివుంటే మేడమీదకి కబురొస్తుంది కదా అని వుత్కంఠతో ఎదురుచూడసాగింది.

పదిహేను నిమిషాలు గడిచినా తనకి పిలుపు రాలేదు. అతడు తిరిగి వెళ్ళనూ లేదు.

ఇంతసేపూ ఏంచేస్తున్నట్టు? డాడీతో మాట్లాడుతున్నాడా? ఇంతసేపు సంభాషిస్తోన్న ఆ రాచకార్యమేమిటబ్బా?

ఇక వుండబట్టలేక గబగబా మేడ దిగి హాల్లోకి నడిచింది శ్రీదేవి.

నీలకంఠరావుగారూ, ఆయన భార్యా సుధాకర్‌తో నవ్వుతూ మాట్లాడుతూ కూల్‌డ్రింక్ తీసుకోమని బలవంతం చేస్తోంటే మొహమాటపడుతూనే తీసుకుంటున్నాడు సుధాకర్.

"నమస్తే" అన్నాడు సుధ శ్రీని చూస్తూనే.

"నమస్తే...ఎంతసేపయ్యింది మీరొచ్చి?" ఏమీ ఎరగనట్టడిగింది.

"ఇంత క్రితమేనండి"

"ఇతను మనకి చాలా కావల్సిన వాడమ్మా...బుద్ధిమంతుడు కూడానూ. అందుకే మీ నాన్న ఇతగాడికి పెద్ద వుద్యోగం ఇవ్వబోతున్నారు"

తల్లి మాటలకి తండ్రి వంక ప్రశ్నార్థకంగా చూసింది శ్రీ.

"అవునమ్మా...మన సుధాకర్ మెరిక లాంటి కుర్రాడమ్మా! వయస్సు తక్కువే అయినా ఎంతో అనుభవజ్ఞుడిలా, ఆరితేరిన చెయ్యిలా వ్యవహరిస్తున్నాడనుకో. ఇతడి మీద నాకు చాలా నమ్మకం ఏర్పడింది. అందుకే మన డిస్ట్రిబ్యూషన్ సంస్థకి మేనేజ్‌మెంట్ బాధ్యతని పూర్తిగా ఇతడికి ఇచ్చేద్దామని నిశ్చయించుకున్నాను"

"మంచి పనిచేశారు డాడీ''

''ఇంతవరకూ మన డిస్ట్రిబ్యూషన్ సంస్థ కార్యకలాపాలు మన జిల్లాకే పరిమితమైపోయాయి. ఇప్పట్లో ఫిల్మ్ ఇండస్ట్రీ కన్నా లాభదాయకమైనది మరోటిలేదన్పించడంతో మన సంస్థని మొత్తం ఆంధ్ర ప్రాంతానికంతా విస్తరింపజెయ్యాలనీ, త్వరలోనే విజయవాడలో ఆఫీసు తెరచి చిత్ర నిర్మాణానిక్కూడా పెట్టుబడిపెట్టి మెల్లగా పెద్ద డిస్ట్రిబ్యూటింగ్ ఏజన్సీని చెయ్యాలనీ నిర్ణయం తీసుకున్నాం"

"వెరీగుడ్ డెసిషన్ డాడీ''

"ఆ బాధ్యతలన్నీ మన సుధాకర్‌కే అప్పజెప్పేస్తున్నా. రెండు మూడు నెలల్లో విజయవాడలో ఆఫీసు ప్రారంభిద్దామని ప్లాన్ చేస్తున్నాం''

"మీ ప్లాన్ తప్పకుండా సక్సెస్ అవుతుంది. నాకు చాలా సంతోషంగావుంది మీ నిర్ణయం విన్నప్పట్నుంచి. కానీ..." ఆగిందామె.

"నీ అనుమానమేమిటో చెప్పు శ్రీ"

"ఏంలేదు డాడీ....ఆంజనేయులుగారేమైనా గొడవ చేస్తారేమోనని''

"ఏడిశాళ్ళే. మన కళ్ళుగప్పి మన డబ్బు చాలా తినేశాడమ్మా. సుధాకర్ తీగ లాగటంతో డొంకంతా కదిలింది. ఎకౌంట్స్ అన్నీ నేనే వెళ్ళి తనిఖీచేసి మరీ అతడిచేత తప్పు ఒప్పించాను. ఇకనుండి బుద్ధిగా వుండమనీ, హాలుని జాగ్రత్తగా మేనేజ్ చెయ్యమనీ లేకపోతే పోలీస్‌కేసు పెడతాననీ బెదిరించేసరికి వణికిపోతూ కాళ్ళమీదపడి పిల్లాజల్లాగలవాణ్నని బతిమాలాడు. అసలంచేతే వుద్యోగంలోంచి పీకేయకుండా వూరుకున్నాను గాని లేకపోతే ఎప్పుడో వుద్వాసన చెప్పేవాణ్ని" కాస్త కోపంగానే అన్నారు నీలకంఠరావుగారు.

"వంకర బుద్ధి వుండకూడదుగానీ వుంటే కుక్కతోకలా వంకరగానే వుంటుంది తప్ప సాఫీగా అవ్వదండీ. అలాటివాణ్ని ఎంత త్వరగా పంపించేస్తే అంతమంచిది" మీనాక్షమ్మగారన్నారు.

"నిజమే డాడీ'' శ్రీ సపోర్టిచ్చింది.

సుధాకర్ ఇబ్బందిగా కదిలాడు.

" పోన్లే ... పిల్లలుగలవాడు. ఎప్పట్నుంచో మనల్నే నమ్ముకుని వున్నవాడాయె. ఇప్పుడు హఠాత్తుగా తన్ని తరిమేస్తే ఏం బావుంటుందిలే. చూద్దాం... ఇప్పుడో అవకాశం ఇచ్చాం. దీనిని సక్రమంగా వినియోగించుకుంటే సరే లేకపోతే అప్పుడే పంపించేద్దాం''

"అన్నీ తెలిసిన వారు గనుక అంత బాగా తీర్పివ్వగలిగారు" సుధాకర్ అన్నాడు ప్రశంసాపూర్వకంగా చూస్తూ.

"సర్లేవోయ్. జాగ్రత్తగా సంస్థ కార్యకలాపాలు చూస్తూండు. నీకేమైనా అనుమానాలొస్తే నన్ను సంప్రదించు"

"అలాగేనండి...వస్తానండి" అందరి

 

దగ్గరా శలవు తీసుకుని బయటికి నడిచాడు సుధాకర్.

"నేనూ వస్తున్నానుండండి. ఇంట్లో మహా బోరుగావుంది" అంటూ చెప్పలేసుకుని బయల్దేరింది శ్రీదేవి.

కలిసి వెళ్తోన్న వాళ్ళిద్దర్నీ అనుమానంగా చూసి ఆపైన నీలకంఠరావు దంపతులు మొఖా మొఖాలు చూసుకోవడం వారిద్దరూ గమనించనేలేదు.

కాలు కింద పెట్టకుండా ఎప్పుడూ కార్లలో తిరిగే శ్రీ ఇవాళ తనతో నడచి రావడంతో సుధాకర్ కెంతో ఆనందంగా వుంది. 'అప్పుడప్పుడు కొంచెం మూడీగా వున్నా, ప్రవర్తించినా మొత్తానికామె వెరీ నైస్ గరల్. తనంటే ఇష్టంకూడానూ. లేకపోతే తనతో ఇంత సన్నిహితంగా వుంటుందా?' అనుకుంటున్నాడతడు.

"కంగ్రాట్స్ సుధాకర్"

''థాంక్యూ...ఇదంతా మీ చలవే"

"వాడ్డూయూ మీన్?"

"అవాళ మీరు రికమండ్ చెయ్యక పోతే నాకుద్యోగం వచ్చేదేకాదు. వుద్యోగమే లేకపోతే ఇంక ప్రమోషనేమిటి నా ముఖం!"

"ఓహ్ .... అదా. నాదేముందిలెండి. యూ ఆర్ యాన్ ఎలిజిబుల్ పెర్సన్. అందుకే డాడీ మీకన్ని బాధ్యతలప్పజెబుతున్నారు. మీ ప్రవర్తనా, మీ పెర్సనాలిటీయేకాదు-మీ వర్కు కూడా మాకు బాగా నచ్చింది. అయ్ లైక్యూ వెరీమచ్"

"థాంక్స్ ఫర్ ద కాంప్లిమెంట్"

"ఇది కాంప్లిమెంట్ కాదు. మీమీద నాకున్న అభిప్రాయాన్ని వ్యక్తపరుస్తున్నానంతే"

"మీ అభిమానాన్ని పొందగలగడం నిజంగా నా అదృష్టం" పొంగిపోతూ అన్నాడు సుధాకర్.

"సరదాగా పిక్చర్ కెళదామా?" శ్రీ అంది.

"మన హాల్ కెళితే ఆంజనేయులుగారు ఇదవుతారేమో?"

"ఎవరో ఏడుస్తారని మన సరదాలు చంపుకుంటే ఇక మన గొప్పేమిటి?"

"అహ...అది కాదు నా వుద్దేశం..."

"పోనీ పార్కు కెళదామా... వెళ్ళి చానాళ్ళయ్యింది"

"ఓకే"

మెల్లగా నడుచుకుంటూ కబుర్లు చెప్పుకుంటూ పార్కులో కెళ్ళి ఎవరూ లేనిచోట చతికిలబడ్డారు.

"అబ్బ... ఇక్కడ చాలా ప్లెజంట్ గా వుంది. జనంకూడా చాలామంది వస్తున్నారే" అంది శ్రీదేవి.

"మనసు విప్పి మాట్లాడుకోడానికి అనువైన ప్రదేశాల్లో ఇదొకటికదా. అందుకే ఎక్కువమంది యువతీయువకులొస్తూంటారు" నవ్వుతూ అన్నాడు సుధ ఆమె ఏమంటుందోనని ఆసక్తిగా చూస్తూ.

ఇంతలో వేరుసెనగపప్పు అమ్మేకుర్రాడటు రావడంతో అతణ్ని పిలిచి పప్పు కొన్నదామె. ఆమె వద్దంటున్నా వినకుండా తనే డబ్బులిచ్చాడు సుధ.

తింటూ మాట్లాడుకోసాగేరు.

''ఇప్పుడు చెప్పండి"

"మీరే చెప్పాలి'' బుద్ధిమంతుళ్ళా అన్నాడు.

"ఏం చెప్పను? మీరింకా షైన్ అవుతారనీ, మీవల్ల మా దేవీ ఫిలిమ్స్ ప్రముఖ సంస్థ అవుతుందనీ నాకు తెలుసు"

అతడు కొంచెం నిరుత్సాహపడ్డాడు.

"బిజనెస్ విషయాలు తప్ప ఇంకేం లేవా చెప్పడానికి?''

''ఎందుకు లేవు?''

''అయితే చెప్పండి''

రాణితో తను వేసిన పందెం గురించి చెబుదామనుకునే మానేసింది. ఒకవేళ అతడావార్తని మురళికి చేరవేస్తే తన గెలుపు అసంభవమని భయపడింది.కనీసం మురళి తన ఆకర్షణలో పడేట్టు చెయ్యడానికి తోడ్పడమని అడుగుదామనుకుంది. కానంతలోనే తనకి చేతకానట్టు అతణ్ణి అర్థించడం ఏవిటీ అన్పించి పూరుకుండిపోయింది.

''ఏం మాట్లాడరేం?''

''ఏం మాట్లాడను?''

''పోనీ ఈ చక్కని వాతావరణంలో, ఈ సంధ్యా సమయంలో ఇలా పచ్చిక మీద కూర్చుని కబుర్లు చెప్పుకొంటోంటే మీకెలావుందో చెప్పండి''

''తెల్ల సిల్కు తెరల్లాంటి పల్చని రెక్కలు కట్టుకుని వెన్నెల వానలో తడుస్తూ ఎన్నడూ చూడని లోకాల్లోకి ఎగిరిపోతున్నట్టుగా తీయని ఆహ్లాదభరితమైన అనుభూతి కలుగుతోంది''

''ఏవిటో అనుకున్నానుగాని మీరు తీయని కవిత్వం చెప్పగలరు''

''అంత తీయగా వుందా?'' కొంటెగా చూసింది.

''అమృతంకన్నా తీయగావుంది. మరీమరీ వినాలని తహతహలాడేలా వున్నాయ్ మీ మాటలు. ఫుల్‌స్టాప్ లేకుండా మీరు కబుర్లు చెబుతోంటే ఇలా గడ్డంకింద చేయి ఆన్చి వింటూండిపోవాలని కోరికగావుంది''

ఆ పొగడ్తకి ఎక్కడలేని వుత్సాహం వచ్చింది శ్రీదేవికి. అడ్డూ అదుపూ లేకుండా చిన్నపిల్లలా ఏవేవో కబుర్లు చెప్పేసింది.

వాటిలో తనాశించిన సంగతుల్లేకపోయేసరికి నిరుత్సాహంగా విన్నాడతడు.

బాగాచీకటిపడటంతో ఇద్దరూ లేచారు.

''ఈ సాయంత్రం నాకు చాలాబాగా గడిచింది.థాంక్స్ ఫర్ యువర్ కంపెనీ'' అనేసి ఆటోలో ఇంటికొచ్చేసింది శ్రీదేవి.

అవాళ భోజనాల దగ్గర కూడా చాలా వుత్సాహంగా కబుర్లు చెప్పడంచూసి ఆమె తల్లిదండ్రులు చాలా ఆశ్చర్యపడ్డారు. తమ ఆశ్చర్యాన్ని కప్పిపుచ్చుకుంటూనే వారి పరిచయం ఎంత దూరం వెళ్ళిందో అని ఆలోచించసాగారు.

ఆ రాత్రి శ్రీదేవికి చాలా చక్కని కలవచ్చింది.

తనూ, సుధా చెయ్యీ చెయ్యీ పట్టుకుని ఏవేవో సుందరసీమల్లో తిరిగినట్టూ హిమాలయశిఖరాల నధిరోహించినట్టూ, ఒకరి కౌగిల్లో ఒకరు ఒదిగిపోయినట్టూ సముద్రంమీద పూల నావలో విహరిస్తూ డ్యూయెట్ పాడుకున్నట్టూ వచ్చిందా కల.

తెల్లవారేక రాత్రి వచ్చిన కలని మళ్ళీ మళ్ళీ తలచుకుని పరవశించిపోయింది.

తనతణ్ణి మనసారా ప్రేమిస్తోంది గనుకే అలాటి కల వచ్చింది. ఈసారి అతడితో ఆ మాట చెప్పాలి. అవునూ... డాడీ ఏమైనా అడ్డు చెబుతారేమో?!

నో...హి నెవర్ అబ్జక్ట్స్ మీ. తన మాటెప్పుడూ కాదనరు. కాదన్నా తను వినదని ఆయనకి బాగా తెలుసు!

* * *

మురళి అప్పుడే కాలేజీ నుండి వచ్చి కెమిస్ట్రీనోట్సు చదువుదామని తీశాడో లేదో అందులోంచో రంగుల కవరు జారిపడింది.

ఆశ్చర్యంతో ఉత్తరం వంకా, నోట్సు వంకా చూశాడు అదెలా వచ్చిందో




అర్థంగాక.

ఆ నోట్సుని శ్రీదేవి అవాళే ఇచ్చింది గనుక ఒకవేళామె దానిసందులో వుంచి మర్చిపోయిందేమోననుకుంటూ కవర్ అందుకున్నాడు.

దానిమీద తన పేప పెయింట్ చేసి వుండటం చూసి విస్తుబోయాడు. నోటి తడారిపోయింది. వణుకుతున్న చేతుల్తో కవరు చించాడు. సెంటు పూయబడ్డ ఉత్తరాన్ని బయటికి తీసి అదురుతోన్న గుండెల్తో చదవసాగాడు.

"ప్రియమైన మురళిగారికి–

మిమ్మల్నిలా పిలుస్తున్నందుకూ,



ధైర్యంగా హృదయపు లోతుల్లోని మాటల్ని కాగితంమీద పెడుతున్నందుకూ మన్నించండి. ఏం చెయ్యను చెప్పండి? ఎంత ప్రేమించినా గుండెల్లోనే దాచుకోవటం సాధ్యంగాక నా మనసంతా విప్పి మీ అంగీకారం కోసం మీ ముందు పరుస్తున్నాను.

అలనాడు మురళీధరుణ్ని రాధ ఎంతగా ప్రేమించిందో ఆరాధించిందో నాకు తెలీదు గాని అంతకంటే ఎక్కువగా నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. నా గుండెల గుడిలో మీ విగ్రహాన్ని ప్రతిష్ఠించుకుని ఆరాధిస్తున్నాను.

నాకు అందముందనీ, అంతులేని ఐశ్వర్యముందనీ, నాకోసం మన్మధులూ కుబేరులూ ఇంద్రుళ్ళూ చంద్రుళ్ళూ కూడా క్యూల్లో నిలుచుని వున్నారనీ మీకు తెలుసు. కాని నాకు వారెవ్వరిమీదా మనసులేదు. ఎంచేతంటే నా మనసుని మీరెప్పుడో దొంగిలించారు.

మన పరీక్షలయ్యేవరకూ ఈ విషయం మీకు చెప్పగూడదని ఎంత ప్రయత్నించినా, మీజ్ఞాపకాలు నన్ను వేధిస్తోన్నందున చెప్పక తప్పటంలేదు. నా అభిప్రాయాన్ని ముఖత చెప్పాలని ఎంత ప్రయత్నించినా అవకాశం దొరకటం లేదు. నా గురించి మీకెలాటి అభిప్రాయం వుందో తెలీదు గాని నేను మిమ్మల్ని మనసారా ప్రేమిస్తున్నాను. పూజిస్తున్నాను. ఆరాధిస్తున్నాను. నా ప్రేమని మీరు మన్నిస్తారని ఆశిస్తున్నాను. మీరంగీకరిస్తే మా నాన్నగారిని మీ నాన్నగారి దగ్గరకి పంపిస్తాను.

మీ అంగీకారాన్ని వెంటనే తెలియజేస్తారని ఆశిస్తున్నాను. మీ రంగీకరించక పోతే నా ప్రేమని నిరాదరిస్తే నేనేమవుతానో నా కథ ఎలా ముగుస్తుందో నాకే తెలీదు!

ఇట్లు
మీ ప్రేమకోరి తపిస్తోన్న
శ్రీదేవి"

ఉత్తరం సాంతం చదివేసరికి స్పృహ తప్పినంత పనయ్యింది మురళికి. ఇది కలోనిజమో అన్న సందేహం వచ్చి గిల్లి చూసుకున్నాడు. ఆ వుత్తరం తనకో కాదో అని మళ్ళీ మళ్ళీ చూశాడు. తను పొరబాటున మరో అర్థం గ్రహించానేమోనని మళ్ళీమళ్ళీ చదివాడు. చదివి చదివి శ్రీభావం గ్రహించి తెల్లబోయాడు.

నక్కకీ నాగలోకానికీ వున్నంత అంతరంవుంది తమ మధ్య. అలాటిదామె తనని ప్రేమించడం ... బాబు అన్నట్టు సినిమా కథలానే వుంది చూస్తోంటే.

'పోన్లెద్దూ' అనుకుని కెమిస్ట్రీ నోట్సు మీదకి దృష్టి మరల్చాలని చూశాడుగాని సాధ్యం కాలేదు. ఆ ప్రేమలేఖ గురించీ, శ్రీదేవి గురించీ ఆలోచిస్తూండిపోయాడు చాలాసేపు.

తన ఆలోచనా ధోరణికి విసుబోతూ వులిక్కిపడ్డాడు మురళి. తనేదో కాస్త అలుసిచ్చేసరికి మనస్సు కళ్ళాలు తెంపుకుని పెళ్ళివరకూపరుగులుతీస్తుందా?

కాసిని మంచినీళ్ళు తాగి మళ్ళీ పుస్తకం తెరిచాడు మురళి.

ఇంతలో ఈల వేసుకుంటూ వచ్చాడు బాబు.

"నిన్ను చూస్తోంటే అసూయగా వుంటోంది మురళీ"

ఎందుకన్నట్లు చూశాడతడు.

"అందరి చూపులూ నీమీదే వుంటున్నాయంటే నమ్ము. ఏవిట్రా.... ఇందాక కాలేజీ గ్రౌండ్‌లో బ్యూటీక్వీన్ శ్రీదేవితో అంతసేపు అంత రహస్యంగా మాట్లాడావూ"

"అబ్బే..అదేం లేదురా! మరేమో..."

"నేన్చూశాన్లేవోయ్... జరిగిందేమిటో చెప్పు"

"నా దగ్గర తీసుకున్న నోట్సు తిరిగి ఇచ్చిందంతే. అంతకంటే ఏంలేదు"

"అమాత్రం దానికోసం అంతసేపు రహస్య సమాలోచనలా... నేన్నమ్మను. స్నేహితుణ్ని మోసంచేసిన పాపం నీకు చుట్టుకు తీరుతుందిరా"

"అంతేరా! నోట్సు బాగుందని పొగిడి వాళ్ళింటికి రమ్మంది. సేన్రానన్నానంతే"

"నువ్వెంత లక్కీఫెలోవిరా నాయనా! కాలేజీ కుర్రాళ్ళంతా శ్రీదేవి చూపుకోసం, చిన్న నవ్వుకోసం పడిగాపులు కాస్తూంటే ఆవిడ నీతో మాట్లాటమేగాక ఇంటికీ, షికారుకీ రమ్మంటూ ఆహ్వానిస్తోందంటే అహా నీదెంత అదృష్టంరా..." ఇంకా ఏదేదో అనబోతోంటే రాజ




మాటలు గుర్తొచ్చాయ్. వెంటనే ప్లేటు మార్చేశాడు బాబు.

"ఆ పొగరుబోతు శ్రీదేవి నీతో సరదాగా మాట్లాడుతోందని, ఆవిడ నిన్ను ప్రేమిస్తోందని ఏవిటేవిటో వూహించుకోకు మురళీ. ఈ డబ్బున్నవారి చేష్టలోపట్టాన అర్థంకావు. మన్లాటివాళ్ళం వాళ్ళకి ఆటవస్తువులుగా కన్పిస్తాం. సరదాగా మన జీవితాలతో ఆటలాడుకుని థ్రిల్‌ని పొందుతూంటారు. అది చూసి వాళ్ళు మనల్ని ప్రేమిస్తున్నారని భ్రమిస్తే బోర్లా పడేది మనమే. అప్పుడు మనల్ని చూసి ముందు నవ్వేది వాళ్ళే!"

వింతగా చూడసాగాడు బాబు వంక మురళి. అతడికంతా అయోమయంగా వుంది. శ్రీ రాసిన ప్రేమలేఖ గురించి చెప్పడమా మానడమా అని కొంచెంసేపు తటపటాయించి చివరికి చెప్పడమే మంచిదన్పించడంతో మౌనంగా ఆ లేఖ అందిచ్చాడు.

"ఏవిట్రా?" అంటూనే గబగబా చదివేసి స్తబ్ధుడిపోయాడు.

రాణి తనకేదో ఎర చూపిందని ఏదేదో వాగేస్తునాడుగానీ నిజంగా శ్రీదేవి మురళిని ప్రేమిస్తోందేమో! లేకపోతే మహా మహావాళ్ళు మాట్లాడవస్తే పొగరుగా జవాబిచ్చి అల్లంత దూరాన నిలిపే ఆమె మురళి చుట్టూ తిరగటం ఏవిటి? ప్రేమలేఖ రాయడం ఏవిటి??

మురళి తెలివైనవాడూ, బుద్ధిమంతుడూ గనుక ఆమెనాకర్షించి వుండొచ్చు. ఆమె ప్రేమిస్తూండవచ్చు. ఆమె కొంచెం అహంభావి అయినా ఆమెకీ ఓ ప్రేమ హృదయం వుంటుంది కదా!

రాణి ఏదో అన్నదని వాళ్ళిద్దర్నీ విడదియ్యడం అన్యాయమే అవుతుంది. కష్టాల్లో పుట్టి కష్టాల్లో పెరుగుతోన్న మురళి చేతిని శ్రీమంతురాలైన శ్రీదేవి అందుకుంటానంటే వారిని మరింత సన్నిహితం చెయ్యడం స్నేహితుడిగా తన కర్తవ్యం అనిపించింది బాబుకు.

"సారీ మురళీ...నువ్వు శ్రీదేవిని ప్రేమించకుండా, కనీసం ఓ రెండు నెలల వరకూ ప్రేమించకుండా చూడమంది రాణి నాతో. అంచేత నేనేదేదో వాగేశాను గానీ చూస్తోంటే ఆమె నిన్ను నిజంగా ప్రేమిస్తోన్నట్టుందిరా. అదే నిజమైతే నీ రొట్టె విరిగి నేతిలో పడ్డట్టే''

"అదృసరే...రాణిగారు నీతో అలా ఎందుకన్నారు?''

"అదే నాకూ తెలీడంలేదు" అన్నాడు గానీ బాబుకు ఒకవేళామెకూడా నీడినే ప్రేమిస్తోందేమో అన్న శంక కలక్కపోలేదు.

"ఇదంతా అయోమయంగా వుందిరా! లేకపోతే ఆవిడెక్కడా నేనెక్కడా?" అన్నాడు మురళి.

''అదేరా....ప్రేమ మహిమ. ఎలాటి వాళ్ళనైనాసరే ఇట్టే కలిపేస్తూంటుందిరా! నాయనా మురళీ నేనెందుకు చెబుతున్నానో విను. శ్రీదేవి రేపట్నుంచి నిన్నెక్కడికైనా రమ్మంటే అభ్యంతరం చెప్పకుండా వెళ్ళు. చెప్పినట్టు విను తప్ప ఆవిణ్ని నొప్పించకు. ఆవిడ నిన్ను ప్రేమిస్తోంది. పెళ్ళాడతానని స్పష్టంగా రాసింది కూడా. నువ్వేలాటి అనుమానాలూ పెట్టుకోకు. ఇకనుంచి నీ జీవితం సరికొత్త మలుపు తిరగబోతోంది. నీతోబాటు మేవాళ్ళంతా అదృష్టవంతులేన్రా"

బాబు మాటలు మురళి మీద చాలా బాగా పనిచేశాయి. 'ఏమోలే, చూద్దాంలే' అని పైకి అన్నా అతడి దృష్టి పుస్తకం

మీదగాని, చదువుమీదగాని నిలవటంలేదు.

పుస్తకం తెరిస్తే ముద్దులు మూటగట్టే శ్రీదేవి మోమే కన్పిస్తోంది!

మెదళ్ళో ఆమె తాలూకు ఆలోచనలే సుళ్ళు తిరుగుతున్నాయ్.

శ్రీదేవి పెద్దలచేత చెప్పించి తనని పెళ్ళిచేసుకోవడం, ఆమె ఆస్తిపాస్తులకి తను యజమాని అవ్వడం, ఆమె తనంతట తను పూనుకుని తన చెల్లెళ్ళ పెళ్ళిళ్లు ఘనంగా చెయ్యడం, తన తమ్ముళ్ళని పెద్ద చదువులు చదివించడం, తన తల్లి దండ్రులకు ఇంద్రభోగాలు సమకూర్చడం, తను కూడా ఆమెను పువ్వుల్లో పెట్టి పూజించడం, తమ జంటనంతా సీతా రాముల్తో పోల్చడం... ఇలా ఎన్నెన్నో బంగారు వూహలతణ్ని ముంచెత్తుతూ వుక్కిరిబిక్కిరి చేసేయసాగాయి.

* * *

విజయవాడ వెళ్ళి అప్పుడే వచ్చిన నీలకంఠరావుగారు ఇంట్లో అడుగు పెడుతూనే "మీనాక్షీ... మీనాక్షీ" అని పిలిచారు.

"గుడికెళ్ళారండి" గోపి జవాబిచ్చాడు.

"హూ...ఎంత సేపయ్యిందేవిటి వెళ్ళి?"

"చాలా సేపయ్యిందండి. ఇంకొద్ది సేపట్లో వచ్చేస్తారండి"

"సర్లే సర్లే"

తన గదిలోకెళ్ళి బట్టలు విప్పి, బాత్ రూమ్‌లోకెళ్ళి స్నానం చేసొచ్చారాయన.

గోపి టీ తెచ్చిచ్చి వెళ్ళిపోయాడు.

టీ సిప్‌చేస్తూ ఎదురుగుండా టేబుల్ మీదున్న కూతురి ఫొటోని చూస్తూ ఆలోచించసాగారు.

కాఫీ కప్పు కిందపెట్టి భార్య వచ్చిం దేమోనని మళ్ళీ కనుక్కుని, రాలేదని తెలుసుకుని నిట్టూరుస్తూ పచార్లు చెయ్య సాగారు.

గుడినుంచొచ్చిన మీనాక్షమ్మగారు కారు దిగుతూనే "అయ్యగారొచ్చారా?" అనడిగారు పోర్టికోలోవున్న కారుని చూస్తూ.

నౌకరు కుర్రాడు తలూపడంతో వేగంగా గదిలోకొచ్చారు... "ఎంత సేప య్యిందండీ వచ్చి. హమ్మయ్య మీరొచ్చారు. ఇంక నాకేం దిగుల్లేదు"

"అదేవిటలా అంటున్నావ్? శ్రీకేమీ జరగలేదుకదా?"

"లేదులెండిగాని ముందెళ్ళిన పనేమ య్యిందో చెప్పండి... కాయా? పండా?"

"కాయే" నీరసంగా అన్నారు.

అదిరిపడ్డారావిడ. "అదేవిటండీ! మన సంబంధం అందుకోడానికి ఎగిరెగిరి పడ్డారుగా"

"ఇప్పుడూ పడుతున్నారు. కానీ..."

"ఏవిటో త్వరగా చెప్పండీ.. నాకసలే గుండె దడగా వుంది"

"ఆ సంబంధం మనకి లాభం లేదు మీనాక్షీ! ఫణిభూషణరావు మంచి వాడూ, కావల్సినవాడూ అయినంత మాత్రాన అతడి కొడుకూ అలాటివాడవుతా డనుకోవడం తప్పే

"అంటే అతగాడు..."

"సర్వ లక్షణ శోభితుడు. అమెరికాలోవున్నన్నాళ్ళూఎలా వున్నాడో ఏమోగాని ఇక్కడికొచ్చినప్పట్నుంచీ సరిగ్గా ఒక్కనాడూ లేడట. రోజూ తాగి తందనాలేనట. ఆడపిల్లల పిచ్చి కూడా ఎక్కువేనట. తన దగ్గర సెక్రటరీగా పనిచేస్తున్న అమ్మాయిని వుంచుకున్నా డని కూడా అంటున్నారు..."

"చాల్లెండింక. అసలే మనమ్మాయికి అభిమానం జాస్తి. అలాటివాడితో ఒక్క

రోజూ సుఖంగా కాపురం చెయ్యలేదు. ఏదో కలిగినవాళ్ళూ, కావల్సినవాళ్లూ కదా కలుపుకుందామని చూశాంగానీ వాళ్ళని తలదన్నే సంబంధాలు కో అంటే కోటి వస్తాయ్"

"చూడగా చూడగా పెద్ద సంబంధాల కోసం ఎగబడేకన్నా ఆస్తిపాస్తులేక పోయినా అన్నివిధాలా మంచివాడైన కుర్రాణ్ని చూసి పెళ్ళిచేస్తే ఎక్కువ సుఖపడుతుందన్పిస్తోందే... ఎలాగూ మన ఆ స్తంతా వాళ్ళదేకదా"

"అంతకన్నా ఏవంటాల్లెండి మీరు. ఈ అబ్బకి పుట్టింది గనుకే అదీ అలా అఘోరిస్తోంది" నిరసనగా అన్నారావిడ.

"అదేవిటే అలా అంటావ్... ఇప్పుడు కానిమాట నేనేమన్నాననీ"

"మీ రేంఅన్లేదు...నేనే అంటున్నానెండి. మీ ముద్దుల కూతురేం చేస్తోందోతెలుసా?"

"ఏం చేస్తోందే?" గాభరాగా అడిగారు నీలకంఠరావుగారు.

"ఇంకా ఏం చేస్తోందని నెమ్మదిగా అంటారేం? మీరు నెత్తికెక్కించుకుం టున్న కుర్రాళ్ళేడూ..అదేనండీ సుధాకరో ఎవడో అతడ్తో ఇకఇకలూ పకపక లూనూ"

"అంతేనా...ఇంకా ఏవిటో అని హడలి చచ్చాను''

"అతడితో కార్లలో తిరుగుతోందండీ! ఇంతక్రితమే ఈ పాపిష్టి కళ్ళతో చూడ్డం కూడా అయ్యింది"

ఆయన మౌనం వహించారు.

"మాట్లాడరేవండీ"

"మన శ్రీ అతణ్ని ప్రేమిస్తోందేమో నని నా అనుమానం"

"ప్రేమలేదు చట్టుబండలూలేవు. ఏదో కాస్త సరదాగా తిరిగినంత మాత్రాన... అయినా మనమ్మాయి వట్టి అమాయకురా లండీ ... పొగిడితే చాలు ఇట్టే పొంగి పోతుంది. ఆ కుర్రాడేదో మత్తు చల్లి లోబరుచుకుంటున్నాడేమోనని నా అనుమానం...''

"బొత్తిగా అలా మాట్లాడెయ్యకు. అతడెంత నిజాయితీపరుడో చూస్తున్నాం కదా"

"అంతా నటనండీ బాబూ! మన ఆ స్తి మీద కన్నేసి మనచేత మంచివాడ న్పించుకోడానికి ఆంజనేయులుగారి మీద, వారి మీదా చాడీలు చెబుతున్నాడు తప్ప ఇంకెవరైనా అతడి స్థానంలో వుంటే అలా చెప్పగలరా?"

"అది నిజమే అనుకో. కాని అతణ్ని చూస్తోంటే బుద్ధిమంతుళ్ళా..."

"మోసగాళ్ళంతా పైకి అలాగే కన్పి స్తారండీ! లేకపోతే నేను మోసగాణ్నంటూ ఎవరైనా మెడలో బోర్డు కట్టుకుంటారా ఎక్కడైనా?!"

"అయినా అమ్మాయిని కూడా కనుక్కొని చూద్దాం. ఒకవేళ నిజంగా ప్రేమిస్తోంటే మనం వద్దన్నా వినదు కదా. శ్రీ తత్వం నీకు తెలుసుగా" అన్నా రాయన కొంచెం ఆలోచించి.

"దానికెలావున్నా ముందు మీకతడి కిచ్చి చెయ్యాలనెంతోఇదిగా వున్నట్టుంది" కాస్త నిరసనగా అందావిడ.

"నిజమే మీనాక్షీ! ఈ కాలం కుర్రాళ్ళలో కన్పించే వెర్రివేషాలేం సుధాకర్‌లో లేవు. అతడెలాటివాడో చూస్తూనే వున్నామాయె. పైగా మంచి వ్యాపార దక్షతగలవాడు. అయినా మరికొన్ని పరీక్షలుపెట్టి చూద్దాం. అందులో అతడు నెగ్గితే, అమ్మాయికూడా అతడంటే ఇష్టపడితే అలాగే కానిచ్చేదా



మంటున్నాను. ఇల్లరికపుటల్లుడు గనుక మనకి లొంగివుంటాడు. అమ్మాయి మాట కాదన్లేడు గనుక శ్రీ సుఖపడు తుందనే నా తాపత్రయం"

"ఎంతైనా మీ పేద బుద్ధులెక్కడికి పోతాయిలెండి. మీ ఇష్టం వచ్చినట్లు చేసుకోండి" విసవిసా వెళ్ళిపోయారు గదిలోంచి మీనాక్షమ్మగారు.

* * *

ఊరి బయటవున్న ఎత్తైన కొండ మీద కూర్చున్నారు శ్రీదేవీ, సుధాకరూ.

తమ మధ్య రాజ్యమేలుతోన్న మౌనాన్ని భగ్నం చేస్తూ అన్నాడు సుధాకర్ – "చానాళ్ళ నుంచి మిమ్మల్నో ప్రశ్న అడగాలనుకుంటున్నాను... అడగనా?"

"అడగడానికి భయమెందుకు?యస్.. యుకెన్ ఆస్క్ మీ"

"నా గురించి మీ అభిప్రాయం ఏమిటో తెలుసుకోవాలని..."

"మీ గురించి చెప్పడానికేముంది?" యూ ఆర్యే నైస్ హీరో"

"థాంక్యూ"

కొన్ని క్షణాలనంతరం తిరిగి అన్నాడతడు తలొంచుకుని "మావాళ్ళు నాకేవో పెళ్ళిసంబంధాలు చూస్తున్నారు..."

ఉలిక్కిపడిందామె. అంతలోనే గలగలా నవ్వేస్తూ, "ఇంకేం...హాయిగా పెళ్ళి చేసుకో" అంది అతణ్ని ఏడ్పించడానికి.

"అంతేనా?!"

"ఏం? పెళ్ళిచేసుకోవా??"

"అహ .... అదికాదు"

"మరి ఏది కాను?"

ఆమె కళ్ళల్లోకోసారి చూసి అన్నాడు మెల్లగా– "మీకెలా నా భావం తెలపాలో తెలీడంలేదు. అలాఅని చెప్పకుండావుండటమూ సాధ్యం కావట్లేదు. ఏంలేదు... మిమ్మల్ని నేను ప్రేమిస్తున్నాను. మిమ్మల్ని చూసిన ప్రథమక్షణం నుంచీ మీ రూపం నన్ను వెంటాడుతూనేవుంది. మీ సన్నిధి అంతులేని పెన్నిధిలా వుంటోంది. మీరు పక్కనుంటే స్వర్గంలో వున్నట్టే అన్పిస్తోంది. మీరు నా దగ్గరికొచ్చినట్టే వచ్చి దూరమై పోతూంటే ఇన్నాళ్ళూ నా అభిప్రాయం బయటపెట్టలేక కొట్టుకు చస్తున్నాను. మీకు నామీద సదభిప్రాయం వుందని తెలుసు. అయినా..." ఆగాడతడు.

శ్రీదేవికి చాలా సంతోషం వేసింది. ఎంచేతంటే అతడు తననెంతో బలంగా ఆకర్షిస్తున్నాడు. తనతణ్నెంతో ఇదిగా ప్రేమిస్తోంది. ఈ విషయం ఈమధ్యే గ్రహించింది. అప్పట్నుంచీ తన మనస్సులోని మాట బయటపెట్టాలనుకుంటూనే పెట్టకుండా అతడితో సరదాగా తిరుగుతోంది. ఆడబోయిన తీర్థం ఎదురైనట్లు అతడే ఆ విషయం కదపడం, తనని ప్రేమిస్తున్నట్టుచెప్పడంతో ఆమె గుండెలు పరమానందంతో ఉక్కిరిబిక్కిరై పోతున్నాయ్. వెంటనే అతణ్ని గాఢంగా కౌగలించుకుని ముద్దులు కురిపించి ఉక్కిరిబిక్కిరి చేసేయాలన్పించింది గాని అతి కష్టంమీద తమాయించుకుంది. అతడడగ్గానే ఔనంటే తన గొప్పేమిటన్పించడమే దానిక్కారణం. తను అలుసైపోకుండా తన ఆత్మాభిమానానికేవిధమైన భంగం కలగకుండా భర్తుడి వేడుకను మన్నించి వరమిచ్చినట్టుగా చెప్పాలనుకుంది.

"మీ చేష్టలద్వారా మీరు నన్ను ప్రేమిస్తున్న సంగతి నేనెప్పుడో గ్రహించాను. అయినా ముఖతః ఇప్పుడే చెప్పేరు గనుక నాక్కొంచెం టైమివ్వండి.

ఆలోచించి ఏ మాటా చెబుతాను"

అతడు హతాశుడయ్యాడు. అలాటి సమాధానం అతడూహించనే లేదసలు. నిరాశతో కృంగిపోతూ, ఆమె క్లోజ్‌గా ప్రవర్తిస్తోందని దానినే ప్రేమనుకుని అత్యాశకి పోతున్నానేమోనని మథన పడసాగాడు.

అతడి ముఖాన్ని చూసేసరికి ఆమెకి జాలేసింది. 'నేనూ నిన్ను ప్రేమిస్తున్నాను బోయ్... పెళ్లి చేసుకుందాంలే' అందామనుకునే ఆగిపోయింది-తన విలువ తెలిసిరావడానికీ మాత్రం సస్పెన్స్ వుండాల్లే అనుకుని.

"ఇక వెళ్దామా?" ఆమె అంది లేస్తూ.

"వూఁ" మౌనంగా అనుసరించాడు.

నవ్వుతూ కేరింతలు కొడుతూ వచ్చిన కాపు మౌనంగా వెనుదిరిగింది.




మురళి లైబ్రరీకెళ్ళడం చూసిన శ్రీదేవి కూడా అతని వెనుకే వెళ్ళింది.

అతడో మూలన వున్న రాక్‌లోంచి పుస్తకాలు తీసి చూస్తుంటే తను కూడా పుస్తకాలు తిరగేస్తూ దగ్గరకెళ్ళి అప్పుడే అతణ్ని చూసినట్టు 'హలో' అంటూ విష్ చేసింది.

వులిక్కిపడి ఆమెని చూసి నవ్వ ప్రయత్నిస్తూ 'మీరా' అన్నాడు.

"భయపడ్డారా నన్ను చూసి?" నవ్వింది.

ఆ నవ్వు గిలిగింతలు పెడుతోంటే "అబ్బే..లేదండీ" అన్నాడు తడబడుతూ.

"నా లేఖ చూశారనుకుంటాను" చేతిలోని పుస్తకపు అంచుని సవరిస్తూ నేల చూపులు చూస్తూ అంది.

"చూశానండీ! కానీ..."

"కానీలుపోయి చాలాకాలమయ్యిందండీ" అని అనవసరంగా నవ్వి, "నాకేమైనా లెటర్ వుందా?" అంది వోరగా చూస్తూ.

మొదటామెభావం అర్థంకాలేదుమురళికి. అర్థమయ్యాక కంగారుపడ్డాడు. "లెటరేం రాయలేదండీ. మరేమో అసలు..."

ఆమె ముఖం అకస్మాత్తుగా పాలిపోయేసరికతడు ఖ్రమాన్పడిపోయాడు. తన లేఖ చూసి అతడు ఓ పెద్ద ప్రేమలేఖ రాసిస్తాడనెంతో ఆశించిన ఆమె పడిన నిరాశ అంతా ఇంతా కాదు.

"క్షమించాలి. మీరేదో నామీద జాలితో ఏదేదో రాశారుగానీ నేనెక్కడా మీరెక్కడా. నక్కకీ నాగలోకానికీ వున్నంత తేడావుంది మన ఆస్తుల్లో, అంతస్తుల్లో" ఆమెని నొప్పించినందుకు నొచ్చుకుంటూ అన్నాడు మురళి.

"ఓహో... అదా మీ అనుమానం. వంపేరుపొండి. మీకు తెలుసో లేదోగాని ప్రేమకి ఆస్తులూ అంతస్తులూ అడ్డు రావండీ"

"అడ్డు రాకపోయినా కొన్ని హద్దులు వున్నాయిగదండీ"

"హద్దులూ అడ్డులూ వున్నాయని ఆగిపోతే అది ప్రేమెలా అవుతుంది చెప్పండి?"

"మీకెలా చెప్పాలో తెలీడంలేదు"

"ఇంకేం చెప్పొద్దు. మీరు నన్ను

ప్రేమించగలరా లేదా?"

"మీరలా సూటిగా అడిగితే ఏం చెప్పను?"

"అవునని చెప్పండీ"

"కానీ-మీరేదో తాత్కాలిక వుద్రే కంతో అన్నీ మర్చిపోయి అలా అంటున్నారుగాని ఈవిషయం తెలిస్తే మీవాళ్ళూ, మన చుట్టూవున్న జనమూ ఏమనుకుంటారో, ఎన్నంటారో కొంచెం ఆలోచించండి"

"అయ్ డోంట్ కేర్"

"దయచేసి మీరు మరోసారి ఆలోచించండి. మీ నిర్ణయాన్ని మార్చుకోండి. అది మీకూ మాకూ కూడా ఎంతో మంచిది"

'ఇతడెక్కడి మనిషిరా బాబూ!' అన్నట్టుగా అతణ్ణి చూసింది. ఇతగాడు తన బలవంతం మీద ప్రేమించినా రేపు రాణి ముందు అబ్బెబ్బే అని నసిగేయొచ్చు కూడా. ఇలాటి మడ్డీఫెలోతో పందెం వేసిందా డర్టీ డెవిల్!

కన్నీళ్ళు వుబికిరావడంతో మొఖం ముడుచుకుని వెనుదిరిగి విసవిసా వచ్చేసింది లైబ్రరీనుంచి బయటికి.

* * *

సుధాకర్‌తోబాటు నీలకంఠరావుగారు కూడా మద్రాసు వెళ్ళారనీ, ఓ వారం రోజులవరకూ రారనీ తెలుసుకుని శ్రీదేవి చాలా సంతోషించింది. తన పథకాన్ని పులుపర్చడానికిదే మంచి సమయమనిపించింది. వాళ్ళొచ్చేసరికి అంతా గప్‌చిప్‌గా అయిపోతుందిగనుక ఎలాటి అనుమానాలకీ, మరెలాటి అపార్థాలకీ తావుండదని భావించి గోపీని పిలిచింది.

గోపీ వచ్చి నిలబడ్డాడు గుమ్మంలోనే.

"లోపలికిరా''

భయపడుతూనే రెండడుగులు ముందుకేశాడు.

''నువ్వెంతవరకూ చదువుకున్నావ్ గోపీ?''

ఆమె కంఠంలో కోపం లేదు. విసుగు లేదు. ఆజ్ఞలేదు. కుతూహలంవుంది. ఆదరణ వుంది. ఆమె ఇలా అతణ్ణడగటం ఇదే ప్రథమం. అందుకే నమ్మలేనట్లు చూశాడామెవంక.

"మాట్లాడవేంరా?''

''ఏడో తరగతండి'' గబుక్కునన్నాడు.

''చూచిరాత రాయగలవా?''

తలూపాడు.

''చిన్న చిన్న బొమ్మలెయ్యగలవా? ఎలా వున్నా ఫర్లేదులే''

మళ్ళీ తలూపాడు - లోపల్నుంచి సంబరం తన్నుకొస్తోంటే.

"గుడ్...నువ్వో పనిచెయ్యాలి గోపీ! చేస్తావా?''

అయోమయంలోపడ్డాడు వాడు. చెయ్యనంటే ఆమెకోపం వస్తుంది. చేస్తాననడానికి ఆ పనేమిటో తెలీదాయె!

అతడి సందేహాన్ని చదివినట్టుగా అంది, "చిన్న పనేలే. కాదంటే రహస్యంగా చెయ్యాలి. మూడో మనిషికే కాదు-మూడు కళ్ళవాడిక్కూడా తెలేకూడదు. తెలిసిందా?"

రహస్యం అన్నమాట చెవిని పడేసరికి కంగారుపడిపోయాడు వాడు - అదెలాటి పనో ఏవో నని!

"బెల్లంకొట్టిన రాయిలా మాట్లాడ వేంరా''

ఆమెకోపం వస్తోందని గ్రహించి గట్టిగా తలూపేశాడు.

"వెరీగుడ్! అలాగుండాలి. ఇలారా చెబుతా''

సమీపించాడు అదురుతోన్న గుండెల్తో.

అందులో ఎందుకలా రాశారో తెలీలేదు. అది నిజమోకాదో అర్థంకాలేదు. అసలెందుకలా రాయమంటోందో బోధపళ్ళేదు. రాస్తే ఎన్ని గొడవలొస్తాయో వూహకందలేదు.

వెర్రిగా చూస్తూండి పోయాడు కాగితాన్నీ, ఆమెనీ.



"అలా చూస్తావేం పిచ్చీ. నీకేం భయం లేదుగాని ఇంకొంచెం చీకటిపడ్డాక మా కాలేజీదగ్గరికెళ్ళి బయటి గోడలమీదా అక్కడా రాయి. ఎవ్వరూ చూడకుండా ఎవ్వరికీ అనుమానం రాకుండా రాయాలి సుమా. బస్..అంతే నువ్వు చెయ్యాల్సింది. రాసేశాక సినిమాకెళ్ళు" అంటూ పది రూపాయల నోటు అందిచ్చింది.

ఇబ్బందిగా చూస్తూనే అందుకున్నాడు.

"జాగ్రత్తగా రాస్తావుకదా?"

తలూపాడు.

"దేంతో రాస్తావ్?"

ప్రశ్నార్థకంగా మొఖం పెట్టాడు.

"బొగ్గుముక్కా, రంగురంగుల సుద్ద ముక్కలూ తేసుకో. వుంటే మామిడి జీడి కూడా తీసుకెళ్ళు...తెల్సిందా?"

"అయ్"కొంచెం ధైర్యం చిక్కడంతో నోరు తెరిచాడు.

"ఒకవేళ నిన్నెవరైనా పట్టుకుంటే ఏంచేస్తావ్? ఎవరు రాయమన్నారంటే

"ఇదిగో ఈ కాగితంలో రాసివున్నది చదువుకో. బొమ్మల్ని కూడా చూడు. అందులో వున్నట్టు చూసి గోడలమీద రాయాలి. బొమ్మలు అలా వేసినా సరే ఎలా వేసినాసరే. వెయ్యగలవా?"

కాగితంలోని వాక్యాలు చదివేసరికి గోపీకి ముచ్చెమటలు పోశాయ్.

ఏం చెబుతావ్??''

"ఏం చెప్పనండి. పారిపోయి వచ్చేస్తా నండి"

"ఒకవేళ చెప్పాల్సొస్తే అప్పారావో, పుల్లారావో అని చెప్పాగాని నా పేరు మాత్రం బయటికి రాకూడదు. వచ్చిందా.. తాటొలిచేస్తాను"

"చచ్చినా చెప్పనండి''

''వెళ్ళింక. జాగ్రత్తసుమా"

తలాడిస్తూ వెళ్ళిపోయాడు గోపి.

'మురళీ! పాశుపతాస్త్రం వేస్తున్నాను కాసుకో' అనుకుంది శ్రీ గర్వంగా.

* * *

అలవాటు ప్రకారం తలొంచుకుని రోడ్డుపక్క నడుస్తూ కాలేజీకెళ్తున్నాడు మురళి.

అతడికెదురైన విద్యార్థుల్లో కొందరు అతణ్ని చూసి అదోలా నవ్వారు. అది గమనించి మురళి కంగారుపడ్డాడు తప్ప కారణం బోధపళ్ళేదు. నడక వేగం హెచ్చించాడు. వాళ్ళనుంచి తప్పించుకోడానికి.

సడన్ బ్రేకు వేసినట్లుగా ఆగిపోయాయి అతడి కాళ్ళు కాలేజీగేటు దగ్గర. గోడలమీది రాతల్ని అతడి కళ్ళు ఆత్రంగా భయంగా చదివాయ్. మెదడు మొద్దుబారిపోయింది. నిశ్చేష్టుడై చేష్టలు దక్కి నిలుచుండిపోయాడు.

"శ్రీదేవి మురళిల ప్రేమ కలాపాలు" నేడే చూడండి!

"బుద్ధావతారం మురళిలో ఏం చూసి వెంటబడుతోంది శ్రీదేవి?"

ఈ ప్రశ్నకి జవాబు చెప్పండి - "పుస్తకాలని చదవటం తప్ప ఆడపిల్ల మనస్సుని చదవటం తెలీని మురళి శ్రీదేవిని ప్రేమిస్తాడా? ప్రేమించడా??''

నేడే విడుదల! పూర్తి రంగుల చిత్రం శ్రీదేవి మురళీ నటించిన సినిమాస్కోప్ చిత్రం ''అందాలరాణి-అర్భకశ్రేష్ఠుడు"

తాజావార్త - ''మురళి గదే శ్రీదేవి మురళిల ప్రేమలీలలకి కేంద్రమయ్యింది. వాళ్ళు తరచూ అక్కడే కలుసుకుంటున్నట్టు మా విలేఖరి తెలియజేస్తున్నాడు''

"ఎందరో యువకుల్ని కాదని శ్రీదేవి మురళి వెంటబడటంలో అంతరార్థమేమిటి? ఆమె నిజంగా ప్రేమిస్తోందా?"

సంచలన వార్త - "మురళీ శ్రీదేవి రాత్రుళ్ళెక్కువగా కలుసుకుంటున్నట్టు విశ్వసనీయమైన వర్గాల ద్వారా తెలియవచ్చింది"

"మీకు తెలుసా? శ్రీదేవి మురళిలది ఒకటే కులం!''

ఎన్నెన్నో కారు కూతలు! వాటికి తోడు చేతగాని బొమ్మలు!

ఎవరెవరో నవ్వుతూండటంతో ఇహంలోకొచ్చాడు మురళి. కంగారుగా చుట్టూ చూసి తత్తరపడుతూ కాలేజీ ప్రాంగణంలో అడుగు పెట్టాడు.

ఎవ్రరాశారలా? వాళ్ళకి తామేం అపకారం చేశారని పనిగట్టుకుని లేనిపోని కథల్ని ప్రచారం చేస్తున్నారు?

కంగారు! వణకు! దడ! ముచ్చెమటలు! దుఃఖం!

ఎటు చూసినా, ఎవర్ని చూసినా తనని అనుమానంగా చూస్తున్నట్టూ,తనని చూసి హేళనగా నవ్వుతున్నట్టూ వుంది మురళికి.

క్లాసులో ఓ మూల కుదించుకుపోయి కూర్చున్నాడు మురళి. కన్నీళ్ళు పొంగి వస్తున్నాయ్!

క్లాసులోని ఆడపిల్లలూ, మగపిల్లలూ కూడా ఆ రాతల గురించే మాట్లాడు




కుంటున్నారు. చర్చిస్తున్నారు. విమర్శి స్తున్నారు. వ్యాఖ్యానాలు విసుర్తున్నారు.

మధ్య మధ్య అతడివంక అనుమానంగా చూస్తున్నారు. మాబాగా అయ్యిందిలే అన్నట్టు నవ్వుతున్నారు.

పుస్తకాల్లో తల దాచుకుని కూర్చున్నాడు మురళి.

లెక్చరర్ వచ్చాడు.

కాని రోజులా మురళి ఆసక్తిగా వినడం లేదు. నోట్సు రాసుకోవటంలేదు. ఏడుస్తూ కూర్చున్నాడు.

అది గ్రహించిన లెక్చరర్ పరిస్థితిని అర్థం చేసుకుని సానుభూతిగా చూశాడు. అన్యమనస్కంగానే పాఠం చెప్పసాగారాయన.

ఫస్ట్ అవర్ అయ్యింది.

బాబు గబగబా క్లాసులోకొచ్చి "రా... వెళ్దాం" అన్నాడు మురళితో.

మురళి లేచాడు.

ఇద్దరూ బయటికెళ్ళిపోతూండటం వింతగా చూశారంతా.

రూమ్‌కెళ్ళే వరకూ ఏమీ మాట్లాడలేదు బాబు. చిన్న మాటకే తల్లడిల్లిపోయే మురళి ఆ రాతల్ని చూసి ఎంతగా అప్‌సెట్ అయిపోయి వుంటాడో అతడు వూహించగలిగేడు. చీమకి కూడా అపకారం తలపెట్టని అతనిమీద ద్వేషంతో గోడల్ని ఖరాబుచేసిన నీచులెవ్వరో అతడి వూహకందలేదు.

మోకాళ్లలో తలదూర్చి మురళి ఏడుస్తోంటే అన్నాడు – ''ఎందుకురా ఆడపిల్లలా ఏడుస్తావ్....వూరుకో. ఇప్పుడేమయ్యిందనీ అంత ఇదవ్వడం? ఎవడో పిచ్చిగా ఏదో రాస్తే దాన్నెందుకు సీరియస్‌గా తీసుకోవాలి చెప్పు? వూరుకో. ఎవరైనా చూస్తే మొఖాన్నే నవ్వుతారు''

కళ్లు తుడుచుకున్నాడతడు. కాని కన్నీళ్లాగటంలేదు.

"నువ్వు నిజంగా ఫూల్‌వేరా మురళీ! ఏం జరగందే ఏదో కొంపలంటుకుపోయినట్టు ఏడవడం ఎందుకు? నన్నడిగితే ఇదీ నీ మంచికే జరిగిందంటాను"

తుళ్ళిపడి చూశాడు మురళి.

"అవున్రా! శ్రీదేవి నిన్ను ప్రేమిస్తోందని మనం ఇదివరకే అనుమానించేంకదా. అది నిజమే అయ్యుంటుంది. ఆ సంగతి తెలిసి ఆమెని ప్రేమిస్తోన్నవాడెవడో ఈర్ష్యకొద్దీ అలా రాసి వుంటాడు. ఏమైతేనేం... దీనివల్ల నువ్వూ, శ్రీదేవి దగ్గరైతే నీరాత మారినట్లేకదరా. అప్పుడు నీకంటే అదృష్టవంతుడుండడ్రా"

"నీకేమైనా మతిపోయిందట్రా. లేకపోతే..."

"మతిపోవడం నాక్కాదురా..శ్రీదేవికి" అని నవ్వి అన్నాడు– "అదృష్టం తోసుకొచ్చినప్పుడన్నీ ఇలాగే కలిసివస్తాయిరా. ఆ రోగ్ ఎవడో ఓ వుద్దేశంతో రాస్తే దాని ఫలితం వాడూహించని విధంగా మనకనుకూలంగా మారబోతోంది. అందుకు సంతోషించి వాడినభినందించక ఏడుపెందుకురా?"

"నీకు నవ్వులాటగా వుంది ట్రా"

"ఛాఛా .... అదికాదురా! మీరిద్దరూ దగ్గరవ్వటానికిది బాగా తోడ్పడుతుందంటున్నానంతే. అంతకంటే నీ స్నేహితుడిగా నేను కోరేదేముంటుంది చెప్పు?"

"మనమేదేదో వూహించుకుని అత్యాశలకి పోతున్నామనుకుంటాను. లేకపోతే ఆవిడెక్కడా నేనెక్కడా!"

"ష్...ఆ మాటే అనొద్దంటున్నాను. నిన్ను నువ్వు తక్కువచేసుకుని మాట్లాడ్డం మంచి లక్షణం కాదురా మురళీ. నీ విలువ

నీకన్నా ఎదుటివాళ్ళకే బాగా తెలుస్తుందని మర్చిపోకు. నా మాట నిజమో కాదో త్వరలోనే తెలుస్తుందిగానీ ఇది విన్నావా?"

ఏదన్నట్టు చూశాడు.

"నీలాగే శ్రీదేవి కూడా గోడమీది రాతల్ని చూసి చాలా ఇదయ్యిందిట. వెంటనే కారు తిప్పకు వెళ్ళిపోయిందట"

బ్రమాన్పడి చూస్తూండిపోయాడు మురళి.

ఇంతసేపూ తను తన గురించే ఆలోచిస్తున్నాడు. కాలేజీలో తను తలెత్తుకు తిరగటం ఎలాగా అని ఇదవ్వుతున్నాడు గాని ఆమె గురించి ఆలోచించనేలేదు. తన పేరు గోడలకెక్కించినందుకావిడెంత దుఃఖిస్తోందో పాపం. తను మగవాడు. ఎలా అయినా సర్దుకుపోతాడు. కానామె పరిస్థితేమిటి? ఆమెనీ సమాజం తేలిగ్గా వదుల్తుందా? బాపురే! తమమీద కక్షతో ఈ పనికి తలపడిందెవరు? వాళ్ళకొరిగే లాభమేమిటి??

తల పట్టుకున్నాడు.

"నేను కాలేజీకి వెళుతున్నానుగానీ నువ్వు నిశ్చింతగా వుండరా! ఇవాళ్టికి రెస్టుతీసుకో. వెధవ ఆలోచనల్తో బుర్ర పాడుచేసుకోకు. రేపటికన్నీ సర్దుబాటైపోతాయిలే" పుస్తకాలు తీసుకుని బయటికి నడుస్తూ అన్నాడు బాబు.

* * *

నిప్పులేనిదే పొగరాదన్నది పట్టి సామెతే కాదు-అందులో కొంత నిజం లేకపోలేదు. శ్రీదేవి, మురళిల గురించి రాయబడ్డ రాతల్లో కూడా కొంతైనా నిజం ఉండివుండకపోదు. అంటే వాళ్ళిద్దరూ ప్రేమించుకుంటున్నారా? అదే నిజమైతే తనపని గో....విందా!

క్లాసులో కూర్చుందన్నమాటేగాని రాణి మనస్సు మనస్సులో లేదు. తెగని ఆలోచనల్తో ఆమె మెదడు వుడికిపోతోంది.

బెల్ అయ్యింది.

నిట్టూర్చింది రాణి.

లెక్చరర్ వెళ్ళిపోయాడు.

రాణి లేచింది.

"ఇంకో అవర్ వుందిగా?" ఆమె స్నేహితురాలడిగింది.

"తలపోటుగా వుంది"

బయటికొచ్చేసింది.

శ్రీదేవి ఆటకట్టించడానికేం చెయ్యాలి? కనీసం ఇంకొక్క నెలవరకూ ఆమె ఆకర్షణలో మురళి పడకుండా చెయ్యాలి. అలా అని కేవలం అతడిమీదే ఆధారపడకుండా శ్రీదేవి వేపునుంచి కూడా నరుక్కురావాలి. కాని ఎలా?

తన కారు వస్తోందేమోనని ఎదురుచూస్తూ అసహనంగా పచార్లు చేస్తోంది.

బాబు వస్తూ కన్పించాడు.

గబగబా ఎదురెళ్ళి విష్ చేసింది.

"ఏవిటిప్పుడొస్తున్నారు కాలేజీకి?"

"మా మురళిని కొంచెం ఇంటిదగ్గర వదలివస్తున్నానండీ"

"అతనికేమయ్యింది? రండిలా... ఈ చెట్టుకింద నిలబడి మాట్లాడుకుందాం"

పూవులుదిగిన మర్రిచెట్టు నీడకి చేరారు ఇద్దరూ.

"కాలేజీ గోడల్ని చూశారుగా. అది చూసి మావాడు అప్సెట్టయ్యాడు. ఇంటిదగ్గర వదలివచ్చేసరికి పైమయ్యింది"

"అంటే ఆ రాతలన్నీ..."

"పూర్తిగా అబద్ధాలండీ! ఎవరో కిట్టని వాళ్ళు రాసినట్టున్నారు"

రిలీఫ్‌గా ఫీలయ్యింది రాణి.

"నిజమేనంటారా లేక మీకు్కూడా తెలీకుండా తెరవెనుక ఏమైనా నాటక





మాడుతున్నా రంటారా?"

"అబ్బే... అలాటిదేం లేదండీ! నా సలహా తీసుకోందే మా మురళి ఒక్కపనీ చెయ్యడు"

"మీరతడి గురువు అని నాకు తెలుసు లెండి. మరా రాతలెవరు రాసివుంటా రంటారు?" సాలోచనగా అంది.

"మురళి అంటే పడనివాళ్ళు అలా రాసేరని నా నమ్మకం"

"అయితే అతడి పేరుని శ్రీదేవి పేరుతో జోడించాల్సిన అవసరమేమిటి?"

"అదే తెలీడం లేదండీ"

అందులో ఏదో కీలకం వుందని పించింది రాణికి. ఒకవేళ శ్రీదేవే ఈ పని చేయించి వుంటుందనుకుందామంటే చేజేతులా ఎవరూ చెడ్డపేరూ, దుష్ప్రచారమూ కొనితెచ్చుకోరుగా అనిపిస్తుంది. ఏదియేమైనా ఆ రాతలు నిజం కాకూడదు.. కానివ్వకూడదనుకుంది.

"నేను చెప్పిన సంగతి గుర్తుందను కుంటాను"

కొంచెం గాభరాపడ్డాడతడు.

"మీ శక్తి నాకు తెలుసు లెండి. ఇంకొక్క నెలరోజులు వాళ్ళిద్దరూ దగ్గర కాకుండా చూస్తేచాలు... మీకెప్పటికీ కృతజ్ఞురాలిగా వుంటాను"

"అలాగేనండి" తబ్బిబ్బుపడుతూ అన్నాడు.

"మరి వస్తానూ... అంతా మనవంకే చూస్తున్నారు. రేపు మనపేర్లు గోడెక్కినా ఎక్కొచ్చు" అని నవ్వి అంది, "అఫ్ కోర్స్! మనకి ఇబ్బంది కాదనుకోండీ. నేన్చెప్పింది మర్చిపోరు కదూ?"

మర్చిపోనన్నట్టు తలాడించాడు.

"బై"

రాణి గేటువైపు నడిచింది.

* * *

"రావోయ్‌రా! ఏవిటంత వురుకులు పరుగులు మీదొస్తున్నావు పంతులూ" ఆంజనేయుల్ని ఆహ్వానిస్తూ అన్నాడు పాపారాయుడు.

"గత వారం పదిరోజుల్నుంచీ రోజుకి మూడుసార్లు చొప్పున తమరి ఇంటిచుట్టూ ప్రదక్షిణలు చేస్తున్నాను. తమరు ఇవాళ్టిగ్గాని హైదరాబాదు నుంచి వూడి పళ్ళేదు"

"మంత్రివర్గ విస్తరణరోజులు కదా... వుండవోయ్ అంటేనూ మన యమ్మెల్యే గారి మాట తీసెయ్యలేక వుండిపోయాను. మొత్తానికేవైతేనేం కథ మనం అనుకున్నట్టే జరిగింది. మన యమ్మెల్యేగారు మంత్రి అయ్యారు"

"చిత్తం. పేపర్లో చదివేనండి"

"వచ్చేవారం ఆయన్ని మనూరు తీసుకొచ్చి సన్మానం చేస్తున్నాం. తమరో చెయ్యి వెయ్యాలి"

"ఎంతమాట. మీరెంతంటే అంతే"

"భేషైనమాట చెప్పేవు పంతులూ! ఇవ్వాకొచ్చినప్పుడు ఎనకా ముందూ చూడకుండా ఇచ్చెయ్యాలి. అవసరమొచ్చినప్పుడు అడిగేసి పనిచేయించేసుకోవాలి. అప్పుడేనయ్యా నువ్వైనా నేనైనా పైకొచ్చేదీ. అద్సరేగాని పంతులూ... మన కథకి బ్రేకడిపోయిందంట. మనోళ్ళు ఒకటే ఏడుపనుకో"

"కథకి బ్రేకు పట్టంకాదు మహాప్రభో! నా తోక కత్తిరించేశారు"

"కత్తిరించి ఎంతదూరం ఎల్తారయ్యా! మన యమ్మెల్యేగారిప్పుడు మంత్రి అయ్యారు. మనవంక ఈగ కాదు దోమ కాదు ఏదీ కన్నెత్తి చూట్టానికిల్లేదు"

"అవుననుకోండీ.... కానీ మనం అను

కున్నదొకటీ అయ్యిందొకటీ! ఆ సుధాకర్‌గాడు నా గుట్టుమట్లన్నీ నీలకంఠ రావుగారి దగ్గిర కక్కేశాడు. ఆయన అగ్గిరావుడై ఎక్కౌంట్సన్నీ తిరగేసి తల వాచేలా చివాట్లేసి పోలీస్ కంప్లైంట్ ఇస్తాను, వుద్యోగంలోంచి పీకేస్తానంటూ గంతులేశాడు. అంతటితో వూరుకుంటే బాగానేవుణ్ణు. కాని ఆ కుర్రెధవని డిస్ట్రిబ్యూషన్ సంస్థకి మేనేజర్ని చేసి నన్ను టాకీసొక్కటీ ఏడవమన్నారు. దేవీ ఫిల్మ్స్ ఆఫీసుని విజయవాడకి మార్చాలనీ, దానిని పెద్ద సంస్థగా చెయ్యాలనీ ఇప్పుడు వాళ్ళిద్దరూ మద్రాసెళ్ళారు. ఓ వారం రోజుల్లో వచ్చి మిగతా ముగ్గు లెట్టేస్తారు"

"అబ్బో! శానా కథ జరిగిందే"

"ఇంకా జరుగుతూనేవుంది మహాప్రభో! ఏకులా వచ్చిన కుర్రాడు ఇదివరకు మేకయ్యాడు. ఇంకొన్నాళ్ళలో గునపం అయిపోబోతున్నాడు. అతగాడు త్రివిక్రముళ్ళా రోజు రోజుకీ పెరిగి పోతోంటే నేను మరుగుజ్జులా కుంచించుకు పోతున్నాను. మీరేదో పెద్ద చక్రం అడ్డు వెయ్యాలి. లేకపోతే నా పని గోవింద!" కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ అన్నాడు ఆంజనేయులుగారు.

"చెట్టంత మనిషిని ఎదురుగుండా పెట్టుకుని మొగుడిడిచేసిన ఆడదాన్లా ఏడుస్తావేంటయ్యా ... నేనున్నానుకదా నువ్వూరుకో. నిన్ను దెబ్బతీస్తే నన్ను దెబ్బతీసినట్టేనయ్యా పంతులూ"

"మీరా మాటన్నారు ఇంక నిశ్చింతగా వుంటాను"

"అద్సరేగాని పంతులూ...నీలకంఠ రావుగారూ, ఆ కుర్రాడూ అలా ఎలా అతుక్కుపోయారయ్యా"





"అదే అర్థంకావటం లేదండి. నీలకంఠ రావుగారూ,ఆ అబ్బాయి తండ్రీ చిన్ననాటి స్నేహితులటండి"

"అయితే మాత్రం?"

"ఆ స్నేహితుడెప్పుడో పోయాట్ట యాక్సిడెంట్లో"

"యాక్సిడెంటా?"

"అవునట. వివరాలు లాగుదామని చూశానుగానీ ఆ కుర్రాడేవీ చెప్పి చావ లేదు"

"అయితే అందులో ఏదో రహస్యం వుండే వుండాలి"

"రహస్యం మాటలా వుంచండి. నీల కంఠరావుగారమ్మాయి పట్లిగ్గా ఆ కుర్రాడి వెంటపడుతోంది"

"ఏవిటీ!"

"అక్షరాలా అంతేనండి. నీలకంఠ రావుగారు కూడా ఆ కుర్రాడికి తన కూతుర్నిచ్చి పెళ్లిచేద్దామనే వుద్దేశంతోనే పైకి తీసుకొస్తున్నారేమోనని నా అనుమానం. లేకపోతే నిన్నగాక మొన్న కళ్ళుతెరిచిన పిల్లకాకికి అంత పెద్దబరువు ఎత్తాలని చూస్తారా?"

"నీ ఐడియా నిజవే కావొచ్చోయ్ పంతులూ"

"అది నిజమైతే రేపోమాపో మనం మూటాముల్లె సర్దుకుపోవాల్సిందే. నీలకంఠ రావుగారుగనుక దయదల్చారుగాని ఆ కుర్రాడైతే నన్నెప్పుడో తన్ని తగలేసే వాడు"

"నా బెదిరింపులక్కూడా జడవలే దంటే అతగాడు మొండిఘటమే అయ్యుం డాలి. అతగాడి సంగతి చూడకపోతే మన కథ ముందుకెళ్ళదంటావ్"

"యమ కరక్టుగ్గా చెప్పేరు"

"చాలా పెద్ద పనేనే"

"హమ్మమ్మ..అలా అంటేకాదు. మీరు

తలచుకోవాలేగాని అసలదెంతపనీ. నన్ను రక్షిస్తానని మాటకూడా ఇచ్చారామధ్య" మళ్ళీ డబ్బు ఇవ్వమంటాడేమోనని వణకుతూనే అన్నాడు.

"ప్రాణం పోయినాసరే మాట నిలబెట్టుకుంటాడీ పాపారాయుడు"

"అదితెలిసే కదండీ తమర్ని ఆశ్రయించానూ"

"పిచ్చికమీద బ్రహ్మాస్త్రం వెయ్యక్కర్లేకుండానే కథ జరిపిద్దాం. అసూయా అనుమానం పుట్టాకే ఆడవాళ్ళు పుట్టారంటారుకదా. అంచేత ఓ పనిచెయ్. నీలకంఠరావుగారెలాగూ లేరు గనుక ఇదే మంచి సమయం. ఆయన భార్యతో లేనిపోనివి కల్పించి చెప్పు. సుధాకర్‌కీ, నీలకంఠరావుగారికీ ఏదో సంబంధం వుందను. ఆస్తి అతడికి కట్టబెట్టాలనే నీలకంఠరావుగారూ వారమ్మాయీ నాటకాలాడుతున్నారను. ఇంకా చేతనైతే ఇంకా చెప్పు. దెబ్బతో ఆవిడ భర్తననుమానించి సుధాకర్‌ని దూరాన్నుంచుతుంది. వుంచకపోతే ఒకటి రెండు సంఘటనలు కల్పిద్దాం. దెబ్బతో అతడికి వృద్ధాసన తప్పదు. నీకు సింహాసనం దక్కకా తప్పదు"

"అబ్బా అబ్బా...మీ బుర్ర అమోఘం కదండీ" మురిసిపోతూ అన్నాడు ఆంజనేయులు.

"పొగడ్తొద్దు...ఏనుగు కుంభస్థలం కొట్టేక వాటా ఇవ్వు చాలు.

"ఎంతమాట. మీ తర్వాతే నేను"

"ఆ సంగతి గుర్తుంచుకుని వెళ్ళిరా"

* * *

"మురళిగారూ" అంటూ మురళి రూమ్‌లోకి వచ్చింది శ్రీదేవి.

మురళీ,బాబూ తత్తరపడుతూ లేచారు.

మాసిన గెడ్డంతో దిగులుగా నీరసంగా జ్వరపడ్డవాడిలా వున్న మురళిని చూసేసరికి ఆమె మనస్సు మూలిగింది. ఒక అమాయకుడిజీవితంతో ఆటలాడుకోవడం లేదుకదా అని ఇదయ్యిందొక్క క్షణం. అంతలోనే రాణి ముఖం గుర్తుకొచ్చి కర్కశంగా మారింది శ్రీ.

"మీరా! రండి రండి....కూర్చోండి" అన్నాడు బాబు కుర్చీ వేస్తూ.

"ఫరవాలేదు లెండి"

"మీరలా అంటే కాదు. మీరు మా రూమ్‌కిరావడమంటే మేమూ మా రూమూ కూడా ధన్యమైనట్లే. మీరు కూర్చుంటేగాని మాకు బావుండదు"

'ఈ పిచ్చివాడెవడా !' అన్నట్టు బాబుని చూస్తూ కూర్చుంది.

"అదేవిట్రా మురళీ...అలా బొమ్మలా నిలబడ్డావ్. ఊర్వశిగారు...సారీ సారీ శ్రీదేవిగారొచ్చారు మాట్లాడుతూండు. నేనిప్పుడే సాయిబు హోటల్‌కెళ్ళి టీ పంపమని చెప్పొస్తాను" గబగబా షర్ట్ తొడుక్కుంటూ అన్నాడు.

"అబ్బెబ్బె...ఇప్పుడేం వద్దండీ"

"మీరలా అంటేకాదు. మా ఇంటికొచ్చిన దేవతకి ఆతిథ్యమివ్వడం మా బాధ్యత" అంటూనే చెప్పులేసుకుని బయటికెళ్ళిపోయాడు బాబు.

"ఏవిటలా వున్నారు?" సాధ్యమైనంత ఆర్ద్రతని గొంతులోకి తెచ్చుకుంటూ అంది శ్రీ.

"మీరుకూడా..." ఆమె వంకోసారి తలెత్తి చూసి తలదించుకున్నాడు.

కొన్ని క్షణాలు మౌనం.

"రెండ్రోజుల్నుంచి మీరు కాలేజీకి వెళ్ళటంలేదుట?!" శ్రీ అంది మెల్లగా.

"మీరూ రావటంలేదని బాబు చెప్పేడు"



‘‘నా గురించి వదిలెయ్యండి. మీ గురించే నా బెంగంతా’’

“నేనూ మీ గురించే... అలా ఎవ్రరా శారోగాని మీ పేరుని కూడా గోడల మీది కీడ్చినందుకు నాకు చాలా బాధగా, సిగ్గుగా వుందండీ. అంతటి దుర్మార్గానికి పాల్పడ్డ ఆ ద్రోహుల్ని భగవంతుడు తప్పకుండా శిక్షిస్తాడు”.

“హు... ఎప్పుడో దేవుడు శిక్షించడం మాటెలావున్నా జనమంతా ఇప్పుడు నన్ను శిక్షిస్తున్నారు... వాడిచూపుల్తో, ఎగతాళి నవ్వుల్తో”

బాధగా చూశాడా మెవంక.

“మీరు మగవాళ్లు. ఎన్ని అపవాదు లొచ్చిపడ్డా మీకొచ్చే నష్టమేం లేదు. కాని మా సంగతి? తాగి ఎవడో ఏదో కూసిస కూతకి అడవుల్లో విడిచివేయబడ్డ సీతమ్మ కథ ఈ దేశంలోనే జరిగింది” చెమ్మ గిల్లని కళ్ళని చెమ్మగిల్లినట్లుగా తుడుచు కుంది శ్రీదేవి.

అమాయకుడైన మురళి కరిగి నీరై పోయాడు.

“మీకు చాలా అన్యాయమే జరిగింది. దానిని తొలగించడానికిప్పుడు నేనేం చెయ్యాలో, ఏం చెయ్యగలనో తెలీడం లేదు”

“మీరు నిజంగా తలిస్తే చెయ్యగలరు”

“మీకు జరిగిన అన్యాయం న్యాయంగా మార్చడానికి నేను సిద్ధమే. అందుకు నా ప్రాణాలివ్వడానికూడా నేను సంసిద్ధమే”

“అంతమాటనకండి”

“అనక తప్పదండీ! స్త్రీకి ప్రాణాని కన్నా అధికమైన మానాభిమానాలకి పరోక్షంగానేఅయినానావల్లమచ్చరావడం




నేను సహించలేను. ఆ మచ్చని తుడిచేసి మీ స్వచ్ఛతని నలుగురికీ తెలియజెప్ప డానికి నన్నేం చెయ్యమన్నా చేస్తాను”

“ఏం చెయ్యమన్నా చేస్తారా?”

‘‘నిస్సందేహంగా’’ దృఢంగా అన్నాడు.

“అయితే ఆ గాలివార్తల్ని నిజం చెయ్యండి”

“శ్రీ...శ్రీదేవిగారూ! ఏవిటి మీరంటు న్నది?”

“మిమ్మల్ని మనసారా ప్రేమిస్తు న్నాను. ఈ విషయం మీకెన్నోసార్లు చెప్పేను. కాని మీనుండి పోజిటివ్ రిప్లై రాలేదు.ఈలోగా ఎవరో మనిద్దర్నీకలిపి... అయ్‌మీన్ మనిద్దరి పేర్లూ కలిపి ప్రచారం చేశారు. ఎందుకో ఇదీ మన మంచికే అన్పించింది. ఈ రకంగానైనా మనం దగ్గరైతే నాకంతకంటే కావల్సిందేమిటి చెప్పండి?”

సరిగ్గా ఇదే ధోరణిలో బాబు చెప్పిన మాటలు గుర్తొచ్చాయ్ మురళికి.కానతణ్ని ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్ వదలనందున గిల్టీగా ఫీలవుతూ అన్నాడు, “మీరు కోటికి పడగలెత్తిన ఆగర్భ శ్రీమంతులు. మేం కూటికి అష్టకష్టాలూపడే నికృష్టులం. మీకూ మాకూ వియ్యమంటే లోకం నవ్వుతుంది”

‘‘నవ్వనీండి. ఎవరో నవ్వుతారన్చెప్పి మనం ఏడుస్తూ కూర్చోలేం కదా’’

‘‘మీరు తొందరపడి నిర్ణయానికొచ్చి నట్టున్నారు. పోనీ...’’

‘‘పోనీలూ కానీలూ వద్దు. నేనీ నిర్ణయానికి నిన్నా మొన్నా రాలేదనీ,కొన్ని నెలలు ఆలోచించి కొన్ని నెలల క్రితం ఈ నిర్ణయానికొచ్చాననీ మరోసారి మీకు తెలియజేస్తున్నాను.మీరు యస్సంటే నా ప్రేమ ధన్యమైనట్లే” అంటగా అతడి



వంక చూసింది. కానామె ఆశించినట్టతడు వెంటనే యస్సనలేదు. పొంగిపోలేదు. ఆమెని పొగడ్తల్లో ముంచెత్తనూలేదు. మౌనంగా వుండిపోయాడు. ఏటూ తేల్చు క్కోలేక సతమతమవుతున్నాడు మురళి.

కొన్ని క్షణాలు గడిచాయి.

అసహనంగా కదిలింది శ్రీ. 'ఈ బడుద్ధాయిలో స్పిరిట్ పొత్తిగా పూజ్యంలా వుంది. తన్లాంటి అరుదైన స్త్రీ కోరివచ్చి వలచానంటే మీనమేషాలు లెక్కపెడతాడేవిటి ఖర్మ!'

విసుగ్గా వాచీనీ, అతణ్నీ మార్చిమార్చి చూసింది.

అతడు ఆలోచనా లోకంనుంచి ఇప్పట్లప్పుడే బయటపడేట్టు కన్పించలేదామెకు. మళ్లీ అడిగితే అనుమానించొచ్చు అన్పించింది. అలా అని మరింత సేపక్కడ నిరీక్షించగల ఓపికా లేదు.

"పోనీ ఇది చెప్పండి. వచ్చేవారం మన క్లాసువాళ్ళం బయాలజికల్ టూర్‌కి వెళతున్నాం కదా...మీరు వస్తున్నారా?''

"టూర్‌కాండీ మరేమో... కొంచెం ఇబ్బందిగా...."

"డోంట్ వర్రీ మాన్. మీ టూర్ ఖర్చు నేను భరిస్తాను"

"మీరు నన్ను మరీ సిగ్గుపడేట్టు చేస్తున్నారు"

"మగాళ్లు మీరు సిగ్గుపట్టం ఎందుకండీ! యూ ఆర్ మై ఫ్రెండ్ అండ్ లవర్. అంచేత అడ్డు చెప్పకండి"

"అది కాదండీ! మరి నాకొంచెం టైమ్...."

అతడివంక సాభిప్రాయంగా చూసి

అంది "ఇంకా ఆలోచించాలంటారా? ఆల్‌రైట్... బాగా ఆలోచించండి. మీరు నన్ను ప్రేమించాలనే నిర్ణయించుకుంటే రేపు తొమ్మిదిన్నరకి మా ఇంటికి రండి. కలిసి కాలేజీకెళ్దాం. లేదంటారా రావొద్దు. కాని ఒక్కటి మాత్రం గుర్తుంచుకోండి. మీరు నా ప్రేమనంగీకరించకపోతే నేనేమై పోతానో నాకే తెలీదు"

ప్రాన్పడిపోయాడతడు.

సుడిగాలిలా నిష్క్రమించింది శ్రీదేవి.

మరి మూడు నిముషాలకి హడావిడిగా వచ్చాడు బాబు. అతడివెంట మూడు టీ గ్లాసుల్తో సాయిబు హోటల్ కుర్రాడొచ్చాడు.

"శ్రీదేవిగారేర్రా?"

"వెళ్ళిపొయ్యారు" పరధ్యానంగా జవాబిచ్చాడు.

"టీకోసం వెళ్ళాను కదా... వచ్చే వరకూ ఆపొద్దూ?"

"మర్చిపోయాను సుమా"

"గొప్ప పన్చేశావులే. మర్చిపోయాట! స్వప్న సుందరి వెదుక్కుంటూ మన రూమ్‌కొస్తే టీ నీళ్ళన్నా ఇవ్వకుండా, నోరారా నాలుగు మాటలైనా మాట్లాడకుండా పంపించెయ్యడం మనకీ మన రూమ్‌కీ ఎంత ఇన్సల్ట్! ఛా...ఈ అవమానాగ్నిలో దహించుకుపోయేకన్నా ప్రాయోపవేశం చేయుట యుక్తం" అంటూ నాటక ఫక్కీలో ఏదేదో అనబోతుంటే "టీ చల్లారిపోతోంది సార్" అన్నాడు హోటల్ కుర్రాడు.

టీ తాగటం అయ్యాక డబ్బులు తీసుకొని వెళ్ళిపోయాడు కుర్రాడు.

"శ్రీదేవి ఏం మాట్లాడింపిరా? త్వరగా చెప్పరా బాబూ సస్పెన్స్‌తో ఛస్తున్నాను"

"తనని ప్రేమించమంటోంది. ఏ విషయం రేపు చెప్పాల్ట"

వులిక్కిపడ్డాడు బాబు. గబగబా బుర్ర గోక్కున్నాడు ఏమనాలో తోచక.

అవతల రాణి. ఇవతల ప్రాణ స్నేహితుడు.

ఏం చెయ్యాలి? ఎటు మొగ్గాలి??

"ఇది కొంచెం సున్నితమైన విషయం రా మురళీ. తొందరపడకుండా జాగ్రత్తగా ఆలోచించి మరీ నిర్ణయానికి రావాల్సి వుంది. ఏమాత్రం తప్పటడుగువేసినా కాలుజారి అగాథంలోపడటం ఖాయం. గొప్పవారి ఆగ్రహానికీ అనుగ్రహానికీ పెద్ద కారణాలుండవంటారు. జాగ్రత్తగా ఆలోచించుకో మరి" అన్నాడు హెచ్చరికగా.

"ఆలోచిస్తోన్నకొద్దీ ఆమె నన్ను నిజంగా ప్రేమిస్తోన్నట్టే అన్పిస్తోందిరా. నేనెంత దూరం జరిగినా ఆమె నా వెంటే వస్తోందంటే ఆమె నన్నభిమానిస్తోందనే అన్పిస్తోంది" మెల్లగా అన్నాడు మురళి.

బాబు అర్థంకానట్లు చూశాడతడివంక. మనస్సులో కొంచెం ఈర్ష్యగా కూడా అన్పించింది.

"వయస్సు ఆకర్షణలకి ప్రేమ అన్న అందమైన పేరు తగిలిస్తూంటారు చాలామంది"

"నిన్నటి వరకూ నేనూ అలాగే అనుకున్నాను. కాని ఆ అభిప్రాయం తప్పని ఇవాళే గ్రహించాను"

మురళి చాలా ఎదిగిపోయినట్టుగా అన్పించింది బాబుకి. వెనక్కితగ్గి పోదామనుకుంటూనే అన్నాడు, "పచ్చ కామెర్ల రోగికి లోకమంతా ఎలా అయితే పచ్చగా కన్పిస్తుందో ప్రేమికుడికి కూడా అలాగే లోకమంతా సవ్యంగా అను కూలంగా ప్రేమమయంగా కన్పిస్తుంది...





అన్పిస్తుంది. లోపలికి దిగి చూస్తేగాని లోతు తెలీదు. అంతు చిక్కదు"

"అదీ నిజమే" అంటూ ఆలోచనలో పడ్డాడు మురళి.




గదినిండా లేత నీలంరంగు కాంతి పరుచుకునుంది.

వయ్యారంగా తిరుగుతోన్న సీలింగ్ ఫాన్ శబ్దం మంద్రస్థాయిలోనే వున్నా నిద్రపట్టక దొర్లుతోన్న శ్రీదేవికి భరించ రానిదిగా అన్పించి విసుక్కుంది - 'ఎయిర్ కండిషనర్ ఇప్పుడే తగలడి చావాలా! డాడీ వస్తేగాని బాగై చావదు కాబోలు!'

అటు తిరిగింది అసహనంగా తలగడ సర్దుకుంటూ.

కళ్లముందు మురళి రూపం ప్రత్యక్ష మయ్యింది.

కొన్ని గంటల్రకితం అతడి గదికెళ్లి నప్పటి అతడి ప్రవర్తన గుర్తొచ్చి ఆమె మనస్సు అప్రసన్నంగా మారింది.

అతగాడికేంచూసో అంత మిడిసిపాటు! అసలు తనంతతానుగా వలచి వచ్చిన ఆడదంటే మగవాడికెప్పుడూ లోకువే! లేకపోతే అందంలో అప్సరాంగనల్నీ, ఐశ్వర్యంలో కుబేరుని వారసుల్నీ తలదన్నే తను,తన చుట్టూవున్న లక్షలాది మంది చూపుక్కూడా కన్పించనంత ఎత్తులో వున్న తను వెళ్లి ప్రేమించానా చవటా అంటే వెధవమొహం పెట్టుకుని మీనమేషాలు లెక్కపెడుతూ కూర్చుం టాడా? మరొకడూ మరొకడూ అయితే తనామాటలనడం ఆలస్యం - అమాంతం తన కాళ్లు వాటేసుకుని ''ఈ మహారాజ్ఞి దాసుణ్ణి'' అంటూ నమస్కరించేవాడు! ప్చ్...డర్టీఫెలో...

అసలు వాడిదికాదు తప్పు. ఆ గుడ్ల గూబ రాణినాలి అలాటి పందెం వేసి నందుకు!

అన్నట్టు పందెం గడువు ముగియ డానికింక సరిగ్గా 22 రోజులే వున్నాయ్! మైగాడ్! ఎలా?

కలవరపడిందామె.

ఇంకో మూడ్రోజుల్లో బయాలజికల్ టూర్ కెళ్లి 15 రోజుల తర్వాత వస్తాం. వచ్చిన నాలుగు రోజుల్లో అటో ఇటో తేలి పోవాలి. ఇదైతే ఫరవాలేదు. కాని అదైతే తనా రాక్షసి రాణిముందు సిగ్గూ అభిమానం పరువూ ప్రతిష్ఠా అన్నీ విడిచి మోకరిల్లి...నో..నెవ్వర్. అలా జరగదు. జరగడానికి వీల్లేదుగాక వీల్లేదు!

ఎట్టి పరిస్థితుల్లోనైనాసరే తను ఓడిపోకూడదు!

ఇన్నాళ్లూ తను ప్రేమా గీమా అంటూ సెంటిమెంట్స్‌తో ప్లే చేసింది. అతడు దార్లోకి రాకపోతే బలప్రయోగంచెయ్యాలి. కనీసం ఆ నాల్రోజులూ నాటకమాడే ట్లయినా దార్లోకి లాక్కురావాలి. ఆ రాణి బోడిగుండుని చూసి గర్వంగా నవ్వాలి. వికటాట్టహాసం చెయ్యాలి.

ఆమె గుండెలు తేలికపడ్డాయ్. ఎంతో హాయిగా తృప్తిగా అన్పించింది.

తన పిచ్చిగానీ అతడు లొంగి రాక పోవడమేమిటి. మౌనం అర్థాంగీకారం

అని అననే అన్నారు. రేపు తెల్లార కుండానే ప్రేమ ప్రేమంటూ పరుగున రాకపోతే చూడు!

గర్వంగా నవ్వుకుంది.

హాయిగా ఆదమరచి నిద్రపోయింది.

నిద్రలో ఎన్నెన్నో కలలు.

మురళి వచ్చి 'శ్రీదేవీ! నీ ఈ భక్తుడికి ప్రేమభిక్ష పెట్టవూ?' అని అర్థిస్తూ భిక్షా పాత్ర పట్టుకుని మరీ తనముందు మోకరిల్లి అడిగినట్టూ, రాణి గర్వం అణచినట్టూ, తననంతా అభినందనల్తో ముంచెత్తినట్టూ తీయని అనుభూతి ఫీలయ్యిందా కలలు కంటూ.

ఆ మర్నాడు ఎన్నడూలేనిది ఉదయమే లేచిన శ్రీదేవిని ఇంటిల్లపాదీ ముక్కు మీద వేలుంచుకుని మరీ చూశారు–'మిన్ను విరిగి మీదపడ్డా ఏడున్నర లోపల లేవని శ్రీ ఇవాళ ఆరుగంటలకే లేవటమా?!' అనుకుంటూ.

మీనాక్షమ్మగారు "ఎక్కడికైనా వెళ్ళాలా శ్రీ?" అనడిగారు కొంచెం ఆశ్చర్యంగా కూతుర్ని చూస్తూ.

''ఏంలేదు మమ్మీ...వూరికే'' అంది కొంచెం సిగ్గుపడుతూ.

గబగబా ముస్తాబై ఎనిమిది గంట ల్నుంచీ ఎదురు చూడసాగింది మురళి కోసం.

గడియారంలోని ముళ్ళు చాలా తాపీగా నడుస్తున్నట్టన్పించి విసుక్కుంది.

నిమిష నిమిషానికీ ఆమెలో ఆత్రుత అధికం అవుతోంటే దానితోబాటు గుండె పోటీపడి మరీ కొట్టుకొంటోంది.

తొమ్మిదింబావుకి ఆమె ఫ్రెండ్స్ వచ్చారు.

ఎప్పుడూ లేనిదవాళ శ్రీ అప్పటికే డ్రెస్ చేసుకుని ఉండటం చూసి ముఖా ముఖాలు చూసుకున్నారు.

''మాకోసమేనా ఎదురుచూస్తోంట?'' వుండబట్టలేక అడిగేసింది నళిని.

"కాదే...మురళికోసం''

"ఆ(!'' నోళ్ళు తెరిచారంతా.

"ఎందుకే అలా నోళ్ళు వెళ్ళబెడతారు. నేనంటే ఏమనుకున్నారు. మురళి కాదు... వాడి తాతైనా సరే మనకి దాసోహమనా ల్సిందే''

''అది నిజమే అనుకో...ఇంతకీ మురళి ... ఇక్కడికొస్తాడా?"

''రావటమేకాదు..నన్ను ప్రేమిస్తున్నా నని చెబుతాడు కూడానూ. అంటే మనం ఆడుతోన్న నాటకానికి ఇవాళే క్లైమాక్స్" తల ఎగరేస్తూ అంది శ్రీ.

"అయితే ఇవాళే రాణితో తలపడ దామా?"

"వూ(. నళినీ! ఎలా చేస్తే బావుంటుందో చెప్పవే"

''సాయంత్రం ఓ పెద్ద హోటల్లో రూమ్ తీసుకుందాం. రాణి వచ్చేక మురళికి కబురుపంపి పిలుద్దాం. నీకు యాక్సిడెంట్ అయ్యిందని చెప్పి నాటక మాడదాం. నిన్ను ప్రేమిస్తే అతడు కట్లతో వున్న నిన్ను చూసి బరస్ట్ అవు తాడుగా, అది సరిపోతుంది"

నళిని మాటలు రుచించనట్టుగా అంది కాంతం, ''బాగానేవుందిగాని మనమూ, మురళీ కలిసి నాటకమాడుతున్నామంటుం దేమో రాణి?''

''అంటే దానిష్టమొచ్చిన టెస్ట్ చేసుకో మందాం. మనదేమైనా నాటకమైతేగా భయపట్టానికి. ఆ పిచ్చివాడెలాగూ మజ్నూలా ప్రేమ ప్రేమంటాడు కనుక రాణి భరతం పట్టొచ్చు. తను ఫైర్‌మన్ గారమ్మాయని బోలుడు గర్వపడిపోతోన్న




రాణి పొగరణిచి కాలేజీలో మన జెండా ఎగరేద్దాం"

"ఓకే" శ్రీ మాటల్ని బలపరిచింది సుబ్బలక్ష్మి.

"9-45 అయ్యింది. మురళి ఇంకా రాలేదు"

నళిని మాటలకి కస్సుమంది శ్రీదేవి-"వస్తాడే! రాకుండా వుండటానికి వాడికెన్ని గుండెలుండాలి?"

మరి నోరు తెరవడానికి ధైర్యంచాలక గుడ్లప్పగించి గేటువైపు చూడసాగారు.

పైకి గంభీరంగావున్నా లోపల దడగానే వుంది శ్రీదేవికి. క్షణాలు గడిచేకొద్దీ ఆమె ధైర్యం, నమ్మకం నీరు కారిపోతున్నాయ్. రోషంతో మొఖం ఎరుపెక్కుతోంటే ఎగపీల్చసాగింది.

మురళి రాడన్న నిర్ణయానికొచ్చేశారు శ్రీ స్నేహితురాళ్ళు. కాని ఆ మాటనే ధైర్యంలేక కాలేజీ టైము గడిచిపోతోన్నా వుస్సురంటూ కూర్చుని ఎదురుచూస్తున్నట్లు నటిస్తున్నారు.

10-15.

తలెగరేస్తూ దుఃఖాన్ని నిగ్రహించుకుంటూ వాళ్ళవైపు చూసింది.

రక్తం ఇంకిపోయిన ఆమె మొఖాన్ని చూడలేక చూపులు దించుకున్నారంతా.

"ఇడియట్" పళ్ళు నూరింది శ్రీదేవి తుళ్ళిపడి చూశారు మిగిలినవాళ్ళు.

"పదండి కాలేజీకెళ్దాం. ఆ రోగ్ పని ఎలాపట్టాలో నాకు బాగా తెలుసు"

మారుమాట్లాడకుండా ఆమెననుసరించారంతా.

కారు దిగి అంతా తమతమ క్లాసుల వైపెళ్ళిపోయారు.

శ్రీదేవి కూడా విసవిసా నడిచెళ్ళింది తన క్లాసులోకి.

పర్మిషన్ కోసం గుమ్మంలో నిలబడి నిలబడగానే మురళి కూర్చునే డెస్క్ వైపు చూసింది.

మురళి లేడు!

ఆమె భృకుటి ముడివడింది.

ఏమైపోయినట్టు?

క్లాసుకీ రాలేదు, తనింటికీ రాలేదు.

మరెక్కడ ఏం చేస్తున్నట్టు?

అసలతడి అభిప్రాయం ఏమిటి?

"యస్..కమిన్'' మూడోసారన్నాడు లెక్చరర్.

ఆలోచనల్నుండి తేరుకుని లేడీస్ డెస్క్వైపు నడిచింది.

రమ పక్కకి జరిగి చోటిచ్చింది.

"కొంచెం లేటయ్యింది శ్రీ... అంచేత మీ ఇంటికి రాలేకపోయాను"

రమ మాటలు పట్టించుకోకుండా అంది, "మురళి రాలేదా?"

తల అడ్డంగా వూపింది.

ఏమైనట్టు?

పెదవి కొరుక్కుంది.

ఫస్ట్ అవర్ అయ్యింది.

సెకండ్ అవర్లో వస్తాడనెంతో ఆశగా చూసింది.

కాని రాలేదు.

ముళ్ళమీద కూర్చున్నట్టు కూర్చుంది.

ఎప్పటికో బెల్ అయ్యింది.

"పోదాం రావే''

అయిష్టంగా పుస్తకాలు తీసుకునొచ్చింది రమ.

కారువేగంగా వెళ్తోంది.

శ్రీ ఎందుకంత సీరియస్గా వుందో, మురళి గురించెందుకంత తీవ్రంగా ఎదురుచూస్తోందో అర్థంకాక ప్రేక్షకురాల్లా చూస్తూండిపోయింది రమ.

ఓ చిన్న సందులోకెళ్ళి ఓ ఇంటి

ముందాగింది కారు.

ఎందుకన్నట్టు చూసింది రమ.

"అదిగో...ఆ ఇంటిదగ్గరికెళ్ళి మురళి వున్నాడేమో కనుక్కో"

కారు దిగి వెళ్ళింది రమ.

గెడ్డంకింద చెయ్యి ఆన్చి రమ వెళ్ళిన వైపే చూడసాగింది శ్రీదేవి.

మురళి ఇంట్లోనే వుండివుంటాడనీ, తన విషయంలో ఒక నిర్ణయానికి రాలేక సతమతమవుతూండవచ్చనీ భావించిందామె. అదే నిజమైతే ఏం చెయ్యాలో, అతణ్నెలా ఒప్పించాలో అని ఆలోచిస్తోంటే మొహం ఇబ్బందిగా చేసుకునొచ్చింది రమ.

"వున్నాడా?"

"గదికి తాళం పెట్టివుంది..."

"పక్కవాళ్ళనడక్కపోయావా ?" విసుగ్గా అంది.

"అడిగాను... వూరెళ్ళాట్ట"

"ఎప్పుడు?"

"నిన్న రాత్రిట"

"ఏమంత కొంపలు మునిగిపోయాయిట అర్ధాంతరంగా వెళ్ళడానికి?"

"వాళ్ళకి తెలీదుట"

"వూఁ...రా"

కారు వెనుదిరిగింది.

శ్రీ నిలయం వైపెళ్తోంటే మధ్యలో రమ దిగిపోయింది.

అకస్మాత్తుగా మురళి వూరికెందుకెళ్ళిపోయినట్టు? ఏమైనా అర్జంటు పనా? లేక.. తనతో 'నో' అని చెప్పలేక మొఖం చాటెయ్యడానికా?

అంటే...తన అందం, ఐశ్వర్యం, ఆఖరికి తన ప్రేమకూడా అతణ్ని లొంగదియ్యలేకపోయిందా? కనీసం కదిలించలేకపోయిందా??

కదలని కరగని పాషాణమా అతడి హృదయం?

ఆగర్భ దరిద్రుడైన అతణ్ని తన ఐశ్వర్యం కించిత్తు కూడా లోబరుచుకోలేకపోయిందంటే ఇంతకంటే ఘోరం ఏముంటుంది?

తనకింతకంటే చెంపపెట్టు మాత్రం ఏముంటుంది?

కన్నీళ్ళు వురికిరా ప్రయత్నిస్తోంటే తన గదిలోకెళ్ళి తలుపులు బిగించుకుంది శ్రీదేవి.

* * *

"అమ్మగారున్నారా?" గోపీనడిగాడు ఆంజనేయులు.

"పూజలో వున్నారండి"

"పూజలోనా? అయితే డిస్టర్బ్ చెయ్యకు. పూజయ్యేవరకూ కూర్చుంటాన్లే. నాకర్జంటుపన్లేం లేవులే. ఏం ఫరవాలేదు. దేవుడి పూజ తరవాతేనోయ్ మిగతా విషయాలూ"

ఆయనా వూసులన్నీ తనతో ఎందుకు చెబుతున్నారో అర్థంగాక ప్రశ్నార్థకం మొఖంపెట్టేడు గోపి.

"ఇదిగోనోయ్...కాస్త ఇలారా" రహస్యంగా అన్నాడు.

అనుమానంగా చూస్తూ సమీపించాడు.

"అమ్మాయిగారున్నారా లేక ఎటైనా వెళ్ళారా?"

"వున్నారండి"

"ఇంట్లోనే?"

"ఆయ్...పడుకున్నారండి"

"ఇప్పుడప్పుడే లేవరుకదా?"

"ఒంట్లో బావోటంలేదు కదండీ... లేవరండి"

"మన్లో మనమాట. సుస్తీ ఏవిటి?"

"పెద్దోరి వూసులు మాకేం తెలుస్తాయండి"





''అవునంతేలే! తెలిసినా మనమేం చెయ్యగలంలే. అయితే అమ్మాయిగారికి మంచం దిగి రాలేనంత సుస్తీగా వుందంటావ్''

"అయ్ బాబోయ్...అలాగని నేనెప్పుడన్నానండీ'' కంగారుపడ్డాడు గోపి.

"అబ్బే..అనలేదోయ్! నేనే అన్నాను''

''నాతో అనకండి బావు. అమ్మగారింటే అగ్గిపిడుగైపోతారు'' వడివడిగా అడుగులేస్తూ లోపలికెళ్ళిపోయాడు.

'వీడు లోపలికెళ్ళి తనేదో అన్నానని కూయడుకదా?' అనుమానంగా అతడు వెళ్ళినవేపు చూస్తూ అనుకున్నాడు ఆంజనేయులు.

కాలుకాలిన పిల్లిలా పచార్లుచేస్తోంటే మీనాక్షమ్మగారొచ్చారు. ఆయన్ని చూస్తూనే ముఖం చిట్లించారు.

అది ఆంజనేయులుగారు గమనించినా గమనించనట్టే ముఖంపెట్టి నవ్వుతూ చేతులు జోడించి "నమస్కారం అమ్మగారూ" అన్నాడు.

''వూఁ...అయ్యగారింకా రాలేదు"

''అబ్బే...తమరితోనే పనుండి.."

నుదురు ముడివేసి చూశారు. మళ్ళీ ఏమనుకున్నారో ఏమో వెళ్ళి సోఫాలో కూర్చుని "కూర్చోండి'' అన్నారావిడ.

"అయ్యో...ఎంతమాట! తమముందు కూర్చోగలంతవాణ్నా!''

ఆయన నక్కవినయాలు కంపరం పుట్టించాయామెకి.

''ఇంతకీ ఏవిటంటారూ?''

"తమరు కాస్త సావధానంగా వినాలి. కిట్టనివాళ్ళుచేసిన దుష్ప్రచారంవల్ల నామీద మీకు మునుపటి సద్భావంలేదని తెలిసినా ఇన్నేళ్ళనుంచీ మీ వుప్పుతింటున్నవాణ్ని గనుక నేను విన్నవిషయదార్థాన్ని కాస్త మీ చెవిలో పారేసిపోదామని వచ్చాను. మీరు నన్ను మందలించినా, అపార్థం చేసుకున్నా సరే కడుపులో నిజాన్ని కక్కేస్తేగాని నాకు శాంతి, తృప్తి వుండవని లేస్తూనే పరుగెత్తుకొచ్చాను"

''మీరనేది ఏ సంగతి గురించీ?"

''మన వ్యవహారాల గురించే అనుకోండీ"

"ఇప్పుడేమైందంటారు?''

"మీరలా గట్టిగా అడిగితే నాకు నోరు పెగల్దు''

చిన్నగా నవ్వి, ''చెప్పండి" అన్నారావిడ.

"హమ్మయ్య...సుధాకర్ తెలుసు కదండీ''

"తెలుసు. ఏం?''

''అతడు మంచివాడూ, చురుకయినవాడూ, నమ్మకస్తుడూ అని మాత్రం మీకు తెలుసు. అంతేకదండీ?''

తలాడించారు అవునన్నట్టు.

''కానతడి గురించి మీకు తెలీని రహస్యం ఒకటుందండి"

''రహస్యమా?" కాస్త ముందుకి వంగి అన్నారు.

' అక్షరాలారహస్యమేనండీ. అతగాడు నిన్నగాక మొన్న అత్తెసరు మార్కుల్తో డిగ్రీ పూర్తిచేసి అయ్యగార్ని ఉద్యోగం అడిగాడో లేదో అమాంతం అసిస్టెంట్ మేనేజర్‌గా వేసేశారు. పోనీ అంతటితో వూరుకున్నారా అంటే అదీలేదు. డిపీ ఫిలిమ్స్‌కి మేనేజర్ చేసేశారు. ఇప్పుడా సంస్థని భారీసంస్థగా మార్చేస్తూ మద్రాసూ, విజయవాడా తిరుగుతున్నారు. ఇంతకొద్ది కాలంలో అతగాణ్నింత పైకి అయ్యగారు తీసుకొస్తున్నారూ అంటే దాని వెనుకేదో రహస్యకారణం వుండేవుంటుందనిపిస్తోంది

కదండీ'' ఆమె ఫీలింగ్స్‌ద్వారా ఆమె భావాలని చదవప్రయత్నిస్తూ అన్నాడు ఆంజనేయులు.

అన్యమనస్కంగా తలూపారావిడ.

"మీరన్నది నిజమండీ! జూదంలాంటి సినిమా పరిశ్రమలో అతిముఖ్యమైనదీ, లక్షల్లో వ్యాపారం నడిచేదీ, ఎంతో వ్యవహారజ్ఞానం అనుభవంస రైన అంచనా వెయ్యగల శక్తి వగైరా వగైరా సవాలక్ష లక్షణాలు కావల్సినటువంటిదే అయిన డిస్ట్రిబ్యూషన్‌సంస్థకి బొడ్డూడని బుడ్డోణ్ణి తెచ్చి మేనేజర్ని చేసేరంటే దానివెనుక ఎంత బలమైన కారణంవుందో మీరే ఆలోచించండి" ఆగాడాయన.

''కారణం ఏవిటంటారు?" తగ్గు స్థాయిలో అడిగారు మీనాక్షమ్మగారు.

"అడిగారుగనుక నేను విన్నది చెబుతున్నాను. ఇందులో నిజం ఎంతో ఆ భగవంతుడికే తెలియాలి"

"చెప్పండి ఆంజనేయులుగారూ .... మీరు చెప్పేరని మిమ్మల్నేమీ అనన్లెండి"

"నాకా నమ్మకం వుందండీ! మా అమ్మగారు ముగ్గురమ్మాయిల మూల పుటమ్మ అని నా విశ్వాసమండి"

"నాస్చక సంగతి చెప్పండి"

ఆమె ఆత్రుతకి లోలోన నవ్వుకుని రావాల్సిన ఎఫెక్ట్ వచ్చినందుకు సంతోషిస్తూ అన్నాడు. "ఆ సుధాకర్ తండ్రీ అయ్యగారూ స్నేహితులని తమకి తెలుసుగదండీ! సదరు సుధాకర్ తల్లికీ అయ్యగారికీ సంబంధంవుందనీ..."

"ఆంజనేయులుగారూ!" అరిచారావిడ.

''క్షమించాలి. నేవిన్నది మాత్రం మనవి చేస్తున్నాను... సంబంధం వుందనీ అతగాణ్ణి పైకి తీసుకురావాలనే త్వరత్వరగా ప్రమోషన్స్ ఇచ్చేశారనీ అయినా తృప్తిపడని ఆవిడగారు అతగాడికి ఆస్తి దక్కేట్లు చూడమనీ, లేనిచో తమ సంబంధం బయటపెడతానని బెదిరిస్తోందనీ, అంచేత అయ్యగారు తనకి ఆవిడతో సంబంధంవున్నా తన స్నేహితుడి సంతానమైన సుధాకర్‌కి శ్రీదేవినిచ్చి వివాహం చెయ్యాలనే తలంపుతో వున్నారనీ"

''ఇంకాపండి చాలు. ఎవరో మీ దగ్గర చాలా సొరకాయలు కోశారు''

"అమ్మగారూ...తొందరపడకుండా ఆలోచిస్తే అవన్నీ నిజమే అని తేటతెల్లమవుతాయ్. వారికడ్డుగా వున్నానని అయ్యగారూ, సుధాకరూ కలిసి నామీద లేనిపోని అభాండాలేసి పిల్లలుగలవాణ్ణైనా జాలి చూపకుండా పొట్టమీద కొట్టారమ్మగారూ. దేవుడుండబట్టి ఏదో ఈ వుద్యోగమైనా నిలిచిందిగాని లేకపోతే మేం ఇంటిల్లపాదీ గోదార్లో దూకాల్సొచ్చేదమ్మగారూ" కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడాయన.

"సర్లెండి. జరిగిందేదో జరిగిపోయింది''

"అందుకే కదండీ ... అవన్నీ దిగమింగేశాను. ఇది మాత్రం మింగలేక మీ దగ్గరికి పరుగెత్తుకొచ్చాను. పోనీ మీరే ఆలోచించండి. ఎంత 'ఇది' లేకపోతే అతగాణ్ణి అంత పెద్ద వుద్యోగంలో కూర్చోపెడతారు చెప్పండి? అంతటితో ఆగారా అంటే అదీ లేదు. అతగాడ్తో తిరగమని అమ్మాయిగార్తో చెప్పి...''

"నిజమా!''

"నా తోడండి!'' తలమీద చెయ్యేసుకున్నాడాయన.

తల పంకించారావిడ.

సుధాకర్ మొదటిసారి వచ్చినప్పుడు తన తల్లి ఇచ్చిందంటూ ఓ ఉత్తరం

తెచ్చివ్వడం, ఆయన దాన్ని తనకి చూపించకుండా దాచడం గుర్తొచ్చింది. అందులో ఏముంది వుంటుంది? ఆంజ నేయులన్నట్టు బెదిరింపా?

మంచివాడూ, నమ్మకస్తుడూ అని ఆయన పదేపదే అంటే తను పెద్దగా పట్టించుకోలేదుగానీ ఆ కుర్రాడికేం తెలుసని, ఏం అనుభవం ఉందని డిస్ట్రిబ్యూషన్ సంస్థకి మేనేజర్ని చెయ్యడం? దీని వెనుకేదో లేకపోతే ఇంత తక్కువ కాలంలో ఇన్ని మార్పులు చెయ్యరు!

వీటికన్నా దారుణం శ్రీనిచ్చి పెళ్లి చెయ్యాలని చూట్టం. ఆయన మాటంటే శ్రీకెంతో గురి. ఆయన దానికి నూరిపోసిన ఫలితమే అతగాడితో దాని తిరుగుళ్లై ఉంటుంది. లేకపోతే బంగారం లాంటి ఫణిభూషణరావుగారి సంబంధాన్ని ఏవో వంకలు పెట్టి కాదంటారా? అదంతా ఆయన ప్లాన్‌లోని భాగమే. తను పిచ్చిది గనుక అదేమీ గమనించకుండా ఆయన చెప్పినదానికల్లా తలూపేస్తోంది.

ఎంత దారుణం!

మీనాక్షమ్మగారి మొఖం ఎర్రబడింది.

"మరి నేవస్తానండి'' ఆమెలో చెలరేగుతోన్న భావసంచలనాన్ని ఆమె మొఖం ద్వారా చదివి తన పని సానుకూలమైనందుకు సంబరపడుతూ అన్నాడు ఆంజనేయులు.

ఆవిడ మాట్లాడలేదు.

మరికొంచెం సేపుండటం మంచిది కాదనుకుని మరోసారి వెళ్తున్నానని చెప్పి వెళ్ళిపోయాడాయన.



బొమ్మలా కూర్చునుండిపోయారావిడ.

* * *

శ్రీదేవి సూర్యుడి ముఖం చూసి రెండ్రోజులయ్యింది.

ఈ రెండ్రోజులూ తన గదిలోనే వుండిపోయింది, ఆకలేస్తే గోపీని పిలిచి ఏదో ఇంత తినేది. మిగిలిన సమయమంతా నిద్రమత్తులో గడిపేసింది.

ఆమె ధోరణి అర్థంగాక మీనాక్షమ్మగారు చాలా కంగారుపడ్డారు. డాక్టర్ని పిలిస్తే సుస్తీ ఏంలేదని చెప్పి ఇంజెక్షన్ చేసి వెళ్ళిపోయాడు. మెలకువ వచ్చిన శ్రీని ఏమయ్యిందే అంటే ఏదో అని మళ్ళీ తన లోకంలోకి జారిపోయింది.

చిత్రంగావున్న ఆ ప్రవర్తనకర్థం చెప్పుకోలేక నీలకంఠరావుగార్తో ఫోన్లో మాట్లాడారు మీనాక్షమ్మగారు.

''ఎక్కడో ఏదో చిన్న దెబ్బ తగిలుంటుంది తన అహానికి. అంతకంటే ఏం వుండదులే. అయినా రేపు మేం బయల్దేరి వచ్చేస్తున్నాంగానీ అనవసరంగా వాళ్ళకీ వీళ్ళకీ చెప్పి గోల చెయ్యకు" అన్నారు.

ఆయన రాక కోసం ఎదురుచూస్తోంటే ఓ యువకుడు సందేహిస్తూ వచ్చి నిలబడ్డాడు.

మాసిన అతడి బట్టల్నీ, బీదతనం మూర్తీభవించినట్లున్న అతడి రూపాన్నీ చూసి ముఖం చిట్లించి, "గోపీ! ఏంకావాలో కనుక్కో" అని లోపలికెళ్ళిపోయారు మీనాక్షమ్మగారు.

ఆమె వెళ్ళిపోయినందుకతడెంతో సంతోషించి భవన సౌందర్యాన్ని తిలకించడంలో నిమగ్నుడైపోయాడు.

"ఎవరు కావాలి అయ్యగార్లేరు''





అతడి వాలకం మర్యాద ఇవ్వక్కర్లేనిదిగా అన్పించడంతో కాస్త అమర్యాదగానే అడిగాడు గోపి.

"శ్రీదేవిగారు...అదే మీ అమ్మాయిగారు"

"ఆవిడ కావాలా?''

"కొంచెం మాట్లాడాలి"

"ఇప్పుడు వీలుపడదు. రేపు రండి''

నిస్సహాయంగా చూశాడతడు.

"కొంచెం అత్యవసరం బాబూ''

''యమర్జంటైనా లాభం లేదండీ! ఆవిడిప్పుడప్పుడే కిందికి రారు''

''పోనీ నేనొచ్చానని చెప్పు బాబూ''

''ఇప్పుడెళ్ళి చెబితే నన్నూ నిన్నూ కూడా నమిలేస్తారు"

''అదికాదు బాబూ..చాలా ముఖ్యమైన పనిమీదొచ్చాను. నా పేరు చెబితే ఆవిడ కోప్పడరు. వెంటనే నన్ను తీసుకు రమ్మంటారు''

వింతగా చూశాడతడివైపు గోపి. అతడు చెబుతోంది నిజమేనేమో అన్పించింది.అతణ్ని వెళ్ళిపొమ్మన్నట్టుఅమ్మాయిగారికి తెలిస్తే తన తాట వలిచేస్తుందనిపించింది. గోడకి తగిలించివున్న కొరడా వైపు భయంగా చూసి గుటకలు మింగి అతణ్ని కూర్చోమని సైగ చేశాడు.

మెట్లవైపు రెండడుగులేసి, ''ఎవరొచ్చారని చెప్పాలి?'' అనడిగాడు ఏదో గుర్తొచ్చి.

''మురళి"

వులిక్కిపడ్డాడు గోపి.

ఈ రెండ్రోజుల్లో శ్రీ నోట ఆ పేరు చాలాసార్లు విన్నాడు. 'మురళి రాలేదు కదూ?' అని తననెన్నోసార్లడిగింది. కోపంతో అతణ్ని తిట్టింది,పళ్ళునూరింది. చంపేస్తాను, యాక్సిడెంట్ చేసేస్తానంటూ కలవరించింది.

అదంతా ఇతడికోసమేనా?

మురళి వంక అదోలా చూశాడు.

అతడొచ్చాడని చెబితే అడపులిలా తనమీద పడదుకదా?

తప్పదన్నట్లుగా మెల్లగా అడుగు లేస్తూ పైకెళ్ళి శ్రీదేవి గది తలుపు తోశాడు.

బెడ్ మీద అస్తవ్యస్తంగా పడుకునుంది శ్రీ. దిండ్లు కొన్ని బెడ్ మీదా కొన్ని కిందా వున్నాయ్.

''అమ్మగారూ..'' మెల్లగా పిలిచాడు.

ఆమె కదల్లేదు.

మరో రెండుసార్లు పిలిచాక ''వూ'' అని మూల్గింది.

ఇదే అదనని ''మీకోసం ఎవరో మురళిగారంట...వచ్చారండి" అన్నాడు.

గబుక్కున లేచి కూర్చుంది శ్రీ.

''ఎవరొచ్చారూ?''

''ము...మురళిగారంటండి''

అతడి నోటినుండా మాటలు పూర్తిగా వెలువడకుండానే స్ప్రింగులాలేచి అతణ్ని రాసుకుంటూ గబగబా కిందికొచ్చేసి ఆఖరి మెట్టుదగ్గర ఆగింది శ్రీదేవి.

ఆమెకి కొన్ని అడుగుల దూరంలో తలొంచుకుని నిలబడ్డాడు మురళి.

అతణ్నలా చూసేసరికి ఆమెలో కోపం బుసలుకొట్టింది.

''ఎందుకొచ్చావు దుర్మార్గుడా...పో! మొన్న వస్తానని రాకుండా దగాచేస్తావా? నా స్టేటస్ మరచి నిన్ను నమ్మి నీ చుట్టూ తిరిగినందుకు మంచి గుణపాఠం చెప్పేవు. నాకంటే,నా ఆస్తిపాస్తులకంటే నీ దరిద్రమే ఎక్కువనికదా మొన్న రాలేదు.పో..పోయి దానితోనే వూరేగు. ఆ దరిద్రంలోనే కుళ్ళిపో..."

ఆమె ముఖం ఎర్రగా మండుతోంది. ముక్కుపుటాలు అదురుతున్నాయ్.

పెదాలు విపరీతంగా కంపిస్తున్నాయి.

మాడ్చేసేలా చూస్తున్నాయి ఆమె కళ్లు.

తప్పుచేసినవాళ్లా తలొంచుకుని నిల బడ్డాడు మురళి. ఆమె ఎన్నన్నా మౌనం వహించాడుతప్ప పెదవి విప్పలేదు. కనీసం ఆమెవంక చూళ్ళేదు.

''మాట్లాడవేం...ఇప్పుడెందుకొచ్చావు? నా ఏడుపు చూసి నవ్వడానికా?''

కలవరంగా చూశాడు.

''మరింకెందుకు? నన్ను ప్రేమించానని చెప్పడానికా?''

తలవాల్చి తలూపాడు.

పిచ్చిదాన్లా చూసిందామె.

ఆమె కోపం మంచుగడ్డలా కరిగి పోతోంటే-''ఏవిటి ... ఏవిటి నువ్వంటు న్నది? నన్ను...నన్ను నిజంగానే ప్రేమి స్తున్నావా?'' అనడిగింది రెండడుగులు ముందుకేసి.

తలూపి అన్నాడు, ''ప్రాణాధికంగా ప్రేమిస్తున్నాను.ఇప్పుడే కాదండీ!మూడేళ్ల క్రితం మిమ్మల్ని చూసినప్పట్నుంచీ మూగగా ప్రేమిస్తూనే వున్నాను. మనసులో ఆరాధిస్తూనే వున్నాను. కాని.. మీరు అందని ప్రమానిపండని తెలుసు. నా పరిస్థితి, నా బరువుబాధ్యతలూ తెలుసు. అందుకే ఆ ప్రేమని గుండె గదులకే పరిమితంచేశాను.మీరునన్ను పసిగట్టుకుని కలిసి మాట్లాడుతోంటే, మీ మాటల్లో చేష్టల్లో ప్రేమ వ్యక్తమవుతోంటే నా బాధ్యతలదృష్ట్యా మనసు రాయిచేసుకుని మీకు దూరంగా వుండిపోయాను. అప్పుడు నేననుభవించిన క్షోభ ఏవిటో నా ఒక్కడికే తెలుసు. మొన్న మీరొచ్చి ప్రేమిస్తున్నట్టు చెప్పినప్పుడు నేనెంత

పొంగిపోయానో, మీ హృదయౌన్నత్యా నికి నా గుండెలు హర్షంతో ఎలా పులకిం చాయో మాటల్లో వర్ణించలేను. అప్పుడే నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నానంటూ చెప్పాలనే అనుకున్నానుగాని సంతోషం నా గొంతుకడ్డంపడి మాట్లాడనివ్వలేదు. మర్నాడు మీరు చెప్పినట్టుగా మీ ఇంటికి రావాలనీ, నా ప్రేమని వ్యక్తంచెయ్యాలనీ ఎంతో వువ్విళ్ళూరాను.ఎందుకేనా మంచిది మా ఇంట్లో ఓ మాట చెబుదామని ముందుగా మా వూరెళ్ళాను''

ఆమె ఆశ్చర్యానందాలకి అవధుల్లేక పోయాయ్.

ఇతడు తనని చూసిన ప్రథమక్షణం నుంచీ మూగగా ఆరాధిస్తున్నాడా?

అపనమ్మకంగా చూసింది.

ఆనందంగా చూసింది.

విజయగర్వంతోనూ చూసింది.

ఆమె ముఖంలోకి పండువెన్నెల కాంతి వచ్చింది.

ఆమె శరీరంలో నూతనోత్సాహం పెల్లుబికింది.

కొన్నిక్షణాలు మూగదాన్లా గుడ్లప్ప గించి చూస్తూండిపోయింది.

అంతలోనే తేరుకుని "థాంక్యూ మురళీ! ఈ మహత్తర క్షణాలకోసమే ఇన్నాళ్ళూ తపిస్తున్నాను. కళ్ళల్లో ఒత్తు లేసుకుని మరీ ఎదురుచూస్తున్నాను. థాంక్యూ..థాంక్యూ వెరీమచ్. అరెగోపీ.. స్వీటూ హాటూ అన్నీ పట్రారా...క్విక్, కమాన్ మైడియర్‌బోయ్" అంటూ మురళి చెయ్యిపట్టుకుని మేడమీది తన గదివైపు లాక్కెళ్ళింది మురళిని శ్రీదేవి.

"ఏమిటి డియర్...ఈ డ్రెస్సూ ఇదీ? అబ్బే...ఏం బావోలేదు. నా డియర్‌బోయ్ డ్రీమ్‌బోయ్‌లా వుండాలి. కింగులావున్న నిన్ను చూసంతా కంగుతినాలి. వుండు చెబుతా" అంటూ ఓ పెద్ద రెడీమేడ్ షాపుకి ఫోన్‌చేసి ఓ డజన్ డ్రెస్సులు పంపించ మంది.

"ఇంకో అయిదు నిమిషాల్లో వచ్చే స్తాయ్. నీకు నచ్చినవన్నీ తీసేసుకో. నువ్వెలావుండాలో ఇందాకే చెప్పేనుగా. ఇక నువ్వు దేనికీ లోభించకూడదు. గొప్పగా డిగ్నిఫైడ్‌గా వుండాలి. నీ కష్టం నా కష్టమేగనుక నీ అవసరం నా అవస రమే గనుక నీకేం కావల్సినా నిరభ్యంత రంగా అడుగు. సిగ్గూ ఎగ్గూ జానానహీ. తెలిసిందా మురళీ? ఇక నువ్వు నేలమీద కాలుపెట్టాల్సిన అవసరం లేదని గుర్తుం చుకో.మా నాన్నగారింకా మద్రాసు నుంచి రాలేదు. వచ్చివుంటే నిన్ను నా ఫ్రెండ్‌గా పరిచయంచేసేదాన్ని. అన్నట్టు జయాల జికల్ టూర్‌కి రేపేకదా బయల్దేరాల్సింది. ఇవాళే మనిద్దరి తరఫునా డబ్బుకట్టేస్తాను. నీ టూర్ ఖర్చులేకాదు...ఈ క్షణంనుంచి నీ ఖర్చులన్నీ నావే. మనం టూర్‌నుంచి రాగానే డాడీకి పరిచయంచేస్తాను. పరీక్ష లయ్యీ అవ్వగానే మన పెళ్ళి. ఎలాటి శంకలూ అనుమానాలూ పెట్టుకోకు డియర్. మా డాడీ సినిమా డాడీ కాదు. మై సెలక్షన్ ఈజ్ హిజ్ సెలక్షన్..ఓకే? అన్నట్టు హనీమూన్‌కి కాశ్మీర్ వెళ్ళాలని ఎప్పట్నుంచో కలలు కంటున్నాను. వాడ్డూయూసే?"

గలగల మాట్లాడేస్తోంటే కలో నిజమో తెలీక చూస్తూండిపోయాడు నోరు తెరచి మురళి.

"ప్రేమామృతంతో నన్నభిషేకించి అమరుణ్ని చేస్తోన్న ఓ దేవతా! ఈ పేద భక్తుడు నీకేమి సమర్పించగలడు- నిండు మనస్సుతో నిర్మల భక్తి తప్ప!"

"చాలా బాగా చెప్పేవ్" చప్పట్లు కొట్టింది.

"ఈ జన్మలోనే కాదు... మరో ఏడు జన్మలెత్తినా మీ రుణం తీర్చుకోలేను"

"రుణాలూ వడ్డీలూ మర్చిపో డియర్! ఇక మనమధ్య అలాంటి మాటలు దొర్లకూడదు"

"అజ్ఞ" అన్నాడు నవ్వుతూ.

"చదువులోనేకాదు... కవిత్వంలోనూ, సంభాషణల్లోనూ కూడా చతురుడివే" అంది శ్రీ ఆనందంగా.



9

సుధాకర్, శ్రీదేవి ఆ హోటల్లోని ఫామిలీ రూమ్‌లోకెళ్ళి కూర్చున్నారు.

స్నేహితురాలు సుందరితో కలిసి ఆ హోటల్లో కాఫీతాగి వెళ్ళిపోబోతున్న రాణి దృష్టిలో పడ్డారు వారిద్దరూ.

అవాళ పొద్దుట మురళి శ్రీదేవి కార్లో కాలేజీకి రావడం చూసినప్పట్నుంచి రాణికి పిచ్చెత్తినట్టుగావుంది. అపర ప్రవరాఖ్యుడని పేర్గాంచిన మురళి శ్రీదేవి వలలో ఇంత తేలిగ్గా ఎలా పడ్డాడో ఎంత బుర్ర బద్దలుగొట్టుకున్నా అర్థంకాలేదు. తను కళ్ళారా చూసిన దృశ్యానికే కళ్ళు నీళ్ళ పర్యంతం అయిపోతోంటే, "మురళి శ్రీదేవిని పిచ్చిగా ప్రేమిస్తున్నాడని ఇవాళే ఋజువు చేస్తాం... కాచుకో" అంటూ కాంతం ద్వారా కబురంపింది శ్రీ.

"ఆ ఋజువులన్నీ గడువు లేదనే చూపించాలి. ఈలోగా కుదరదు" అని సర్ది చెప్పి పంపించేసి వాళ్ళని విడదియ్యటం ఎలాగా అని ఇదవుతోంటే మరో షాకింగ్ న్యూస్ తెలిసింది.

రేపట్నుంచి ఫైనల్ఇయర్ స్టూడెంట్స్ అంతా బయాలజికల్ టూర్‌కి కొడైకెనాల్, మద్రాసు, రామేశ్వరం వగైరా ప్రాంతాలకి వెళ్తున్నారు. ఇలాంటివాటికి ఎన్నడూరాని మురళిఈసారి వస్తున్నాడు. పైగామురళి ఖర్చంతా శ్రీదేవే భరిస్తోందట!

ఆ టూర్ పుణ్యమా అని వాళ్ళు మరింత దగ్గరైపోతే తన పని షవరమే! తనిలా ఇదైపోతోంటే ఇప్పుడు శ్రీదేవి మరో యువకుడితో రాసుకుని తిరుగుతూ కంటబడింది!

అతడెవరై వుంటాడు?

ప్రేమికుడా? బంధువా??

ఆ బాపతు కాకపోతే అంతలా నవ్వుకోదు. క్లోజ్‌గా వుండదు.

వాళ్ళ సంబంధం గురించి తెలుసుకుంటే తన పని తేలికవ్వొచ్చేమో?

మరింకేం ఆలోచించకుండా "వెళ్దాం గాని రావే" అంటూ సుందరిని పిలిచి శ్రీదేవి గమనించకుండా ఫామిలీ రూమ్‌లోకి దూరి వాళ్ళకక్కన్పించకుండా వాళ్ళ మాటలు వినగలిగే చోటు చూసుకుని కూర్చుంది రాణి. ఆమె పక్కనే చతికిలబడింది సుందరి.

"ఇప్పుడే కదా కాఫీ తాగాం..."

"ష్... మాట్లాడకు"

సుందరి అయోమయంగా చూసింది.

ఆమె చూపులు పట్టించుకోకుండా చెవులు రిక్కించి శ్రీదేవీ సుధాకర్ల సంభాషణ వినసాగింది రాణి.

"ఏం ఆర్డరివ్వను శ్రీ?"

"ఏదిచ్చినాసరే"

"అలా అంటే కాదు. నీకేది బావుంటుందంటే అదే"

"సరే" అంటూ ఏమేమి ఐటమ్స్ వున్నాయో కనుక్కునిబేరర్‌కి ఆర్డరిచ్చింది.

"ఏమీ అనుకోనంటే చిన్న సందేహం"

"సందేహమా?"

"వూఁ...మన పెళ్లికి మీ అమ్మగారు ఒప్పుకోకపోతే..."

"అయ్‌డోంట్ కేర్"

"అదికాదు...."

"ఇంకేం చెప్పొద్దు. తిక్కరేగిందంటే నేనెవ్వర్నీ లెక్కచెయ్యను. నా మాట కాదన్నా,నాదారికడ్డువచ్చినా సహించను" కాస్త తీవ్రంగా అంది శ్రీ.

"సారీ... నావుద్దేశం అదికాదు. మనిద్దరి అంతస్తుల్లో వున్న తేడా దృష్ట్యా...."

"అయినాసరే చెప్పదు. ఎంచేతంటే మాఅమ్మ పెళ్లినాటికి మా డాడీ ధనికుడు కాదు. మా ఆస్తిపాస్తులన్నీ మా అమ్మవే. మా డాడీ చేసేందల్లా వాటిని రెండు మూడు రెట్లు చేశారు"

"అయితే పర్లేదు. మీ డాడీ కూడా అభ్యంతరం చెప్పరు. నా సైడ్‌నుంచి అభ్యంతరాలే వుండవ్. అయితే మన లైన్‌క్లియర్ అన్న మాట"

"అన్నమాట కాదు వున్నమాటే"

అలా వాళ్లు హాయిగా నవ్వుకొంటోంటే రాణి విస్లేకలేచి వచ్చేసింది. ఆమె వెంట ఆమె స్నేహితురాలు కూడా వచ్చేసింది.

"అతడు శ్రీదేవి వుడ్‌బీ హజ్బెండ్ అనుకుంటాను" సుందరి అంది.

"అంతేకాదు- శ్రీదేవి ప్రియుడు కూడా. ఇన్నాళ్ళకి చక్కని అవకాశం చిక్కింది. ఇక శ్రీదేవి ఎక్కడికి పోగల దులే. దానిచేత మూడు చెరువుల నీళ్ళు తాగించి ముప్పు తిప్పలు పెట్టకపోతే నా పేరు రాణే కాదు"

ఆశ్చర్యంగా చూసింది సుందరి ఆమె వంక.

ఆమెకి పందెం గురించి తెలీదు!

* * *

రాత్రి పదిగంటలవుతోంది.

నీలకంఠరావుగారి గదిలో వెలుగూ, నిశ్శబ్దం కలిసి రాజ్యమేలుతున్నాయ్.

ఆయన చేతులు వెనక్కి పెట్టుకుని పైప్ కాలుస్తూ తీవ్రంగా ఆలోచిస్తూ పచార్లు చేస్తోంటే, మీనాక్షమ్మగారు మంచంమీద కూర్చుని వుక్రోషంగా చూస్తున్నారు.

"ఆ సుధాకర్‌నెందుకంత పైకి తీసు కొస్తున్నారు? మనకింద పనిచేస్తోన్న వారిలో ఎవరిమీదా చూపించని ఆపేక్ష అతడమీదే ఎందుకు చూపిస్తున్నారు" ధాటీగా అన్నారు మీనాక్షమ్మగారు.

"నీకు మళ్ళీ మళ్ళీ చెబుతున్నాను. అతడికి అనుభవం తక్కువే అయినా చాకచక్యం ఎక్కువ. దీక్షా పట్టుదలా అన్నీ అవసరమైనంత వున్నాయ్. పిటన్నిటినీమించి నమ్మకస్తుడు"

"ఆ కుర్రాడేవిటి ... మనింట్లో పని చేస్తోన్న గోపీ కూడా నమ్మకస్తుడే"

"వీడికీ అతడికీ పోలికా?"

"మీలాగా ప్రత్యేక శ్రద్ధతో పుల్ ఇచ్చేవాళ్ళుంటేవాడూ మేనేజరయ్యేవాడు."

"డోంటాక్ రబ్బిష్. ఎన్నడూ లేనిది ఇవాళ చాలా చిత్రంగా, మాట్లాడు తున్నావ్"

"నిజం ఎప్పుడూ చేదుగానే వుంటుంది

లేండి''

"ఏవిటా నిజం?"

"అది చెప్పమనే అడుగుతున్నాను. శ్రీని అతగాడికిచ్చి పెళ్లిచేస్తే బావుంటుందంటే ఏవిటో అనుకున్నానుగాని దాని వెనుక ఇంత కథ వుంటుందనుకోలేదు"

"కథాలేదు కాకరకాయా లేదు. అప్పుడే కాదు ఇప్పుడూ అంటున్నాను... శ్రీ జీవితం మూడు పువ్వులూ ఆరు కాయలుగా వుండాలంటే అతడికన్నా బుద్ధిమంతుడుండడు''

"అవునవును. లోకం గొడ్డుపోయింది కదూ"

"నువ్వేలా అనుకున్నా సరే. చాలా మందిని చూశాక నేనొచ్చిన నిర్ణయం అది".

"ఆ నిర్ణయానికి ముందొచ్చారు గనుకనే ఫణిభూషణరావుగారి సంబంధానికి వంకలు పెట్టి తోసిపుచ్చారు"

"ఎందుకు నామీదిన్ని అభాండాలు వేస్తావ్? నీకేమయ్యిందివాళ??"

"నావి అభాండాలా? మీరా కుర్రాణ్ని మన ఆస్తిపాస్తులకధిపతిని చెయ్యాలని చూడటం అభాండమా? శ్రీ నతడికిచ్చి పెళ్లి చెయ్యాలని చూడటం అభాండమా? సూటిగా నాతో చెపితే కాదంటానని అమాయకురాలైన శ్రీ అతణ్ని ప్రేమించేట్లు పరిస్థితులు కల్పించడం అభాండమా? అలా చూస్తారేం..చెప్పండి"

"అభాండాలు కాదు..పిచ్చి ప్రేలాపన. ఎదుటివారిమీద రాళ్ళు విసిరేముందు కాస్త మంచీ మర్యాదా ఆలోచించాలి. ఇష్టంవచ్చినట్లు వాగటం మంచిపని అన్పించుకోదు"

"అక్కడికి మీ పనులు అన్పించుకుంటున్నట్టూ! సరేలే... అతగాడితోనే వూరేగండి. రేపు పెళ్ళిలో మీ అల్లుడు ఫారన్ రిటర్న్డా కలెక్టరా, అనడిగితే మా కింద పనిచేసే గుమస్తా అని గొప్పగా చెబుదురుగాని" నిరసనగా అంది.

"అందుకేనే పిచ్చిదానా! దేవీ ఫిలింస్‌ని విస్తరింపజేస్తున్నాం. పెళ్ళయ్యేవరకూ మేనేజర్. తర్వాత మేనేజింగ్ పార్టనర్"

"హు...అయితే పెద్ద ప్లానుమీదే వున్నారన్నమాట. నాకు తెలీకుండానే నా కూతురి పెళ్ళి నిశ్చయం చేసేశారన్నమాట"

"నేను చెయ్యలేదు. శ్రీయే చేసుకుంది. దాని మనసు గురించి కొంచెమైనా తెలిసుంటే నువ్వామాట అనవ్"

"మనసుల్ని బాగా చదువుతారే మీరూ. నాకు తెలీనేలేదిన్నేళ్లు కాపురం చేసినా. అయితే ఆ కుర్రాణ్ని శ్రీకిచ్చి పెళ్ళి చేద్దామనుకోవడం తప్ప ఇంకే కారణాలూ, ఇంకెవరి ప్రోత్సాహం, బెదిరింపూ ఏం లేవంటారు"

"నాన్సెన్స్. ఏవిటి నువ్వు మాట్లాడుతోంది? అసలు నీ కడుపులో ఏముందో కక్కెయ్యరాదూ"

"నాకు తెలీదనేరదా మీ ప్రేమా. అలాగే కక్కేస్తానండి. మీకూ ఆ కుర్రాడి తల్లికీ ఇదివరకున్న సంబంధం మాకు తెలీదనుకుంటున్నారు కదూ?"

"ఛీ...పాపిష్టిదానా! ఏవెఛపకాశాడు నీ దగ్గరంత అసహ్యంగా. ఒక స్నేహితుడి భార్య గురించంత నీచంగా మాట్లాడతావా? నేనో తిరుగుబోతుననుకున్నావా? ఛా...నీ మొహం చూట్టానికే అసహ్యమేస్తోంది"

ఎన్నడూ ఎటువంటి పరిస్థితిలోనూ కంట నీరు పెట్టి ఎరుగని ఆయన కళ్ళల్లో

నీళ్లు గిర్రున తిరిగేసరికామె చలించి పోయింది. తను అపార్థం చేసుకుని అభాండం వేస్తున్నానేమోనని మధన పడింది.

ఆయన కిటికీ దగ్గరికి వెళ్ళి బయటికి చూస్తూ గంభీరంగా అన్నారు-

"నీకు తెలీదు మీనాక్షీ! రాంబాబూ, నేనూ మంచి స్నేహితులం. అంచేత కలిసి బిజినెస్ ప్రారంభించాం. అందులో నా పెట్టుబడికన్నా వాడి పెట్టుబడి రెట్టింపు వుండేది. అయినా లాభాలు సమానంగా పంచేవాడు. అంతటి గొప్ప వాడు రాంబాబు. వాడివల్లే నేనెన్నో వ్యాపారసూత్రాలూ లావాదేవీలూ తెలుసుకో గలిగాను. తరచూ కాకపోయినా అప్పుడప్పుడూ ఏవోపనిమీదవాళ్ళింటికెళ్తూండే వాణ్ని. రాంబాబు భార్య ఎంతో ఆదరంగా ఆప్యాయంగా చూసేది. స్వంత మరిదిలానే చూసేది. నేనూ వాళ్ళని అన్నా వదినలుగానే భావించేవాణ్ని. వాళ్ళ ఆదర్శ దాంపత్యం చూసి మురిసి పోయేవాణ్ని.

మా వ్యాపారం వృద్ధదశలో వున్నప్పుడు రాంబాబు లారీ యాక్సిడెంట్లో మరణించాడు. అప్పటికి వాడి భార్య నిండు గర్భవతి!

మా బిజినెస్‌లో పోటీదార్లు దాన్ని అదనుగా తీసుకుని ఎన్నెన్నో పుకార్లు పుట్టించారు. తల్లిలాంటి వదినకీ నాకూ సంబంధం వుందనీ, ఆమెనీ-వ్యాపారాన్నీ కైవసం చేసుకోడానికి నేను యాక్సిడెంట్ చేయించాననీను. వదినకి మొఖం చూపించ లేక వ్యాపారాన్ని మూసేస్తున్నాననీ, వారి వాటా సొమ్ము పంపిస్తాననీ కబురు పంపాను. ఆమె ఏమన్నదో తెలుసా?

'కాకుల కూతలకి భయపడి పారిపోవడం పిరికి లక్షణం. ఎదుటపడి ఢీ కొనలేని అసమర్థుడూ, పిరికివాడూ చేసే ఆఖరిపని పుకార్లు పుట్టించడం. అంచేత వాటిగురించి మీరేమీ పట్టించుకోకండి. మన మెలాటివారమో మనకితెలుసు. స్వర్గంలో వున్న ఆయనకి తెలుసు. నా కడుపులోని బిడ్డకి కూడా తెలుసు. ఇక నేనిక్కడుండి వ్యాపారం చూడలేనుకదా. ఆయన మిమ్మల్ని స్వంత తమ్ముడిగానే భావించారుగనుక వ్యాపారంలోని సగం వాటా మీరు తీసుకుని మిగిలిన సగం నాకివ్వండి చాలు. మీ వ్యాపారాన్ని మరింత వృద్ధిలోకి తీసుకొస్తే ఆయన ఆత్మ ఎంతో సంతోషిస్తుంది. ఆ తృప్తి ఆయనకి కలిగిస్తారని నాకు తెలుసు!

వారి పెట్టుబడి ప్రకారం మూడింట రెండు వంతులామెను తీసుకోమని బతిమాలినా, ఆమె పుట్టింటివాళ్లు హెచ్చరించినా ఆమె రెండోమాట చెప్పలేదు. సగం వాటా సొమ్ము తీసుకుని పుట్టింటికెళ్ళి పోయింది. వాళ్ళా సొమ్ముని తినేస్తున్నారని తెలిసెంతో బాధపడటంతప్ప ఏమీ చెయ్యలేకపోయాను. ఒకరి సహాయ సానుభూతులు ఆశించే మనిషికాదు వదిన.

తర్వాత నేను మీ నాన్న దృష్టిలో పడటం, మన పెళ్ళి జరగటం, ఈ వూరొచ్చి స్థిరపడటం, అనేక వ్యాపారాల్లో తలమున్కలవడం, శ్రీ పుట్టడం, కాల చక్రం గిర్రున తిరగటం అన్నీ చకచకా జరిగిపోయాయ్.

సుధాకర్ మొదటిసారిగా మనింటి కొచ్చినప్పుడు వాణ్ని చూసెంత సంతోషించానో వాళ్ల దుస్థితి అర్థంచేసుకుని అంతా విచారించాను. నా అన్న కొడుకు నా దగ్గర, నా కింద పనిచెయ్యడం




నాకిష్టంలేదు. డబ్బిచ్చి స్వంత వ్యాపారం పెట్టుకోమందామనుకున్నాను. కాని కిట్టనివాళ్ళేదో చెబితే నన్నుమానిస్తాడేమో అది తెలిస్తే వదిన రంపపు కోతననుభవిస్తుందేమోనని వూరుకుండిపోయాను. ఎంత ఇష్టంలేకపోయినా శ్రీ మాట కాదనలేక మరోమార్గాంతరమూ కన్పించక అసిస్టెంట్ మేనేజర్‌ని చేశాను. అతడూ, శ్రీ దగ్గరవుతారని కలలో కూడా అనుకోలేదు. అయ్యారని తెలిసెంతో సంతోషించాను. ఈ రకంగానైనా అన్నావదినెల ఋణం తీర్చుకోవచ్చూ, అన్నయ్య ఆత్మ ఎంతో సంతోషిస్తుందీ అని ఆశించాను. అంతే తప్ప నువ్వనుమానిస్తున్నట్టు మామధ్య నీచ సంబంధం లేదు"

కన్నీళ్లు నీలకంఠరావుగారి చెక్కిళ్ళ మీంచి ధారలుగా కారుతున్నాయ్.

తనూ ఏడ్చేస్తూవచ్చి ఆయన గుండెల మీద వాలి బావురుమందావిడ "అంజనేయులు చెబితే నిజమేననీ..."

"స్వార్థంకోసం మనిషి ఎంతగా దిగజారతాడో చెప్పడానికి ప్రత్యక్ష వుదాహరణ ఆంజనేయులు. ఇక ఆయన చెప్పిన కట్టుకథ నమ్మడం గురించంటావా ఇదివరకు మహామహావాళ్ళే నమ్మారు. ఆడదానివి... నువ్వు నమ్మడంలో వింతేముంది"

"ఆయనేదేదో చెబితే నిజమే అనుకున్నానుతప్ప ఇంకేమీ ఆలోచించలేకపోయాను"

"నమ్మేట్లు చెప్పడం వాళ్ళ ప్రత్యేకత. వాళ్లు చెప్పిన ధోరణిలో తప్ప మరో కోణంనుంచి ఆలోచించలేకపోవడం మన బలహీనత"

"అవునండీ... లేకపోతే అన్నేళ్ళు కాపురం చేశాక ఈ వయసులో



మిమ్మల్నను మానించడం..."

"ఇంకది మర్చిపో మీనాక్షీ"

* * *

''రా అన్నయ్యారా... అమ్మా అన్నయ్యొచ్చాడే'' సుధాకర్ ని ఆహ్వానిస్తూ అంది ప్రభ.

"ఏమే ప్రభా... సిగ్గుపడుతున్నావ్ ఏంకథా?"

''ఇవాళ మా అన్నయ్య మొఖం మతాబాలా వెలిగిపోతోందేవిటా అని"

"పెళ్ళికళే" నవ్వేరు అప్పుడే లోపల్నుంచొచ్చిన అన్నపూర్ణమ్మగారు.

''పెళ్ళికళ ప్రభకా?''

"కాదు... నీకే అన్నయ్యా"

"వాడికీకాదు..నీకూకాదు ఇద్దరికీనూ"

''వదినగారిదేవూరూ, ఎలా వుంటుందీ, ఏం చదివిందీ. అన్నీ రకీరకీమనిచెప్పమ్మా! పాపం అన్నయ్య వింటాడు" ప్రభ అంది జాలిపడ్తున్నట్టు చూస్తూ.

''ముందు బావగారి గురించి చెప్పు పెద్దమ్మా.... బావగారెలా వుంటారూ? పొడుగా పొట్టా, ఎరుపా నలుపా వుద్యోగా విద్యార్థా....

"కొంచెం ఆగరా! ప్రభా... పొయ్యి మీద టీపెట్టేను పట్రా అన్నయ్యకి. మద్రాసునుంచెప్పుడొచ్చావురా సుధా?"

"నిన్ననే వచ్చాను పెద్దమ్మా! వెంటనే వద్దామనుకున్నాను గాని వీలుపళ్ళేదు"

''రాజారావుగారు నిన్ను అల్లుణ్ణి చేసుకోవాలని మా ఇంటిచుట్టూ ప్రదక్షిణలు చేస్తున్నారనుకో.నువ్వు వూ అంటే మిగతా విషయాలు మాట్లాడతానంటున్నారు మీ పెదనాన్న"

పచ్చివెలక్కాయ గొంతుకడ్డం పడ్డట్టయ్యింది సుధకి.



"అబ్బే... మీ కా ప్ర శ మెం దు కు లే పెద్దమ్మా!ఇంకేం సంబంధాలు చూడొద్దు" ఇబ్బందిపడుతూ అన్నాడు.

''అవేం మాటప్రా!" బుగ్గలు నొక్కుకున్నారావిడ.

"దానర్థం అన్నయ్యే వదిన్ని సెలక్ట్ చేసేసుకున్నాడన్నమాట" టీకప్పు అందిస్తూ అంది ప్రభ.

ముసిముసిగా నవ్వాడు.

''అన్నయ్య వాలకంచూసి నేను ముందే కనిపెట్టేశానమ్మా"

"ఏవూర్రా ఆ అమ్మాయిదీ?"

"అదంతా సస్పెన్స్ పెద్దమ్మా! పూర్తి వివరాలకోసం ఒక్క నెలరోజులు ఓపిక పట్టాలి''

"అన్నయ్యా... అన్నయ్యా! నా చెవిలో చెప్పవూ... నేనెవ్వరికీ చెప్పను" అంది ప్రభ అతడి పక్కన చేరి.

"చెబుతాను గాని డాబాపైకి పద ... చాలామాట్లాడాలి. ఇప్పుడే వస్తాం పెద్దమ్మా" చెల్లెల్ని చెవి పట్టుకుని డాబామీదకి తీసుకెళ్ళాడు.

"చెప్పన్నయ్యా"

"సస్పెన్స్ అన్నానుగా''

''పూర్తిగా చెప్పొద్దన్నయ్యా! అమ్మాయి వూరూ పేరూ చెప్పు...చాలు"

"వట్టి పేరు చెప్పినా నీకు తెలిసిపోతుంది'' నవ్వేడు.

"అయితే నాకు తెలిసిన అమ్మాయే నన్నమాట. ఎవరబ్బా?"

"చెప్పుకో చూద్దాం...?"

రెండు నిమిషాలాలోచించి "తెలిసిపోయిందన్నయ్యా" అంది.

"అయితే చెప్పు చూద్దాం"

"శ్రీదేవి... అవునా?"

అవునన్నట్లు కనురెప్పలార్పి చెప్పి ''నీకెలా తెలిసింది ప్రభా?" అన్నాడు.

ప్రభ ఏమీ మాట్లాడలేదు. తల దించుకుంది.

ఆమె ముఖం పాలిపోయి వుండటం చూసి క్రమాన్పడిపోయాడు సుధాకర్.

"అదేవిటి ప్రభా... అలా అయిపోయావ్?"

"బాగానేవున్నానే" నవ్వ ప్రయత్నిస్తూ అంది.

"నటించడం నీకు రాదుగాని సంగతేమిటో చెప్పు"

"ఏవిటంటే...మరేమో ... అదే శ్రీదేవికీ, మురళి అనే కుర్రాడికీ ఏదో సంబంధం వుందనీ, ప్రేమించుకుంటున్నారనీ..."

"ప్రభా !" అరిచాడు. "ఏవిటి నువ్వంటున్నది?"

"నిజమే అన్నయ్యా! కాలేజిలో అంతా ఒకటే గోలగావుంది. గోడల్నిండా ఎవరో వాళ్ళ గురించే రాశారు కూడా"

"నేన్నమ్మను" దృఢంగా అన్నాడు.

"నాకూ నమ్మకం కలగటంలేదుగాని అంతా ఇదిగాచెప్పుకుంటున్నారన్నయ్యా! పైగా బయాలజికల్ టూర్‌కెళ్ళడానికి అతడికి డబ్బు ఆమే కట్టిందిట. నిన్న ఇద్దరూ కార్లో కాలేజికి రావడం అంతా చూశార్ట"

"అయ్‌సీ. ఇప్పుడే వెళ్ళి సంగతేవిటో మొఖాన్నే అడిగేస్తాను"

"ఇప్పుడు శ్రీదేవి లేదన్నయ్యా"

"నీకెలా తెలుసు?"

"ఇవాళ పొద్దుటే వాళ్ళంతా బయాలజికల్ టూర్ కెళ్ళేరుగా"

నిన్న సాయంత్రం తనతో ఎంతో సరదాగా గడిపి, ప్రేమిస్తున్నానని కూడా చెప్పిన శ్రీదేవి, ఇవాళ టూర్‌కెళుతున్నాననీ, కొన్నాళ్ళవరకూ రాననీ ఎందుకు చెప్పలేదు? అనవసరమనుకుందా లేక చెప్పకూడదనే మానేసిందా?

దగ్గరికొచ్చినట్టే వచ్చి దూరమవుతూ అర్థమైనట్లే అయ్యీ అర్థంకానట్లు ప్రవర్తిస్తూ వుండే శ్రీదేవి గురించేమనుకోవాలి?

"మాట్లాడవేం అన్నయ్యా?"

"కొంచెం పనుందమ్మా....మళ్లీ వస్తానుగా" చకచకా మెట్లు దిగి వెళ్లిపోయాడు సుధాకర్.




నలుగురు కుర్రాళ్లు కలిస్తేచాలు వాళ్ల చేసే అల్లరికి ఎల్లలుండవు. అదే ఓ యాభైమంది విద్యార్థినీ విద్యార్థులు పదిహేను రోజుల టూర్ సందర్భంగా కలిస్తే వాళ్లచేసే అల్లరికీ, పొందే ఆనందానికీ హద్దేముంటుంది?

బయాలజికల్ టూర్‌కి బయల్దేరిన విద్యార్థులు రైలు కంపార్టుమెంటుని పూర్తిగా ఆక్రమించేశారు. ఆ కంపార్ట్ మెంట్లోకి ఇతరులెవ్వర్నీ ఎక్కనీకుండా కొందరు గుమ్మాల దగ్గర నిలబడి ఖాళీ లేదంటూ వెనక్కి తిప్పేస్తున్నారు. ఆడా మగా, లెక్చరరూ స్టూడెంటూ అన్న భేదం మరిచి అంతా ఏక కుటుంబసభ్యుల్లా కలిసిపోయారు.

కొందరు పేకాట, కొందరు కబుర్లు, కొందరు గానాబజానా, కొందరు నిద్ర, అతికొద్దిమంది పుస్తక పఠనం.. ఏమైతేనేం

కోలాహలం ఎల్లెడలా పరుచుకుంది.

మురళి చాలా బుద్ధిమంతుళ్ళా చివర సున్న బెర్త్ పైకెక్కి పుస్తకం తీశాడో లేదో, శ్రీదేవి వచ్చి పుస్తకం లాగేసి "కమాన్ మేన్" అంటూ మధ్యలోకి లాక్కొచ్చింది. ఆమె సెంటరాఫ్ ఎట్రాక్షనే కాదు అల్లరికి కేంద్రం కూడా అవడంతో చాలామంది మగాళ్ళు ఆమె చుట్టూ చేరేరు– ఇలాగైనా ఆమెతో సరదాగా మాట్లాడి, సరదాగా గడిపి తృప్తిపడదామని. ఇక ఆడవాళ్ళు ఇష్టమున్నా లేకున్నా ఆమె దగ్గరే కూర్చున్నారు. శ్రీని మంచి చేసుకుంటే తమకి చాలా 'ఫ్రీ'లు దొరుకు తాయని వాళ్లకి బాగా తెలుసు!

శ్రీ చిన్నపిల్లలా కేరింతలు కొట్టింది. జోకులేసి ఏడిపించింది. పాటలు పాడు తోంటే గేలిచేసింది. అయినా ఎవరూ సీరియస్‌గా తీసుకోకుండా టైమ్‌ని ఎంజాయ్ చెయ్యసాగారు.

ఇలా నలుగుర్తో కలిసి అల్లరిచెయ్యడం, ఆనందించడం మురళికి పూర్తిగా కొత్త. మొదట్లో వారితో కలవడానికి చాలా మొఖమాటపడ్డాడు. మనసులో లేడి పిల్లలా గంతులెయ్యాలనివున్నా ఏదో తెలీని సంకోచం అతడి కాళ్లకి బంధం వేసింది.

కాని శ్రీదేవి అతణ్ని ఒంటరిగా వదల్లేదు. అతడి బిడియం పోగొట్టేవరకూ వూరుకోనూలేదు. తనామెను ప్రేమి స్తున్నానని చెప్పినందువల్లనే ఆమె ఇంత సంతోషంగా వుందని భావించిన మురళికి చెప్పలేనంత వుత్సాహం వచ్చింది. ఇన్నాళ్ళు మౌనిలా కూర్చున్నదితడేనా అని అంతా ఆశ్చర్యపడేలా ప్రవర్తించ సాగాడు.

ఏ వయసు సరదా ఆ వయసులో తీరితేనే ముచ్చట. సెలయేటిలా పొంగి పొరలే కోడెవయసులో అల్లరి అందమూ ఆనందమూనూ. తర్వాత బాధ్యతల బరువులు పైబడ్డాక అలా ప్రవర్తించాలన్నా ప్రవర్తించలేరు. ఒకవేళ ప్రవర్తించినా అందులో ఆనందముంటుందేమోగాని అందం, ఆకర్షణ వుండవు.

బృందమంతా మొదట కొడైకెనాల్ చేరుకుని లాడ్జిలో బసచేశారు.

వణికించే చలి. కన్నుల పండుగ చేసే ప్రకృతి. వెచ్చని కోరికలు రేపే గాలి. తీయని వూహల్లో తేలియాడించే వాతా వరణం.

పొద్దుటే లేచి వేడినీళ్ళ స్నానంచేసి, కాఫీ గొంతులో పోసుకుని బ్యాగూ, ప్లేట్లూ క తెర్లూ తీసుకుని ప్లాంట్ కలెక్షన్ కోసం జట్లు జట్లుగా బయల్దేరేవాళ్లు.

శ్రీదేవీ మురళీ మొదట జట్టుతో కలిసి బయల్దేరినా కొద్దిసేపటికే వాళ్లనుంచి విడిపోయి మరోవైపు మరలేవారు. శ్రీదేవి ప్లాంట్‌ని కలెక్ట్ చేసేదికాదు. ఇద్దరి తరఫునా మురళే సేకరించేవాడు. సేకరిస్తూ ఆయా మొక్కల కుటుంబాల గురించీ, సైంటిఫిక్ నేమ్స్ గురించీ, ప్రత్యేక లక్షణాల గురించీ ఏకరువు పెట్టేవాడు. ఆ ధోరణి శ్రీకి తలపోటు తెప్పించేది. ఆమెక్కావల్సింది చదువు కాదు...వినోదం. కాలక్షేపం. ప్రస్తుతం అతణ్ని లోబరుచుకోవడం కూడా.

అందుకే అతణ్ని తనవైపు తిప్పుకో డానికి ప్రేమ డైలాగులు చెప్పేది. కళ్ల ముందు రంగుల కలల్ని గుమ్మరించేది. అతడి బుర్రనిండా తీయని వూహల్నీ, సుందర భవిష్యత్తు తాలూకు దృశ్యాల్నీ నింపేది. నవ్వించేది. కవ్వించేది. అతడు కరిగిపోతూంటే వినోదించేది. గర్వంగా నవ్వుకునేది.

మెల్లగా మురళి దృష్టి ప్లాంట్ కలెక్షన్‌మీంచి ఆమె మీదకి మరలింది. ఆమె అద్భుతరూపం, మిరుమిట్లు గొలిపే అందం, స్వర్గసుఖాల్నందిచ్చే ఐశ్వర్యం, అమృతంలాంటి ఆమె ప్రేమ అతణ్ని ముగ్ధుణ్ని చేశాయ్. మైమరిపించాయ్. మతి పోగొట్టాయ్.

ఇప్పుడతడికి ఆమె తర్వాతనే మిగిలిన వన్నీను!

తర్వాత మద్రాసు వచ్చారు.

టూరిస్ట్ బస్సులో రెండ్రోజులుపాటు చూడాల్సిన ప్రదేశాలన్నీ చూశారు.

మూడోరోజు ఆటవిడుపు అన్నారు.

కొందరు సినిమా తారల ఇళ్లకీ, కొందరుస్టూడియోలకీ,కొందరు షాపింగ్‌కీ, కొందరు సినిమాలకీ కొందరు బంధువుల ఇళ్లకీ, కొందరు నగరం చుట్టిరావడానికీ ఎగిరిపోయారు.

శ్రీదేవి మురళిని తీసుకుని హోటల్‌కి వెళ్లి రుచికరమైన టిఫిన్స్ పెట్టించింది. 70 యం. యం. ఇంగ్లీషు సినిమా చూపించింది. మరచిపోలేని భోజనం తిని పించింది. విలువైన బహూమతులు కొనిపెట్టింది. చివరికి మెరీనాబీచ్‌కి లాక్కొచ్చింది.

"ఓహ్... ఎంత జనం! ఎంత గొప్పగా లవ్లీగా థ్రిల్లింగ్‌గా వుంది!" సంధ్యా సమయంలోని బీచ్ సౌందర్యానికి ముగ్ధుడవుతూ అన్నాడు మురళి.

"ఇవాల్టి ప్రోగ్రామ్ ఎలా వుంది?"

"నేనీ టూర్‌కి నీతో బాటు వచ్చి వుండకపోతే జీవితంలోని ఎన్నెన్నో మధురానుభవాల్నీ, అనుభూతుల్నీ కోల్పోయేవాణ్ని దేవీ.అందుకు నీకెప్పుడూ కృతజ్ఞుణ్నే. ఇన్నాళ్ళూ అందర్లో వుంటూ ఏకాంతాన్ననుభవించాం. ఇవాళ నిజమైన ఏకాంతాన్ని చవిచూశాం. నీతో కలసి తింటోంటే తిరుగుతోంటే మన భవిష్యత్తు తాలూకు ఎన్నెన్నో సుందర దృశ్యాలు కళ్ళముందు కదలి కనువిందు చేస్తున్నాయ్. నీ ప్రేమభిక్షకి నిజంగా ఎన్ని జన్మలెత్తినా రుణం తీర్చుకోలేను దేవీ"

"వూఁ... అబ్బాయిగారు డైలాగులు బాగానే చెబుతున్నారు. ఈ కబుర్లు ఎన్నాళ్ళో"

"డైలాగులు కాదు దేవీ, నా హృదయం నుంచి దూసుకొచ్చిన ముక్కలు"

"బావుందిగానీ ఈ బీచ్‌లో ఇలా విహరిస్తోంటే ఏమనిపిస్తోంది?"

"ఈ ఒడ్డున కూర్చుని ఒకరి కళ్ళల్లోకి ఒకరం చూసుకుంటూ జీవితమంతా గడిపెయ్యాలని"

అనంతరం విద్యార్థి బృందం రామేశ్వరం వెళ్ళింది.

గుళ్ళూ గోపురాలూ చూసి సముద్రపు వారన తిరిగి ఆల్చిప్పలూ, శంఖాలూ ఇతర చిన్న చిన్న సముద్రజీవుల్నీ సేకరించారు.

ఒకచోట ఒకతను రకరకాల శంఖాలని ఎదుట పెట్టుకుని అమ్ముతున్నాడు. ప్రత్యేకతేమిటంటే కొన్న వాళ్ళు రాసిచ్చిన పేర్లని వాటిమీద రంగుల్తో రాసిస్తున్నాడు. కొన్నిటిమీద బొమ్మలు కూడా వేసిస్తున్నాడు.

ఆ రాత్రే తిరుగు ప్రయాణమవబో తున్నారు కనుక సూర్యాస్తమయాన్ని చూస్తూ సముద్రపుటొడ్డున గుంపులు గుంపులుగా షికార్లు చెయ్యసాగారంతా.

యధాప్రకారం మురళీ శ్రీదేవీ మరో వైపు వెళ్లి కూర్చున్నారు.

కాస్సేపలా కూర్చున్నాక శ్రీదేవి ఇసుకలో కల తిరగసాగింది.

"అమ్మా!" అంది శ్రీదేవి

అకస్మాత్తుగా.

ఏమయ్యిందంటూ పరుగెత్తుకుని వచ్చాడు అతడు.

"అమ్మో... ముల్లు"

ఆమె కాలు తన ఒడిలో పెట్టుకుని జాగ్రత్తగా ముల్లు తీశాడు.

రక్తం చిమ్మింది.

అతడి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయ్.

"ఏయ్... అదేమిటి?"

"పిచ్చి పని"

"నిజంగా పిచ్చోడివే. ఆ ఏడుపు ఎందుకూ?"

"నీకు చిన్న దెబ్బ తగిలినా నా మనస్సు విలవిల్లాడిపోతుంది. ఇక నీ రక్తం కంటబడితే భరించగలనా" బేలగా అన్నాడు.

ఆమె పులిక్కిపడింది.

ఆమె కంట్లో సన్నటి కన్నీటి పొర కదిలింది.

బాధగా జాలిగా చూసిందొక్క క్షణం. అంతలోనే తేరుకుని "సిల్లీ" అంది.

"నీకు సిల్లీగా అన్పించొచ్చు. సెంటిమెంట్‌గా కన్పించొచ్చు. కాని నా బాధనాది. నా పిచ్చి నాది"

"సరేలే... ఇక వెళ్దామా?"

"ఒక్క క్షణం...నువ్వు నాకు చాలా చాలా బహుమతులిచ్చావు. కాని నేనేమీ ఇవ్వలేకపోయాను. నీకివ్వగలిగేంతవాడు కాదు పేద భక్తుడు..."

"అలా మాట్లాడొద్దన్నానా?" సరదాగా కోప్పడింది.

"ఇంక మాట్లాడనుగానీ నా ఈ చిరు కానుక స్వీకరించు" శంఖం అందిచ్చాడు మురళి.



దానిమీద "ప్రేమమూర్తీ...ఇది నా హృదయమ్ము. గైకొనుము-మురళి" అని రాసి వుంది.

అది చదివి గబుక్కున దాన్ని ముద్దుపెట్టుకుంది.

పరమానందపడిపోయాడతడు.

వాళ్ళిద్దరూ కలిసి రావడం రమ చూసింది. ఇవాళేకాదు.. టూర్ మొదలైనప్పట్నుంచీ వాళ్ళిద్దరి మధ్యా పెరుగుతోన్న సాన్నిహిత్యాన్ని ఆమె గమనిస్తూనే వుంది. శ్రీదేవి ప్రవర్తనని బట్టి చూస్తోంటే ఆమె మురళిని నిజంగా ప్రేమిస్తున్నట్టే వుంది. అదే నిజమైతే ఇదివరకామె ప్రేమిస్తున్నానని చెప్పినతని సంగతేమిటో అర్థం కాలేదు. ఆమె ప్రవర్తనలోని ఆంతర్యం ఏమిటో, దాని పర్యవసానం ఏమిటో బొత్తిగా బోధపడకుండా వుందామెకి.

* * *

సుబ్బరామయ్యగారు, సుధాకర్ బస్సు దిగి కంకరోడ్డుమీద రెండు ఫర్లాంగుల దూరం నడిచి ఊరు చేరుకున్నారు.

కనకయ్యగారి ఇల్లెక్కడో కనుక్కుని వెళ్ళారు.

వారిది పూర్వకాలపు మండువాలోగిలిలోని ఓ పక్కభాగం. కాస్త శిథిలావస్థలో వుంది. ఇల్లూ, ఇంటిలోని సామాగ్రి,పరిసరాలూ, పిల్లలూ, వారి దుస్తులూ-అన్నీ కలిసి కనకయ్యగారో సామాన్య రైతు అని అర్థమైపోయింది వారికి.

కనకయ్యగారు వారిని సాదరంగా ఆహ్వానించి, చేతుల్లేని పాతకాలపు కుర్చీల్ని తెచ్చి వేశారు.

కాళ్ళూ చేతులూ కడుక్కునొచ్చి వారబ్బాయి అందిచ్చిన ఖద్దరు తుండుతో చేతులు తుడుచుకుని చుట్టూ పరిశీలనగా

చూస్తూ కుర్చీల్లో కూర్చున్నారు.

ఆయన మంచినీళ్ళ గ్లాసులందిచ్చారు.

అనంతరం "మనదేవూరో చెప్పలేదు'' అన్నారు కనకయ్యగారు.

ఊరి గురించీ సుబ్బరామయ్యగారి గురించీ చెప్పి ''మీ సంబంధం అందుకోవాలని వచ్చామండి" అన్నాడు సుధాకర్.

ఆయనా విషయం ముందే గ్రహించారు. ఆయనకన్నా ముందు ఇంట్లోని ఆడవాళ్లు గ్రహించి పక్కింటినుంచి గోధుమరవ్వ తెచ్చి జల్లిస్తూ ఉప్మా చెయ్యడానికి అన్నీ సిద్ధం చేసుకుంటున్నారు.

''మా మురళి గురించా. వాడింకా చదువుకుంటూనే వున్నాడు కదండీ"

"ఆ సంగతీ తెలిసింది. ఎలాగూ ఈ సంవత్సరంతో చదువైపోతుంది కదండీ. అన్నీ అనుకూలిస్తే పరీక్షలైపోయాకే ముహూర్తాలు పెట్టుకోవచ్చు''

తలుపి లోపలికెళ్ళి ''ఇంకా కాలేదా?" అనడిగారు.

''ఉప్మా చేస్తున్నామండి. టీ కాయటానికి టీ పొడి లేదు. కాఫీ కాసెయ్యమన్నారా?" ఆయన భార్య అడిగింది.

''లేదు లేదు అన్న మాట తప్ప ఇంకో మాటరాదా నీకు. ఎంత తెచ్చి పడేసినా లేదనేగాని వుందనరుకదా ఒక్కరోజూ'' గొంతు తగ్గించి విసుక్కున్నారు.

"వీశెలు వీశెలు మీరు తెస్తోంటే రాత్రుళ్లు నేను బుక్కుతున్నానండి''

"చాల్లే...ఏదో వున్నంతలో మర్యాద దక్కించండి''

''అలాగేలెండి. ఇంతకీ వాళ్లదేవూర్టి? అమ్మాయి ఏం చదివిందిట? ఏమాత్రం ఇస్తామంటున్నారు?''

''ఇంకా అడగలేదే. ఒక్కొక్కటీ కనుక్కుంటున్నాను"

"తొందరపడి నోరు జారకండి. అవతల పెళ్ళికెదిగిన పిల్ల వుంది"

"అవన్నీ గుర్తున్నాయి లేవే"

"ఏమో... కొడుక్కి పెళ్లివారొచ్చారన్న సంబరంలో అన్నీ మర్చిపోతారేమోనని" నవ్వేరావిడ.

''నాకన్నా నీకెక్కువ సంబరంగా వున్నట్టుంది'' అంటూ గదిలోకొచ్చారు.

''వుద్యోగం వచ్చేక పెళ్లిచేస్తే బావుంటుందంటున్నారు ఆడవాళ్ళు. ఈరోజుల్లో వుద్యోగాలు రావడం చాలా కష్టంగావుంది కదండీ" అన్నారు కనకయ్యగారు.

''వుద్యోగం గురించి మీరేం ఇదవ్వొద్దు. మేమూ ప్రయత్నంచేస్తాం. వీడు నీలకంఠరావుగారి సినిమా కంపెనీ మేనేజరు. అందాకా అందులో వేసుకుంటాడు'' అన్నారు సుబ్బరామయ్యగారు.

''మా కంపెనీలోకి చాలామంది కావాలెండి. నీలకంఠరావుగార్తో చెప్పిమీవాడికి వుద్యోగం ఇప్పిసాం. ఇంతకంటే మంచిది రాగానే ఇది వదిలిపెట్టెయ్యొచ్చు'

సుధాకర్ మాటలకాయన కాస్త మెత్తబడ్డాడు. 'ఉద్యోగం ఇప్పించుకుంటానంటే అంతకంటే ఏంకావాలీ. సగం బరువు దింపుకున్నట్టే కదా!' అనుకున్నారు.

కనకయ్యగారి రెండో అబ్బాయి రెండు ప్లేట్లలో ఉప్మా పట్టుకొచ్చాడు.

"తీసుకోండి... మాట్లాడదాం"

ఫలహారఘట్టం ముగిశాక ''ఇచ్చిపుచ్చుకోవటాల గురించో మాటనుకుంటే బావుంటుంది" అన్నాడు సుధాకర్.

"ఇందులో దాపరికంఏవుందిచెప్పండి.

మాకున్నది నాలుగెకరాల కొండ్ర. పంట తిండికే సరిగ్గా చాలదు. మావాడు కాస్త అందివస్తే కష్టాలు తీరతాయని కళ్ళన్నీ వాడిమీద పెట్టుకుని చూస్తున్నాం. వాడి తర్వాతి అమ్మాయి పెళ్ళికెదిగింది. వాడి కొచ్చే కట్నంతో దాని పెళ్ళిచెయ్యాలని వుంది. వాళ్ళిద్దరూగాక ఇంకో ఆడపిల్లా, మగపిల్లాడూ వున్నారు. అదండీ సంగతి. పెద్దవాడికొచ్చిన కట్నకానుకల్ని బట్టే మిగతావాళ్ళకి వస్తాయన్నది మీకు తెలీందికాదు"

అయనంత ఫ్రాంక్‌గా చెప్పడం సుధాకర్‌కి చాలా మంచి అభిప్రాయం కలిగించిందాయనమీద. పెదనాన్న సైగ చూసి అన్నాడు-"మా పెదనాన్నకి ఒక అబ్బాయీ, ఒకమ్మాయీనండి. అంచేత అమ్మాయికి ఎకరంపొలం అయిదువేలు కేషూ ఇద్దామనుకుంటున్నారు. ఇతర లాంఛనాలన్నీ బాగా జరుపుతారు. ఉద్యోగంవేయించే బాధ్యతకూడా మాదే"

"అహా...ఆమధ్య మా బావమర్ది ఓ సంబంధం తెచ్చేడు. వాళ్ళు పొలంగాక పదివేలవరకూ ఇస్తానన్నారు. ఇప్పుడే పెళ్ళిచెయ్యడం ఇష్టంలేక ఆ సంబంధం వదులుకున్నాం''

''దాండేముందిలెండి. ముందొచ్చి అమ్మాయిని చూడండి మిగతా విషయాలు తర్వాత మాట్లాడుకుందాం'' సుబ్బరామయ్యగారన్నారు - కనకయ్యగారి అభిప్రాయం గ్రహించి.

''అలాగలాగే. అబ్బాయిని చూశారను కుంటాను"

''ఇంకా లేదండి. మిమ్మల్ని కలుసుకున్నాక చూద్దామనీ....''

"అలాగా! ముందబ్బాయిని చూడండి. మీకు నచ్చితే ఏరోజున రమ్మంటారో కబురంపండి... వచ్చి చూస్తాం"

"మీ మాట ప్రకారమే కానిద్దాం. రేపే అబ్బాయిని చూసి..."

"వాడు ఎల్లుండిగానిరాడండి. కాలేజీ వాళ్ళు మద్రాసు, రామేశ్వరం ఇంకా ఎక్కడెక్కడికో తీసుకెళ్తేనూ వెళ్ళేడు. ఎల్లుండి వచ్చేస్తామని ఉత్తరం రాశాళ్ళేండి"

"సరే..ఎల్లుండే కలుసుకుని కబురంపుతాంలెండి. మీ అబ్బాయి అడ్రస్సిస్తారా!"

ఆయన చూపించిన ఉత్తరంలోంచి అడ్రస్ నోట్ చేసుకున్నాక వస్తామంటూ లేచి, కబురంపగానే అమ్మాయిని చూసుకోవడానికి తప్పకుండా రావాలని మరో సారి చెప్పి వచ్చేశారు.

కనకయ్యగారు వాళ్ళెంత చెప్పినా వినకుండా లంకరోడ్డుదాకా వచ్చి బస్సెక్కించిగాని వెనుదిరగలేదు.

"మనుషులు మంచివాళ్ళేగాని ఆ అబ్బాయికి కాస్తబరువు బాధ్యతలెక్కువను కుంటాను" బస్సు కదిలేక అన్నాడు సుధాకర్.

"ఈరోజుల్లో మధ్యతరగతి కుటుంబాల్లో అది సహజంరా. చెల్లెళ్ళపెళ్ళిళ్ళో, తమ్ముళ్ళ చదువులో, ముసలితల్లిదండ్రుల బరువో తప్పదుమరి. ఏ బాధ్యతలూ బాదరబందీ లేకుండా వుండాలంటే ఎలా కుదురుద్ది"

"మరి కట్నం సంగతి? పదివేలదాకా ఆశ వున్నట్టుంది"

"పది కాదుగాని ఎనిమిదికి ఒప్పుకుంటారనివుంది. చూద్దాం ... దానికెక్కడ రాసిపెట్టివుందో. ఈ కుర్రాడు మాత్రం చాలా బుద్ధిమంతుట్ట. క్లాస్టూడెంటట. అందుకే వృద్ధిలోకి రాకపోతాడా అని

ఆశగావుంది"

"కుర్రాడు బుద్ధిమంతుడైతే కొంచెం కట్నం ఎక్కువైనా చేసేద్దాం పెదనాన్నా! మనం కొంచెం ఇబ్బందిపడ్డా అమ్మాయి సుఖపడుతుంది"

"నా తాపత్రయమూ అదేరా"

"అయితే ఈ సంబంధం కుదిరిపోయినట్లే"

"నీ నోటి చలవన కుదిర్తే బావుణ్ణు"

"కుదిరి తీరుతుంది చూస్తూండు పెదనాన్నా. ఎల్లుండా కుర్రాణ్ని కలుసుకుని అన్నీ మాట్లాడేద్దాం. వచ్చేవారం వాళ్ళు ప్రభని చూసుకుంటారు. అవాళే తాంబూలాలు పుచ్చుకుని మేలో ముహూర్తం పెట్టించేద్దాం" వుషారుగా అన్నాడు సుధాకర్.

"కంగారు పడకు మరి" అని వూరుకున్నారు సుబ్బరామయ్యగారు.

* * *

గుప్ గుప్‌మని సిగరెట్ పొగ వదులూ ఈమధ్యే సపరేట్ చెయ్యబడ్డ దేవీ ఫిలిమ్స్ ఆఫీసులో ప్రవేశించాడు ఆంజనేయులు. అంతా పనిచేసుకుంటూండటం చూసి తల పంకించి సుధాకర్ రూమ్‌లోకెళ్ళాడు. అతడేవో ఫైల్స్‌ని చూస్తూన్నాడు.

"ఇదేవిటోయ్ సుధాకరం... నువ్వు మేనేజరువోయ్. స్టాఫ్‌చేత పనిచేయించాలి గాని నువ్వు పనిచెయ్యకూడదు" అన్నాడు.

నవ్వి వూరుకున్నాడతడు.

"విజయవాడకి ఆఫీసు ఎప్పుడు మారుస్తున్నారేవిటి?"



"బహుశా వచ్చేనెలలో అవుతుంది"

"అయితేమాత్రం మధ్యలో మనకేం ఒరుగుతుంది చెప్పు జీతం రాళ్ళు తప్ప"

"ఆ రాళ్ళకోసమేకదా మనం వుద్యోగం చేస్తోంట"

"అలా అనుకుని మడిగట్టుక్కూర్చుంటే మనం ఇలాగే వుంటాం. మన ఓనర్లు బలిసిపోతూంటారు. శ్రమ ఒకరిదీ, ఫలితం మరొకరిదీనూ"

సుధ మౌనం వహించాడు.

"నిన్ను మొదటిసారిగా చూసినప్పుడే ఈ చాకులాంటి కుర్రాణ్ని కన్న తల్లి దండ్రులు చాలా అదృష్టవంతులు సుమా అనుకున్నాను. నా కింద పనిచేసినప్పుడు చాలా బుద్ధిమంతుడనుకున్నాను. మేనేజర్ అయినప్పుడు అన్ని విధాలా అర్హుడు అనుకున్నాను. నీలకంఠరావుగారి అమ్మాయితో సన్నిహితంగా తిరుగుతోంటే ఈడూ జోడూ అనుకున్నా న్తప్ప ఇలా జరుగుతుందనుకోలేదు. రెండ్రోజుల్నుంచి నువ్వేదోలా వుంటోంటే ఏవిటో అనుకున్నా న్తప్ప దానివెనుక ఇంత కథ వుందనుకోలేదోయ్" సానుభూతి ప్రదర్శిస్తూ అన్నాడు.

"అసలిప్పుడేం జరిగిందంటావు?"

కూర్చున్నవాడల్లా గబుక్కున లేచి, "ఏవిటీ...అసలేం జరిగిందో కూడా నీకు తెలీదా?" అన్నాడు ఆంజనేయులు.

తల అడ్డంగా తిప్పాడు.

"ఖర్మ! ఇన్నాళ్ళూ ఏం చేస్తున్నావయ్యా మగడా అవతల కొంపలంటుకుపోతూంటే!"

"ఇంతకీ..."

"అక్కడికే వస్తున్నానయ్యా! అసలు నన్నడిగితే ఈ డబ్బున్నవాళ్ళని అయిదు శాతం కూడా నమ్మకూడదంటాను. వాళ్ళంత దగుల్బాజీలు లేరయ్యా లోకంలో. ఇవతల నీతో ప్రేమిస్తున్నట్టు చెబుతూనే వుంటారు అవతల మరొకణ్ని పెళ్లాడతారు. వాళ్ళాడుకునే ఆటబొమ్మల్లాంటివాళ్ళమోయ్ మనం. వాళ్ళ దృష్టిలో మన విలువ బొమ్మలకన్నా పిసంకూడా ఎక్కువుండదనుకో"

"అసలేం జరిగిందో చెబుతారా?" కాస్త కంగారుగా అన్నాడు సుధాకర్.

అది గమనించి లోలోపల నవ్వుకున్నారాయన.

"ఏం జరుగుద్దీ...మామూలు కథే. నీలకంఠరావుగారు వారమ్మాయి పెళ్ళిగ్గాను వరాన్వేషణ తీవ్రంగా చేస్తున్నారోయ్. విశాఖపట్నంలో ఏదో సంబంధం వుందని తెలిసి ఇవాళ పొద్దుటే విమానంలో చెక్కేశారు. అది కుదుర్చుకుని సాయంత్రం వచ్చేస్తారు. వచ్చే వారమో ఆ పైవారమో సీతమ్మ పెళ్ళికూతురాయెనే అంటూ పాడేస్తారు బ్యాండు వాళ్ళు. ఇక నువ్వూ, నేనూ ఇలాగే మిగిలిపోతాం"

"వారమ్మాయి తండ్రి తెచ్చిన సంబంధం ఒప్పుకున్నప్పుడుకదా" సడలుతోన్న ధైర్యాన్ని కూడగట్టుకుంటూ అన్నాడు సుధాకర్.

"నువ్వెక్కడి పిచ్చివాడివోయ్" అంటూ నవ్వి, "ఎందుకొప్పుకోదూ ... మహచక్కగా ఒప్పుకుంటుంది. ప్రేమించడానికీ, షికార్లు కొట్టడానికీ నువ్వూ నేనూ గానీ పెళ్లాడానికి కోటీశ్వరుల పిల్లలే కావాలోయ్. చూస్తూండు...రేపట్నుంచీ అన్నీ నేను చెప్పినట్టు జరక్కపోతే ఎడంచెవి కోసుకుంటాను"

"అది కాదండీ..."

"అదీ లేదు ఇదీ లేదు. జరిగేదంటే




నోయ్. ఆ అల్లుడుగారు పెత్తనం తీసుకుని మనల్ని పీకెయ్యడమో, జుట్టు కత్తిరించడమో చేసి పీలుంటే తనవాళ్ళని తెచ్చి మన నెత్తిమీద కూర్చోబెడతాడు. మనం అరవచాకిరీచేసి లాభాలు ఆర్జించి పెడుతోంటే వాళ్ళు అప్పనంగా కూర్చుని భోంచేస్తూంటారు. అంచేత నేన్చెప్పేదేవిటంటే..."

నాకు తెలుసన్నట్టు చూసి తల తిప్పేసుకున్నాడతడు.

"అలా మొఖం తిప్పకుమరి. దీపం వుండగానే ఇల్లు చక్కబెట్టుకోమని పెద్దలే చెప్పేరు. రేపా అల్లుడొస్తే మన పనేమవుతుందో మనకే తెలీదుగనుక ఈలోగానే జాగ్రత్తపడదాం. నువ్వు నాతో చేతులు కలిపావా అంటే మన పంట పండినట్టే"

''ఆంజనేయులుగారూ!''

''అరవకయ్యా! పెద్దవాణ్ని చెబుతున్నాను..విను. మనల్నెవరూ ఏం చెయ్యలేరయ్యా. పాపాలభైరవుళ్ళాంటి పాపారాయుడు మన అండన వున్నాడు''

"ఇంకేం చెప్పొద్దు. మీరు మర్యాదగా వెళ్ళిపోతే మంచిది''

''నా మాట...''

''ఒక్క మాటకూడా మాట్లాడొద్దు. వుద్యోగం పోయినాసరే ఏమైనాసరే నీతి తప్పటం, అవినీతికి పాల్పడటం నా రక్తంలోనే లేదు"

''రక్తంలో వుండదయ్యా...డబ్బులో వుంటుంది''

''ష్...వెళ్తారా ప్యూన్ని పిలవమన్నారా?''

''అంత వాడివయ్యావన్నమాట ... చూస్తాను. ఈ సీలుగెన్నాళ్ళో, ఈ వెలుగెన్నాళ్ళో అదీ చూస్తాను. ఆ శ్రీదేవి దాని బాబూ ఛీ పో అన్నరోజున నన్ను వెదుక్కుంటూ వస్తావు! ఇల్లలకగానే పండగ కాదు. గుర్తుంచుకో...రెండ్రోజుల్లో తప్పు తెలుసుకున్నావా సరే. లేకపోతే..."

''డోంటాక్ నాన్సెన్స్''

''నీలాటివాళ్ళని చాలా మందిని చూశాను. జాగ్రత్త!" విసురుగా నిష్క్రమించాడాయన.

తల పట్టుకుని కూర్చుండిపోయాడు సుధాకర్.

ఆంజనేయులుగారు చెప్పింది నిజమేనా? నీలకంఠరావుగారు శ్రీదేవికి సంబంధాలు చూస్తున్నారా? ఆమె ఒప్పుకుంటుందా? తనని ప్రేమిస్తున్నాననీ, పెళ్ళి చేసుకుంటాననీ చెప్పిన ఆమె మరొకర్తో పెళ్ళికెలా ఒప్పుకుంటుంది? మరైతే ఎవరో కాలేజీ కుర్రాడ్తో ఆమె జరుపుతున్న ప్రేమాయణం సంగతేమిటి?

కణతలు రుద్దుకున్నాడు తల పగిలిపోతున్నట్టనిపించి!




సుబ్బరామయ్యగారు అర్జంటుగా సౌరుగూరు వెళ్ళాల్సిరావడంతో, ''నువ్వెళ్ళి అబ్బాయిని చూసిరా. నీకు నచ్చితే మాకు నచ్చినట్టే" అన్చెప్పి పంపించారు సుధాకర్ని.

అతడు మురళి అడ్రస్ పట్టుకుని వెదుక్కుంటూ అతడి గదికెళ్ళాడు. అదృష్టవశాత్తూ మురళి ఇంట్లోనే వున్నాడు.

"హలో...మురళిగారంటే..."

"నేనేనండి. మీరు....?"

"నా పేరు సుధాకర్. మీతో కొంచెం పనివుండి వచ్చాను"

"రండి"

రూమ్‌లోకెళ్ళి కూర్చుంటూ "టూర్ నుంచి ఎప్పుడొచ్చారు?" అనడిగాడు.

"ఇవాళ పొద్దుటేనండి"

"ఇవాళ వస్తారని మీ నాన్నగారు చెప్పేరు. అన్నట్టు చెప్పలేదుకదూ ... మొన్న మీ వూరెళ్ళి మీ నాన్నగార్ని కలిశామండీ. మా కజిన్ సిస్టర్‌ని మీకిచ్చి చేద్దామనీ..."

"ఎక్స్‌క్యూజ్ మీ. నా పెళ్ళి నిశ్చయమై పోయిందండీ"

"వ్వాట్? మీ ఫాదర్ అలా చెప్ప లేదే!"

"వాళ్ళకీ తెలీదు లెండి"

"లవ్ ఎఫైర్?"

సిగ్గుపడుతూ తలూపాడు.

"అయ్‌సీ. మేమింకా ఏదేదో అను కున్నాం"

"సారీ ఫర్ ద ట్రబుల్"

"ఇట్స్ ఆల్ రైట్. ఆ అదృష్టవంతురా లెవరో తెలుసుకోవచ్చా?"

"నీలకంఠరావుగారు తెలుసనుకుం టాను...వారమ్మాయి"

నెత్తిమీద పిడుగుపడ్డట్టు అదిరిపడ్డాడు సుధాకర్.

"వ్వాట్? ఏమిటి మీరంటున్నది?"

"ఎందుకలా ఎక్సైట్ అవుతున్నారు. ఆమె మీకు తెలుసా?"

"మీరు చెబుతున్నది నిజమేనా?"

"గాడ్ ప్రామిస్. ఎందుకలా అడుగు తున్నారు?"

"అహ ... ఏంలేదు. ఆమె తండ్రి విశాఖపట్నం సంబంధమేదో స్థిర పరుస్తున్నట్టు ఎవరో అంటేనూ..."

"కూతురి అభిప్రాయం తెలీక ఆయనేవో ప్రయత్నాలు చేస్తూండవచ్చు"

"ఆ అమ్మాయి కూడా ఇదివరకు తమ థియేటర్లో పనిచేసే అబ్బాయిని ప్రేమించినట్టు విన్నాను..మీకు తెలుసా?"

"తెలీదు. తెలియాల్సిన అవసరంలేదు ఆమె గతం ఆమె వ్యక్తిగతం. దానితో నాకు సంబంధం లేదు" దృఢంగా అన్నాడు మురళి.

"అఫ్‌కోర్స్..కాని ఆమె ఆ అబ్బాయి విషయంలోలానే మీ విషయంలోనూ ప్రవర్తిస్తే? మిమ్మల్ని కాదని మరొకర్ని..."

"నో. అలా ఎన్నటికీ జరగదు. మేం గాఢంగా ప్రేమించుకున్నాం. మా బయాలజికల్ టూర్‌కి అయిన నా ఖర్చంతా ఆమే భరించింది. ఈ పదిహేన్రోజులూ మేం ఎంత సన్నిహితంగా గడిపామో మీకు తెలీదు. మేం చాలా ఫొటోలు దిగాం గాని అవింకా ప్రింట్స్ వెయ్యి డానికి స్టూడియోలో ఇవ్వలేదు. లేకపోతే అవి చూపించేవాణ్ని. పోనీ ఆమె నాకు రాసిన ఉత్తరంవుంది! చూపించమన్నారా?"

"ఇఫ్ యూ డోంట్ మైండ్..."

"ఏం ఫర్లేదు"

తమ ప్రేమ విషయం మరొకరికి చెప్పే అవకాశం వచ్చినందుకు గొప్పగా ఫీలవుతూ శ్రీదేవి తనకి మొదట్లో రాసిన ఉత్తరం చూపించాడు మురళి.

ఉత్తరం సాంతం చదివాడు. తారీఖు కూడా చూశాడు.

అతడి నుదురు ముడివడింది.

"ఏవిటలా అయిపోయారు?"

"ఏంలేదు....ఏంలేదు. పెళ్ళి గురించి




మాట్లాడుకున్నారా?

"ఓ...హనీమూన్ ప్రోగ్రాం గురించి కూడా. మా పరీక్షలవ్వగానే పెళ్లి జరుగుతుంది మా పెళ్ళికి మీరు తప్పకుండా రావాలి"

"ఓకే...విష్‌యూ గుడ్‌లక్'' షేక్ హేండ్ ఇచ్చి వచ్చేశాడు సుధాకర్.

అతడి మనస్సు కుతకుత వుడికి పోతోంది.

"శ్రీదేవి ఇంత మోసం చేస్తుందా?"

పళ్ళు నూరాడు.

పెదవి కొరుక్కున్నాడు.

గుండెలు భగ్గున మండుతున్నాయ్.

అతడి శరీరంలోని ప్రతి అణువూ మోసం, దగా, వంచన అని గొంతెత్తి అరుస్తున్నాయ్.

అతడి మెదడులో చిన్న అనుమానం కదిలింది.

ఆగాడు.

తల పంకిస్తూ అటు వెళ్తోన్న ఆటో నాపి ఎక్కాడు.

పెద్దమ్మగారింటి ముందు దిగాడు.

"ప్రభా"

అతణ్ని చూసి సిగ్గుతో లోపలికెళ్ళిపోబోయిన ప్రభ అతడి కంఠస్వరంలోని మార్పుకాశ్చర్యపడుతూ ఎదుటికొచ్చింది. ఎర్రగా అవమానభారంతో దహించుకుపోతున్నట్టుగా వున్న అతడి మొఖాన్ని చూసి మరింత ఆశ్చర్యపడుతూ "ఏం జరిగిందన్నయ్యా'' అంది.

"ముందిది చెప్పు. శ్రీదేవి పేరు మరో అబ్బాయి పేరుతో జతచేసి కాలేజీ గోడల మీద రాశారన్నావుకదా! ఆ అబ్బాయి పేరేమిటో గుర్తుందా?"

"మురళి''

దెబ్బతిన్నట్టు చూస్తూ "నీకు బాగా గుర్తుందికదా" అన్నాడు.

"ఎందుకు గుర్తులేదూ... మురళే. అతడూ, శ్రీదేవీ క్లాస్‌మేట్స్ కూడా. ఎందుకలా అడుగుతున్నావన్నయ్యా?"

ఆమె వంకోసారిచూసి, "నిన్నిచ్చిచేద్దామనేన్నిన అబ్బాయే మురళి. అతడూ, శ్రీదేవీ పెళ్లి చేసుకోబోతున్నారట" అనేసి గబుక్కున వెనుదిరిగాడు.

రెండు వేడికన్నీటిబొట్లు జారిపడ్డాయ్ అతడి కళ్ళనుంచి. నిశ్చేష్టఅయ్యింది ప్రభ.

* * *

గ్లాసులు పగిలినట్లు నవ్వారంతా.

"ఎంతటి మగాడైనా ఆడదాని ముందు చిత్తే అని మరోసారి ఋజువు చేశావు శ్రీ" నళిని అంది.

"మురళి, మన శ్రీ కలిసి తిరుగుతోంటే టూర్‌వెళ్లినవాళ్ళమంతా వాళ్లు నిజంగా ప్రేమించుకున్నారనే భ్రమపడ్డామనుకో'' ఇవి రమ మాటలు.

కాంతం మురళి బహూకరించిన శంఖాన్ని ఎగరేస్తూ "పాపం...ఇది అతడి హృదయమటే. దీన్ని నువ్వు బీరువాలో దాస్తే ఎలాగే పాపం'' అంది.

"అవునేవ్. ఈ హృదయానికి పెద్ద గాయంకూడా అయినట్టుంది'' సుబ్బలక్ష్మి మాటలకంతా నవ్వారు.

"మొత్తానికి మురళి లొంగిపోయాడు"

"లొంగిపోవడంకాదే ... నా చేతిలోని బొమ్మ అయిపోయాడు. నేను కీ ఇస్తే తిరుగుతాడు. ఆడమన్నట్లా ఆడతాడు'' తలెగరేస్తూ అంది శ్రీదేవి.

''అసల్నువ్వు పందెంవేసినరోజునే అనుకున్నాను...నీ గెలుపు ఖాయమనీ, భూమి రెండుగా చీలిపోయినాసరే నువ్వోడిపోవనీను'' కాంతం ప్లేటు మార్చింది.

"మన శ్రీ అంటే ఏవిటనుకున్నావే ఇండియన్ క్లియోపాట్రా" రమ అంది.

"శ్రీ గొప్ప గురించెంత చెప్పినా తక్కువేగాని ఇవాళ్టి ప్రోగ్రాం ఆలోచించండి'' సుబ్బలక్ష్మి అంది.

"ఇంకా ఆలోచించడమేమిటే నీ మొఖం. రాణిని పిలిచి అవమానించడమే" శ్రీ అంది.

''అవుననుకో. ఆ అవమాన కార్యక్రమం చాలావుందకదా. అదంతా ఎక్కడ చెయ్యాలీ, ఎలా చెయ్యాలీ..'' సుబ్బలక్ష్మి మాటలకడ్డొస్తూ రమ అంది, ''సంగతి తెలిసి రాణి పుడాయించకుండా చూడాలి ముందు"

"పందెం చెప్పిన పెద్దమనిషి ఇక్కడే వుందిగా. తను చెబుతుంది ఇవాళ్టి తతంగ మేమిటో''

కాంతం మాటలకంతా నళిని వేపు చూశారు.

"మురళి శ్రీని పిచ్చిగా ప్రేమిస్తున్నాడని ఈ సాయంత్రం రుజువుచేస్తామని రాణికిచెప్పి పిలుద్దాం. ఏ హోటల్లోనయినా రూమ్‌తీసుకుని రాణికి మురళి ఇచ్చిన శంఖం చూపిద్దాం"

నళిని మాట్లాడటం పూర్తవ్వకుండానే శ్రీ అందుకుంది- "అదేకాదే! అంతకంటే పెద్ద సాక్ష్యమే వుంది.''

"ఏవిటది?" అంతా ఒక్కసారే అడిగారు.

ఓసారి గర్వంగా అందరివంకా చూసి వెళ్ళి సూట్ కేస్‌లోంచి కొన్ని కాగితాలు తెచ్చింది. "ఇవి మురళి డైరీలోని కాగితాలు. టూర్‌లో వుండగా నా పేరుని రామకోటిలా రాస్తూ పేలిన ప్రేమపాఠాలన్నీ ఇందులో రాసుకున్నాడు. అతడు చూడకుండా చింపుకొచ్చేశాను''

అంతా పోటీలుపడి చదివారు.

"బాపురే! కవిత్వం ఒలకబోశాడే!"

"తన తెలుగు పాండిత్యాన్ని ధన్యం చేసుకున్నాడు మహానుభావుడు"

''శ్రీని దేవతలా కొలుస్తున్నాట్టే''

''పాపం నువ్వు లేకపోతే తన జీవితానికర్థంలేదుటే''

రకరకాల వ్యాఖ్యానాలు చేశారు.

''ఇవి చూస్తే రాణి ఓటమి ఒప్పేసుకుంటుందిలే. ఒప్పుకోకపోతే మురళిని పిలవాల్సొంటుంది'' నళిని అంది.

"నా పేరు చెబితే చాలు..ఆఘమేఘాల మీద వస్తాడు'' నవ్వింది శ్రీ.

"హోటల్ నందనలో రెండు రూములు బుక్‌చేయించు శ్రీ''

''అదెంతపనిలే నళినీ...ముందు రాణి గారు రహస్యమార్గాన పారిపోకుండా చూడు"

"అయితే ఇవాళ రాణిగారి గుండు చూసి ఆమె చేసే సేవలందుకుంటామన్న మాట" సుబ్బలక్ష్మి మాటలకంతా పగలబడి నవ్వారు.

* * *

రాణికసలు కాలేజీకి వెళ్లాలని లేదు. వెళ్ళకపోతే శ్రీ, ఆమె ఫ్రండ్సూ గేలిచేస్తారనీ, ఓడిపోయినట్లుభావిస్తారనీ ఆలోచించి బయల్దేరిందిగాని ఆమె మనస్సు అల్ల కల్లోలంగా వుంది.

బయాలజికల్ టూర్లో మురళీ, శ్రీదేవీ చెట్టాపట్టాలేసుకుని తిరిగారని టూర్‌వెళ్ళిన చాలామంది చెప్పేరు. కాలేజీ గోడలమీది రాతలు నిజమేనేమో అనిపించేలా ప్రవర్తించారనీ చెప్పేరు.

అదిగో, అది విన్నప్పట్నుంచీ తన ఓటమి ఖాయమన్పించి కన్నీళ్ళపర్యంత మవుతోంది. ఈ పరిస్థితినెదుర్కోవడం

ఎలాగో, ఆ అవమానకాండనుంచి తప్పించుకోవటం ఎలాగో తెలీకుండా దిక్కుతోచకుండా వుంది.

కాలేజీకి పదింటికెళ్తే వాళ్ళు కనిపిస్తారని ఫస్టవర్ అవుతూండగా వెళ్ళింది. సెకండ్అవర్ అయ్యాక రమ వచ్చి, "ఓసారిలేడీస్‌వెయిటింగ్‌రూమ్‌లోకిరావే'' అంది. ఎందుకు పిలుస్తోందో వూహించిన రాణి, "ఇప్పుడు మంచి క్లాస్‌వుందే. లంచ్ టైమ్‌లో మాట్లాడదాం" అని పంపేసింది.

లంచ్ బెల్ అయ్యింది.

అంతా వెళ్ళిపోయాక తాపీగా బయలుదేరి వెళ్ళింది రాణి.

తన కారు పక్కనే శ్రీ కారు వుంది. దాని పక్కనే నిలబడివున్నారు శ్రీ, ఆమె ఫ్రెండ్సు.

గతుక్కుమంది రాణి.

పరిస్థితినెదుర్కోక తప్పదని గ్రహించి ముందుకడుగేసింది.

"రాణీ...రేపటితో పందెం గడువు ముగుస్తుంది. కానివాళే ఋజువుచేస్తానంటోంది శ్రీ .... నువ్వు రెడీయేనా?'' నళిని అడిగింది.

ఆమె ముఖం పాలిపోయింది.

''ఇవాళా....నాకొంచెం పనుందే''

"పోనీ ఇప్పుడు ఇక్కడ ఋజువు చెయ్యమంటుందేమో కనుక్కో'' శ్రీదేవి అంది సూటిగా.

''అబ్బే..ఇప్పుడెందుకూ సాయంత్రం.."

"సాయంత్రం ఏడుగంటలకి హోటల్ నందన రూమ్‌నెంబర్ సెవెన్‌లో కలుద్దాం. మాటతప్పకుండా రావాలి'' నళిని అంది.

''ఆ చివరమాట కాస్త గట్టిగా చెప్పు'' శ్రీ అంది.

రోషంగా చూసింది రాణి. ''మాట తప్పటం మా రక్తంలోనేలేదు. ఓకే ... తప్పకవస్తాను'' అనేసి విసురుగా తన కారువైపెళ్ళింది.

కారెక్కి విసురుగా డోర్ వేసింది. వారి సంభాషణ వింటూ వారివంక విచిత్రంగా చూస్తోన్న డ్రైవర్ డోర్ శబ్దానికి వులిక్కిపడ్డాడు.

"పోనియ్"

కారు కదిలింది.

ఇప్పుడేం చెయ్యడం?

తను విన్న వార్తల్నిబట్టీ, ఇప్పుడు చూసిన పరిస్థితినిబట్టీ మురళి శ్రీ వలలో పడ్డాడనటంలో కించిత్తుకూడా సందేహం లేదు. అతగాడు ప్రేమ డైలాగులు వల్లించడానికి సిగ్గుపడడు కూడానూ. ఎంతో బుద్ధిమంతుడూ, 'నన్ను ముట్టుకోకు నా మాల కాకీ' అన్నట్టుగా వుండేవాడూ, చదువు తప్ప మరో ధ్యాసలేనివాడూ అయిన మురళి ఆమె పిచ్చి ప్రేమలో పడ్డాడంటే ఇక ఆమె ఆడమన్నట్లల్లా ఎందుకు ఆడడు?మహచక్కగా ఆడతాడు.

ఇదే అదనని శ్రీదేవీ ఆమె తోకలూ తననాటపట్టిస్తారు. మళ్ళీ కాలేజీలో తలెత్తుకోకుండా అవమానిస్తారు!

అనుకోకుండా ఆమె చేతులు ఆమె జడమీదికెళ్ళాయ్.

జడ కత్తిరిస్తే?

బాపురే! ఘోరం!

ఛా....తనెంత పనికిమాలిన పందేనికి ఒప్పుకుంది. ఇప్పుడు వాళ్ళ బారినుండి బయటపడటమెలా?

ఆ రాస్కెల్ బాబుగాడు మురళి శ్రీ ప్రేమలో పడకుండా చూస్తాననీ, తన మాటతడికి వేదవాక్యమనీ కోతలుకోశాడు. తీరాచూస్తే తుస్‌మనిపించాడు ... ఒకవేళతడు చెప్పినా మురళి వినివుండడు. అందం, డబ్బూగల శ్రీ ప్రేమించానంటే

చొంగకార్చుకుంటూ వెంటబడ్డ అతడికి ఎవరి మాటలూ విన్పించవ్!

పోనీ ఓ పనిచేస్తే?

మధ్యాహ్నం బాబుని కలిసి ఏవేవో ఆశలు చూపెట్టి కనీసం మురళిని ఇవాళ క్కడికో తీసికెళ్ళిపొమ్మంటే? కబురెట్టినా రాకుండా వుండేట్లు చూడమంటే?ఇదొక్కటి చెయ్యగలిగితే చాలు...తను గెలిచినట్టే!

ఆ ఆలోచన బాగా నచ్చింది రాణికి.

ఎలాగైనా బాబు ద్వారా మురళి రాకుండా చూడాలని నిశ్చయించుకుంది మరోసారి.

సుధాకర్ రోడ్డు పక్క నిలబడి ఆటోని పిలుస్తూండటం అల్లంత దూరాన్నుంచే చూసింది రాణి.వెంటనే "డ్రైవర్! అదిగో...ఆ తెల్లబట్టల యువకుని పక్క నాపు కాయని'' అంది.

కారాగగానే "హలో'' అంది పలకరింపుగా నవ్వుతూ.

విసుబోతూ చూశాడామెవంక.

''రండి సార్! నేను..శ్రీదేవి ఫ్రెండ్‌ని. డ్రాప్‌చేస్తాను రండి''

"మీకు శ్రమెందుకండీ...అదిగో ఆటో వస్తోంది''

''ఏం పర్లేదు రండి. మీతో కొంచెం మాట్లాడాలి కూడా"

ఆమెవంక అర్థంకానట్లో పావుక్షణం చూసి వద్దని ఆటోకి సైగచేసి కారెక్కాడు. రాణి ఓ పక్కకి జరిగింది. అతను వెనుకసీట్లో ఆమెకొంచెం ఎడంగా కూర్చున్నాడు.

"మిమ్మల్నెప్పుడూ చూసినట్టు గుర్తు లేదు. క్షమించండి'' సుధ అన్నాడు.

''శ్రీ ఫేవర్‌కోసం ఆమెచుట్టూ తిరిగే ఫ్రెండ్స్‌లాటిదాన్ని కాదులెండి...ఫైర్‌మెన్ గారమ్మాయిని"

''అయ్ సీ"

''ఈమధ్య శ్రీ ప్రవర్తన బొత్తిగా బాగోటంలేదండీ! మీరు గమనించే వుంటారనుకుంటాను"

"అంటే...మీ వుద్దేశం?''

"అబ్బే..ఏం లేదండీ! శ్రీ ఏదో పందెం వేసి మురళి అనే మా కాలేజీ అబ్బాయిని ప్రేమించినట్లు నటిస్తోంది. అతగాడేమో ఆమె తనని నిజంగానే ప్రేమిస్తోందని కలలు కంటున్నాడు''

"ఆమె నటిస్తోందా? మీకు బాగా తెలుసా?''

''శ్రీ ఫ్రెండ్‌నని ముందే చెప్పానుగా. అంతే కాదండీ...ఇవాళ సాయంత్రం ఏడింటికి హోటల్ నందన రూమ్ నెంబర్ సెవన్లో ఓ 'షో' ఏర్పాటు చేయబోతోంది కూడా. అతడామెని పిచ్చిగా ప్రేమిస్తున్నాడని అందరిముందూ ఋజువుచేసి పందెం గెలవాలని ఆమె ప్లాన్. ఆమె తనని ప్రేమించటంలేదని తెలిసి ఆ పిచ్చివాడేమైపోతాడో తలచుకుంటే భయమేస్తోందనుకోండి"

"ఆఫ్టారాల్ ఓ పందెంకోసం ఓ అమాయకుడితో ఆడుకుంటుందా? ఆమె చదువూ సంస్కారం ఏమైనట్టు?''

"ఆమె తలనిండా గర్వమేనండీ బాబు. మీరు సాయంత్రం ఎలాగైనా వచ్చి అతణ్ని రక్షించాలి"

"ఓకే...తప్పకుండా. నేనిక్కడ దిగిపోతాను. బాబూ....కొంచెం ఆపవయ్యా"

సుధాకర్ దిగిపోయాడు.

సంతోషంగా నిట్టూర్చింది రాణి.

* * *

హోటల్ నందనలో ఏడో నెంబరు గదిలో సమావేశమయ్యారు శ్రీదేవి, నళిని, కాంతం, రమ, సుబ్బలక్ష్మి.




''ఇంకో మూడుగంటల్లో రాణి జడ కట్ కట్'' రమ అంది చేతిలోని కత్తెర్ని టకటకమని ఆడిస్తూ.



"నేనేం చేస్తానో తెలుసా? కాఫీ తెమ్మని చెప్పి షగర్ ఎక్కువుందంటూ రాణి మీద ఒలకబోసేస్తాను'' కాంతం నవ్వింది.

''మనం చెయ్యమన్నట్లల్లా చెయ్యాలి కదా. అందుకని జయమాలిని డాన్స్ చెయ్యమంటాను"

సుబ్బలక్ష్మి మాటలకి పగలబడి నవ్వారంతా.

''ముందు మన శ్రీని కుర్చీలో కూర్చోబెట్టి రాణి చేత ఆమె పాదాలు పట్టించాలి. ఏం శ్రీ?'' అనడిగింది నళిని.

"అవునవును. అది చాలా ముఖ్యం. తనేదో ఛైర్మన్‌గారమ్మాయిననీ అదనీ ఇదనీ దానికి తగని గర్వం. అదంతా ఇవాళ అణచెయ్యాలి. దాని పొగరు పిండేసి మళ్లీ ఎన్నడూ మనతో పందెం వెయ్యకుండా, సవాలు చెయ్యకుండా బుద్ధి చెప్పాలి. కాలేజీలో తలెత్తుకోలేకుండా నవ్వులపాలు చెయ్యాలి. లేకపోతే నాతోనే సవాలు చేస్తుందా? శ్రీ అంటే అమృతమే కాదు...విషం అని కూడా తెలియజెబుతాను" విసురుగా అంది శ్రీ.

"నువ్వు చూస్తుండు శ్రీ! రాణి భరతం మేం పడతాంగా" రమ భరోసా ఇచ్చింది.

"అప్పుడే నాలుగున్నరయ్యిందే. రాణి వెళ్ళిపోతుందేమో...ఎవరైనా వెళ్ళి పిలుచుకొస్తే?"

సుబ్బలక్ష్మి మాటలకి "నళినీ కాంతం వెళ్ళితీసుకొస్తారు" అంది శ్రీ.

"మేం వెళ్ళాంగాని మన సామాన్లన్నీ రెడీయేకదా? అవసరమైతే మురళి వస్తాడు కదా?" నళిని అంది ఎక్కడో గుండెల మారుమూల అనుమానం పీకుతోంటే.

"రాకపోవడమన్నది కలలో కూడా జరగదు. ఇవాళెక్కడికీ వెళ్ళనని ప్రామిస్ చేశాడు కూడా"

"సరే మేం వెళ్తాం"

"టాక్సీలో వెళ్ళి ఎలాగైనా ఆ పొగరబోతుని తీసుకురండి" దబ్బిచ్చింది శ్రీదేవి.

నళినీ, కాంతం టాక్సీలో కాలేజీకి వెళ్ళారు. గేట్లోనే ఎదురయ్యింది రాణి ఇంటికెళ్తూ.

వాళ్ళు కంటబడేసరికి రాణి ముఖంలోని రక్తం పరుగులు తీసింది. ఒళ్ళంతా ముచ్చెమటలు పోస్తోంటే సన్నగా వణకసాగింది.

అంతక్రితమే బాబుకోసం వాకబు చేసిందిగాని అతడవాళ కాలేజీకే రాలేదని విని నిరుత్సాహపడింది. శ్రీ కళ్ళల్లో పడకుండా వుడాయిద్దామని వెళ్తోంటే వీళ్ళు తయారు.

"హాయ్ రాణీ...హోటల్‌కేనా?''

ఇబ్బందిగా నవ్వుతూ, "అప్పుడే ఎందుకూ? సెవెన్ కన్నారుగా?" అంది.

''అంతవరకూ పిచ్చాపాటీ మాట్లాడుకుందాం"

వాళ్ళ భావం అర్థమైపోయింది రాణికి. తను తప్పించుకోకుండా వాళ్లు ఎత్తులేస్తున్నారని గ్రహించేసింది. లేని బింకం తెచ్చుకుంటూ, "శ్రీకి మీరంతా ఉన్నారు. నేనూ నా ఫ్రెండ్‌ని పిలుస్తాను" అనేసి కాలేజీలో కెళ్ళి సుందరిని పిలుచుకొచ్చింది.

నలుగురూ హోటల్‌కొచ్చారు.

ప్రత్యర్థులిద్దరూ ఒకరి మొఖాలొకరు చూసుకుని తలలు తిప్పేసుకున్నారు.

కొన్ని నిమిషాలు నిశ్శబ్దంగా గడిచిపోయాక శ్రీదేవి బోయ్‌ని పిలిచి టీ ఆర్డరిచ్చింది.

"నళినీ...కార్యక్రమమేమిటో చెప్పు"

శ్రీ మాటలకి అయిష్టంగానే రంగంలోకి దిగింది నళిని.

"నాలుగు నెలల్లో మురళి శ్రీదేవిని పిచ్చిగా ప్రేమించాలని నాలుగు నెలల క్రితం శ్రీదేవీ, రాణీ పందెం వేసుకున్న సంగతి మనకందరికీ తెలిసిందే. ఓడిపోయిన వాళ్ళు గుండు గొరిగించుకోవాలనీ గెలిచినవారి కాళ్ళు పట్టుకోవాలనీ, అవహేళనల్ని భరిస్తూ అందరికీ పార్టీ ఇవ్వాలని కూడా అప్పుడే నిర్ణయానికి వచ్చాం..."

ధారలుగా కారిపోతోన్న చెమటల్ని తుడుచుకోసాగింది రాణి.

అంతవరకూ ఆ విషయాలు వినని సుందరి రాణినీ, శ్రీనీ వింతగా భయంగా సానుభూతిగా చూడసాగింది.

"ఇప్పుడు మురళి శ్రీని గాఢంగా ప్రేమిస్తున్నదీ లేనిదీ ఆరాధిస్తున్నదీ లేనిదీ తేల్చాల్సి వుంది. శ్రీ నువ్వేమంటావో చెప్పు" నళిని అడిగింది లాయర్లా.

"నేనేం చెప్పనక్కరలేదు...మురళి వస్తువులే అంతా చెబుతాయ్'' అంటూ రమ వంక చూసింది శ్రీ. రమ శంఖమూ, డైరీ కాగితాలూ తెచ్చిచ్చింది.

అవి ఆత్రంగా చూశారు, చదివారు రాణీ, సుందరీ.

"నువ్వేమంటావ్ రాణీ?"

"ఇలాటి కట్టుకథలు నమ్మనంటాను'' వుక్రోషంగా అంది.

''అవి కట్టుకథలా? కళ్లుండే అంటున్నావా ఆ మాట?" మొఖం ఎర్రగా చేసుకునంది శ్రీ.

''ఇలాటి వంద శంఖాలమీద వంద రకాలుగా రాయించగలను. పది కాగితాలేం ఖర్మ మొత్తం డైరీనిండా ప్రేమ కబుర్లతో నింపించగలను''

''అంటే ఆపని నేను చేశానంటావా?"

"ముమ్మాటికీ''

"డోంటాక్ రబ్బిష్"

"డోంట్ క్రై''

''ఓడిపోతానని ఏడుపు"

''అయితే ఋజువుచేసుకో"

''చేస్తాను చూసుకోవే. నళినీ..మురళిని పిలిపిస్తాను. అతడి మాటలైనా నమ్ముతుందేమో కనుక్కో" శ్రీ అంది రొప్పుతూ.

"చిలకపలుకులు వల్లించమని అతడికి ముందే చెప్పి ఉంచారేమో...ఎవరికి తెలుసు?''

రాణి మాటలకి ఒళ్లు మండింది శ్రీకి. ''అంత ఖర్మం పట్టలేదు మాకు!''

"కొంచెం నిగ్రహించుకోండి...ప్లీజ్. పోనీ ఓ పని చేద్దాం. శ్రీకి యాక్సిడెంటయ్యిందనీ, హోటల్లో వుందనీ సుందరీ సుబ్బలక్ష్మి వెళ్ళి మురళికి చెబుతారు. అతడొస్తాడేమో చూద్దాం. వస్తే అతడి ప్రవర్తన ఎలా వుంటుందో చూసి దాని ప్రకారం ఓ నిర్ణయానికొద్దాం. ఇద్దరూ ఒప్పుకున్నట్టేనా?"

నళిని మాటలు సబబుగా అన్పించి తలలూపారంతా.

"మీ ఇద్దరూ వెళ్ళిరండి. మురళి రూమ్ అడ్రస్ తెలుసుగా? మీరా రెండు మాటలు తప్ప ఇంకొక్కమాట కూడా చెప్పకూడదు" అని చెప్పి సుందరినీ, సుబ్బలక్ష్మినీ పంపించారు.

ఇద్దరూ ఆటో మీద మురళి గదికి వెళ్ళారు.

సుందరి కొంచెం ఇబ్బందిగా అనుసరిస్తోంటే సుబ్బలక్ష్మి తెచ్చి పెట్టుకున్న ఆత్రుతతో "మురళిగారూ..మురళిగారూ'' అంటూ పిలిచింది.

''ఎవరూ?'' అంటూ బయటికొచ్చాడతడు.

''కొంప మునిగిపోయిందండీ" ఏడుపు స్వరంతో అంది.

''ఏం..ఏం ఏం జరిగింది?" గాభరాగా అడిగాడు.

"శ్రీదేవికి యాక్సిడెంటయ్యిందండీ! నందన హోటల్లో వుంది''

"ఏవిటీ..నా శ్రీదేవికి యాక్సిడెంటా?" తుళ్లిపడి అడిగాడు.

తలలూపారిద్దరూ.

అతడి కళ్ళల్లోకి నీళ్ళు పొంగి వచ్చాయ్.

"పెద్ద దెబ్బలు తగల్లేదుకదా?" దుఃఖాన్ని అతి కష్టంమీద నిగ్రహించుకుంటూ అన్నాడు.

"కొంచెం సీరియస్‌గానే వుందండీ"

"ఆఁ!" ప్రమాస్పది పిచ్చి చూపులు చూశాడు కొన్ని క్షణాలు. తర్వాత తేరుకుని లుంగీతోటే వాళ్ళెక్కి వచ్చిన ఆటోవైపు పరుగెట్టాడు. ఆటో ఎక్కుతూ-"హోటల్ నందనలోనా?" అనడిగాడు.

"అవునండీ! రూమ్ నెంబర్ సెవెన్"

''స్పీడుగా పోనియ్ బాబూ'' తొందర పెడుతూ అన్నాడు మురళి.

హోటల్ ముందు ఆటో ఆగటం ఆలస్యం గబుక్కున దూకేశాడు.

''డబ్బులు సార్"

చొక్కా జేబులో చెయ్యిపెట్టి చేతికి

తగిలిన నోటు విసిరేసి హోటల్లోకి పరుగెత్తాడు.

"'రూమ్‌నెంబర్ సెవెన్ ఏది?" హోటల్ బోయ్‌కి డేష్ ఇవ్వబోయే నిలదొక్కుకుని అడిగాడు ఒగరుస్తూ.

"పైన" సైగ చేస్తూ అన్నాడు.

మెట్లవైపు పరుగెట్టి అంగకి నాలుగు మెట్లు చొప్పున ఎక్కి అంత వేగంగానూ రూమ్ నెంబర్ సెవెన్‌ముందు నిలబడ్డాడు.

గుమ్మం మధ్యలో నిలబడ్డ అతణ్ని చూసి విస్తుబోయారు రాణి, నళిని, రమ, కాంతం.

ఒంటిమీద చొక్కా లుంగి మాత్రం వున్నాయ్. తల చిందరవందరగా వుంది. చెమ్మగిల్లిన కళ్ళు ఆత్రంగా, భయంగా చూస్తున్నాయ్. చొక్కా చెమటతో తడిసిపోయింది. రొప్పుతూ నిలబడ్డాడు.

అతణ్నలా చూసేసరికి రాణితోసహా అందరికీ జాలేసింది. సానుభూతిగా చూశారు. కాని సానుభూతిని స్వీకరించగల స్థితిలో లేడతడు. వాళ్ళు తనని చూసి శిలా ప్రతిమలయ్యేసరికి అతడు మరో అర్థం చెప్పుకున్నాడు. శ్రీదేవికి పెద్ద ప్రమాదమే జరిగుంటుందనీ,అందుకే అలా ప్రవర్తిస్తున్నారనీ భావించి"దేవి... శ్రీదేవి ఏది?" అనడిగాడు అయాసాన్ని లెక్కచెయ్యకుండా.

రూమ్‌కో పక్కనున్న మంచంవైపు చూపించారు.

మంచంమీద పడుకునున్న వ్యక్తికి కాళ్ళనుంచి తలవరకూ తెల్లని దుప్పటి కప్పబడి వుండటం చూసి "దేవి" అని అరిచి మంచాన్ని సమీపించి బావురుమన్నాడు మురళి.

"అంతా అయిపోయింది" నళిని అంది మెల్లగా.[redacted]గుతిన్నాదతడు.

"దేవీ...దేవీ! నీకేమయ్యింది దేవీ! నన్నన్యాయంచేసి పోతావా దేవీ. నువ్వు లేకపోతే బతకలేను. నిన్ను చూడకుండా ఒక్క క్షణంకూడా జీవించలేను" ఏడుస్తూ తలమీది దుప్పటి తొలగించబోతోంటే నళిని ముందుకొచ్చి వద్దన్నట్టు సైగచేసింది.

"వూహూ. నేను చూడాలి. కడసారి చూపైనా దక్కకపోతే ఇంక నా బతుకు వ్యర్థం" అంటూ తొలగించి ఆమె బుగ్గల్ని రాస్తూ భోరున ఏడ్చాడు. దుఃఖం ఆగక ఆమె నుదుట ముద్దుపెట్టుకుని మంచం పక్కనే నేలమీద చతికిలబడిపోయాడు.

నళిని వచ్చి దుప్పటి కప్పేసింది మళ్ళీ.

"అయ్యో...ఇంత ఘోరం ఎలా జరిగింది దేవీ? మాయదారి ప్రమాదం నిన్నే ఎత్తుకుపోవాలా. నన్ను తీసికెళ్ళిపోకూడదూ? బతుకంతా నీతో పంచుకోవాలని కలలు కన్నానే, నువ్వే నా స్వర్గమని ఎన్నెన్నో గాలిమేడలు కట్టుకున్నానే... అవన్నీ నీటిమీది రాతలు చేసేసి నిర్దాక్షిణ్యంగా వెళ్ళిపోయావా దేవీ. నువ్వు లేకుండా నేనెలా బతకను? నా జీవితంలోని ప్రతి క్షణాన్నీ నీతో ముడివేసుకున్నానే...ఇక నువ్వు లేక నేనెలా జీవించను?ఆ నరకసదృశ జీవితం నాకొద్దు దేవీ....నేనూ నీతోనే వచ్చేస్తాను. నన్ను తీసుకుపో దేవీ...దేవీ..." మంచాన్నేసి తల కొట్టుకుంటోంటే నళినీ, కాంతం గబుక్కునొచ్చి పట్టుకున్నారు.

అతడికామెమీద వున్న పిచ్చిప్రేమని చూస్తోంటే రాణితోసహా అందరికీ దుఃఖం ముంచుకొస్తోంది. అప్పుడే గదిలో అడుగుపెట్టిన సుందరీ,సుబ్బలక్ష్మీ కూడా




ప్రమాన్నపడి చూడసాగారాదృశ్యాన్ని.

"నన్ను వదలండి. దేవి లేకుండా నేను బతకలేను. ఆమె లేని జీవితం వూహించలేను. నన్ను చచ్చిపోనివ్వండి. నా దేవితోబాటు సహగమనం చెయ్యనివ్వండి. మాది అమర ప్రేమయని ప్రపంచానికి చాటనివ్వండి"

పగలబడి నవ్వుతూ లేచి కూర్చుంది శ్రీదేవి.

నివ్వెరబోయాడు మురళి. చనిపోయిన ఆమె ఎలా బతికిందో, అసంభవం ఎలా సంభవమయ్యిందో ఏమాత్రం బోధపడక గుడ్లప్పగించి చూస్తూండిపోయాడు.

"దేవీ! నువ్వు...నిజంగా..."

"పిచ్చీ! నేను చచ్చిపోలేదు. ఇదంతా నాటకం"

"ఏవిటీ...నిజంగానే.నామీద ఒట్టే!" ఆమె చేతిని తన తలమీద పెట్టుకుంటూ అన్నాడు ఆనందోద్రేకంతో వూగిపోతూ.

ఆమె తలూపింది.

అతడి కన్నీటిలో ఆనందపు వెలుగులు తళుక్కున మెరిశాయ్.

"థాంక్యూ దేవీ! నీకింకా ఏదో అయ్యిందని గుండెలు బద్దలవుతోంటే... చాలు దేవీ. నాకీవరం చాలు. నువ్వు నాకు దక్కావు. ఇంతకంటే ఇంకే వరం ఏ దేవుణ్ణీ నేను కోరను" ఆమె చేతిమీద ముద్దుపెట్టుకోబోతోంటే విదిలించి లేచింది.

నిశ్చేష్టుడయ్యాడు మురళి.

"దే...వీ..."

"ఇకనుంచలా పిలవకు"

"ఏవిటీ...? ఏవిటి నువ్వంటున్నది? నిజంగా నువ్వేనా ఈ మాటంటోంది?"

"నేనే నేనే నేనే. తెలిసిందా? ఇక నుంచి అంటే ఈ క్షణంనుంచి మనకేం సంబంధంలేదు" నిర్దాక్షిణ్యంగా అంది శ్రీ.

"దే...వీ...!"

"అలా పిలవ్వొద్దనే చెప్పేది"

"నాకంతా అయోమయంగావుంది. ఏది నమ్మాలో, ఏది కూడదో తెలీడం లేదు"

"నేన్చెప్పేది నమ్ము. నువ్వు నన్ను పిచ్చిగా ప్రేమించాలని ఈ రాణి నాతో పందెంవేసింది. పందెం గెలవడానికే నీతో స్నేహం నటించాను. లవ్ లెటర్ రాశాను. ప్రేమ కబుర్లు చెప్పేను. ఆఖరికి కాలేజీ గోడలు ఖరాబు చేయించింది కూడా నేనే. ఇదంతా నిన్ను బుట్టలో వేసుకోడానికే. పాపం ఆ సంగతి తెలీక నువ్వు నిజంగానే ప్రేమించేసినట్టున్నావ్. అయ్ పిటీ యూ మై బోయ్. నువ్వు నన్ను ఎంతలా ప్రేమిస్తున్నదీ రాణికి ప్రత్యక్షంగా చూపడానికే ఈ ప్రదర్శన ఏర్పాటుచేశాం.సో..గుడ్ బైమిస్టర్ మురళీ. థాంక్యూఫర్ యువర్ కోఆపరేషన్"

"ను..వ్వు..!నువ్వు నన్ను ప్రేమించలేదూ? అంతా నాటకవే?" తన చెవుల్ని విశ్వసించలేక మళ్ళీ అడిగాడు.

"ఇదంతా జస్ట్ లవ్ గేమ్...దట్సాల్. నిన్ను నేను ప్రేమించడం ఓ పెద్ద అబ్సర్డ్. నేనింకో సంగతి చెబుతున్నాను. సుధాకర్ని ప్రేమించాను.ఇంకొన్నాళ్ళలో పెళ్ళి చేసుకోబోతున్నాను. ఇప్పుడైనా నా సంగతి నీకర్థమై వుంటుందనుకుంటాను."

శ్రీదేవి నవ్వుతోంటే మిగిలినవాళ్ళు ఇష్టం లేకున్నా నవ్వసాగారు.

రాయిలా నిలబడి పిచ్చిగా చూస్తున్నాడు మురళి.

అతడి కళ్ళనుండి కన్నీళ్ళు ధారలుగా ప్రవహిస్తున్నాయ్.

''అయ్ పిటీయూ'' ''ఇది ప్రేమట''
''నేన్నిన్ను ప్రేమించడం అసంభవం''
అంటూ కోటి గొంతులు అతడి చెవులు దద్దరిల్లేలా అరుస్తున్నాయ్.

అతడి చూపుమాత్రం శ్రీదేవినే చూస్తోంది.

వాడిగా వేడిగా తీక్షణంగా చూస్తోంది.

అంతకంతకీ ఆ వేడి అధికమవుతోంటే అతడి చూపుతో చూపుకలపడానికి భయపడసాగింది శ్రీ.

అంతలో ''స్టాపిట్...'' అంటూ ఒక బలమైన కంఠం అధికార స్వరంతో గర్జించింది.

నవ్వులూ తప్పట్లూ ఆగిపోయాయ్.

గుడ్లప్పగించి చూస్తున్నారంతా, గుమ్మంలో నిలిచిన సుధాకర్ వైపు.

అతడిప్పుడు వచ్చినందుకు ఇబ్బందిగా ఇరకాటంగా ఫీలవసాగింది శ్రీ.

''ఏవిటిది? ఈ అమాయకుణ్ని పట్టుకొని మీరంతా ఏంచేస్తున్నారు? మీసు మనుషులా? రాక్షసులా?''

అతడి గొంతు ప్రతిధ్వనిస్తోంది.

అంతా మౌనంగా తలలొంచుకుని నేలచూపులు చూస్తూండిపోయారు.

ఇదే అదనని మెల్లిగా కదిలి అక్కణ్నుంచి వెళ్ళిపోయింది రాణి పెద్ద గండం గడిచినందుకు సంతోషిస్తూ.

''మాట్లాడరేం? చెప్పండి'' ఒక్కొక్కర్నీ చూపుల్తో మాడ్చేస్తూ అడిగాడు.

''మిస్టర్ సుధాకర్! మైండ్ యువర్ బిజినెస్'' అరిచింది శ్రీ.

''షటప్... మీరు చెప్పండి'' సుశిని నడిగాడు.

ఆమె బెదురు చూపులు చూస్తూనే రాణీ, శ్రీదేవి వేసుకున్న పందెం గురించీ, శ్రీ మురళిని వలలో వేసుకోవడం గురించీ ఇవాళ్టి నాటకం గురించీ గబగబా చెప్పింది.

''బొమ్మలతో ఆడుకోవచ్చు... మనుషుల్తోఆడుకోవొచ్చు. కాని మనసుల్తో ఆడుకోకూడదు. అంతకంటే రాక్షసత్వం వుండదు. ఇతరుల్ని హింసించి అనుభవించే ఆనందం రాక్షసానందం! నువ్వు అందమైనదానివీ,మంచిదానివీఅనుకున్నాను గాని ఈ అందమైన రూపం వెనుక కురూప హృదయముందనుకోలేదు. అసలు నీ ఆటకి ఈ అమాయకుడే దొరికాడా? నీ పాపానికి ప్రాయశ్చిత్తం ఏమిటో తెలుసా? ఇతణ్ని పెళ్ళిచేసుకో''అన్నాడు సుధాకర్ వుద్రేకంతో వూగిపోతూ.

''నెవర్ ఇన్ మై లైఫ్''

''నీ కుళ్ళిన మనస్సుకన్నా ఇతడి హృదయం ఎంతో గొప్పది. అది క్షోభపడితే నీ బతుకే ఒక శాపం అవుతుంది... గుర్తుంచుకో''

''మిస్టర్! డోంటాక్ రాట్. ఇది నీకు సంబంధంలేని వ్యవహారం. గెటవుట్ అయ్ సే'' నిప్పులు కక్కింది శ్రీ.

సుధాకర్ ఏదో అనబోతోంటే ''మీరుండండి బ్రదర్'' అంటూ మురళి దూసుకుని శ్రీదేవి దగ్గరికెళ్ళి, ''యూ డెవిల్ వుమన్'' అంటూ ఆమె రెండు చెంపల్నీ వాయించి విసురుగా బయటికి వెళ్ళిపోయాడు!

* * *

ఇంతవరకూ ఎవరూ ఆఖరికి తన తల్లితండ్రీ కూడా తనని చిన్నెత్తు మాటన్లేదు. తన ఒంటిమీద చెయ్యెయ్యటం కాదు కదా కనీసం కొడతానని కూడా ఎవరూ అన్లేదు.అసగల సాహసం ఎవరికీ లేదసలు. అలాటిది బ్లడీ రాస్కెల్ తనని కొడతాడా? పదిమంది ముందూ అవమా

నిస్తాడా??

ఆగ్రహంతో కంపించిపోతోంది శ్రీదేవి.

కళ్ళముందు మసక తెరలు కదుల్తోంటే తల విదిల్చి చూసింది. గోపి!

'ఏం?' అన్నట్టు వురిమి చూసింది.

ఆమె కళ్ళల్లోని ఎరుపు జీర చూసి వణికిపోయాడు వాడు.

"ఏరా...రావొద్దన్నానా?"

"సుధాకర్ గారొచ్చారండి"

''ఎవడూ?''

''మేనేజర్ బాబండి''

"ఏ మొఖం ... పెట్టుకొచ్చాడూ... పొమ్మను..."

''మీతో మాట్లాడాలనీ...'' గుమ్మం దాటి ఆగి అన్నాడు.

''పొమ్మని చెప్పమన్నానా?''

గంతువేసి వెళ్ళిపోయాడు.

హుఁ! తనతో మాట్లాట్టానికి వచ్చాట్ట! ఆ మురళిగాడు తనని కొడుతోంటే దిష్టిబొమ్మలా కూర్చున్నది ఇతడు కాదూ? అతట్లో ఎన్నో మంచి లక్షణాలున్నాయని మురిసిపోయిందిగాని అతడూ అందర్లాటి మగాడే. తనని ప్రేమించిన పెద్దమనిషి తననడిగి పూర్తి వివరాలు తెలుసుకోకుండానే దెయ్యం, రాక్షసి అంటూ తిడతాడా? ఎవడిచ్చాడు అతడికంత అధికారం? అసలు తనేం చేసిందనీ తననన్నేసి మాటలనడం? ఏదో పందెంవేసి ప్రేమిస్తున్నానూ అంటే అతగాడు ప్రేమ పిచ్చివాడైపోవాలా! డర్టీఫెలో! వాడి మొహం వాడు అద్దంలో చూసుకునివుంటే తనతణ్ని ప్రేమించ గలదో లేదో తెలిసివచ్చేది! అతడు నన్ను ప్రేమించాట్ట, నేను పెళ్లిచేసుకోవాల్ట! తనని ప్రేమించినవాళ్ళనల్లా చేసుకోవా లంటే ఈపాటికి ఎన్ని వందల మందిని చేసుకోవల్సి వచ్చేదో! పూర్ ఫెలోస్!

"నిన్నటి అవమానం తాలూకు హాంగోవర్ ఇంకావదలనట్లుంది పాపం!"

సుధాకర్ మాటలకి చివ్వున తలెత్తి చూసింది.

"అయ్ సే యూ బ్లడీ రాస్కెల్ ... గెటవుట్"

''హృదయాల్ని ముక్కలు చెయ్యడం నీకు సరదా అనుకుంటాను''

"ముందిక్కణ్నించి వెళ్ళిపో. నీ నీతులెవడికీ అక్కర్లేదు''

"వుండటానికీ, నీతులు చెప్పడానికీ రాలేదు"

''నిన్నటి నీ ప్రవర్తనకి సంజాయిషీ ఇచ్చుకోడానికి వచ్చావా?"

"సారీ చెప్పాల్సిందీ, సంజాయిషీ ఇచ్చుకోవాల్సిందీ నువ్వుగాని నేను కాదు. నీకో నిజం చెబుదామని వచ్చాను''

"ఏవిటో పనిగట్టుకొచ్చి చెప్పాల్సిన ఆ నిజం" తలెగరేస్తూ అంది.

''మురళి...మురళి రాత్రి ఆత్మహత్య చేసుకున్నాడు"

"వ్వా...ట్!"

''తన చావుకి తనే కారణమని కాగితం రాసిపెట్టి రాత్రి ఆత్మహత్య చేసు కున్నాడు"

"ని...నిజవాఁ? మైగాడ్!" రెండు చేతుల్తో చెవులు మూసుకుని మంచంమీద కూర్చుండిపోయింది.

ఆమె కళ్ళు నీళ్ళతో నిండిపోయాయ్. గుండెల్ని సరికొత్త బ్లేడుతో కోస్తున్న బాధ. నోటి తడారిపోతోంటే మెదడు దిమ్మెరపోతోంటే వణికిపోతూ భయంగా చూసింది.

"ఎందుకిప్పుడు ఏడుస్తావ్? నిన్నటి

వరకూ అతడ్తో ప్రేమాట ఆడుకున్నప్పుడు ఇలాటి ముగింపు ఎదురవుతుందేమోనని వూహించలేదు కదూ? అందరికీ నీలాగే ప్రేమ ఒక ఆట అనుకున్నావు కదూ? ఆత్మహత్యకి తలపడేముందు అతడెంత మధనపడి వుంటాడో, ఎంత మానసిక క్షోభకి గురైవుంటాడో ఆలోచించు. అతడు నీ అహంకారంపై నిన్న కొట్టిన దెబ్బకే బాధపడిపోతున్నావే! నువ్వతడి గుండెలమీద కొట్టిన చావు దెబ్బకి ఆ అమాయకుడు ఆత్మహత్య నాశ్రయించక ఏం చేస్తాడు...చెప్పు"

మొఖాన్ని అరచేతుల్లో దాచుకుని బావురుమంది శ్రీదేవి తన జీవితంలో ప్రప్రథమంగా.

''ఏడవాలి. ఇంకా గట్టిగా ఏడవాలి. నీ హృదయాన్ని కప్పిన గర్వపు పొరలు కరిగేదాకా ఏడవాలి. నిజానికి మురళి ఆత్మహత్య చేసుకోలేదు. అతణ్ని నువ్వే నువ్వే...నువ్వే చంపావ్. నీవు హంతకురాలివి. ఈ విషయం నీకూ,నాకూ, మురళికీ మాత్రమే తెలుసు గనుక బతికిపోయావుగాని లేకపోతే నువ్వెక్కడుండేదానివో ఆలోచించు. మీ నాన్నగారి డబ్బు పలుకుబడీ కోర్టు చేత నిర్దోషి అని ముద్ర వేయించగలిగేవేమోగాని నీ మనోన్యాయస్థానం ముందు నువ్వు దోషిగా, హంతకురాలిగా నిలబడక తప్పదు. కుళ్ళి కుళ్ళి ఏడవక తప్పదు''

"ప్లీజ్ ... సుధా! స్టాపిట్ ప్లీజ్. నన్నింకా మాటల ఈటెల్తో చంపకు''

"హు...నేనెందుకు చంపుతాను శ్రీ. నీ మనస్సే నిన్ను చిత్రవధ చేస్తుంది. కానొక్కటి గుర్తుంచుకో. నిన్నటివరకూ మురళితో ఆడుకున్నావు. విర్రవీగావు. కానీ రోజునతణ్ని కనీసం ఒక్కక్షణమైనా బతికించగలవా? అతడి బాధ్యతల్ని నీ భుజాన వేసుకోగలవా? లేనప్పుడతణ్ని మృత్యుగుహలోకి తోసివెయ్యగల అధికారం నీకు లేదుగాకలేదు. అతడి చావుకి కారణం ముమ్మాటికీ నీ ప్రవర్తనే అని జీవితాంతం గుర్తుంచుకో. ఇంకెన్నడూ బతుకులతో ఆటలాడకు"

"నన్నెందుకింకా హింసిస్తావు సుధా! జరిగినదానికి పశ్చాత్తాపంతో కృంగిపోతున్నాను. నన్నర్థం చేసుకో...ప్లీజ్''

"నీమీద కోపంతోనో ద్వేషంతోనో ఈ మాటలనడం లేదు శ్రీ! మండుతోన్న నా గుండెల్లోంచి దూసుకొస్తోన్న జ్వాలలివి. నీకు తెలీకపోవచ్చుగాని మురళి ఇంటి పరిస్థితి గురించి నాకు బాగా తెలుసు. మురళి కొచ్చే కట్నంతో ఓ ఆడపిల్ల పెళ్ళిచెయ్యొచ్చనీ,కొన్ని అప్పులు తీర్చుకోవచ్చనీ, అతడి జీతపు రాళ్లతో అతడి తమ్ముళ్ళ చెల్లెళ్ళ జీవితాలకోదారి, వృద్ధ తల్లిదండ్రులకో ఆధారం కల్పిస్తాడనీ ఎంతో ఆశిస్తున్నారు...కలలు కంటున్నారు. కాని వారి కలలన్నీ ఇవాళ కాటిలో కళ్ళ ముందే భస్మం అయ్యాయ్. చేతికందివచ్చిన కొడుకు చితికి నిప్పంటిస్తూ ఆ తండ్రి ఎంతగా దుఃఖించాడో, ఆ తల్లి ఎంత కుమిలిపోయిందో, అతడి తమ్ముళ్ళూ చెల్లెళ్ళూ ఎంత విలపించారో ఊహించగలిగితే వూహించుకో శ్రీ! వాళ్ళ అంధకారబంధురమైన భవిష్యత్తుకి కారణం నువ్వు కదూ?

"మనిషికి అహంకారం వుండొచ్చు. గర్వం వుండొచ్చు. కాని అది హద్దులు దాటకూడదు. ధనమదంతో మనిషి అహంకారియై ప్రవర్తిస్తే ఇదిగో ఇప్పుడు జరిగిందే జరుగుతుంది. డబ్బు ఇవాళ వుండొచ్చు. రేపు పోవచ్చు. పోయేప్పుడు




మనలో ఈనుప్పుల్ల కూడా రాదని మన మెప్పుడూ జ్ఞప్తిలో వుంచుకోవాలి. మన ప్రవర్తనని సరిదిద్దుకొంటుండాలి. డబ్బు శాశ్వతం కాదు...మనిషి శాశ్వతం కాదు. కాని మంచి శాశ్వతం. మానవత్వం శాశ్వతం. ప్రేమ శాశ్వతం. ఆ సంగతి గుర్తుంచుకో" అనేసి వెనుదిరిగిన సుధాకర్ గుమ్మంలో నిలబడి వున్న నీలకంఠరావు గార్ని, మీనాక్షమ్మగార్ని చూసి ఆగాడు.



# 12

వారిద్దరి కళ్ళల్లోనూ కదుల్తోన్న కన్నీటి పొరల్ని బట్టి తన మాటలు విన్నారని గ్రహించి మెల్లగా వారిపక్క నుంచి వెళ్ళబోతోంటే "బాబూ..." అంటూ అతడి భుజంమీద చెయ్యేశారు నీలకంఠరావుగారు.

ఆశ్చర్యంగా చూశాడు.

వాత్సల్యంగా అతణ్ని చూసి భుజంతట్టి "నా గదిలోకి రావయ్యా...మాట్లాడాలి" అంటూ తీసుకెళ్ళి "కూర్చో బాబూ" అన్నారు.

సుధ కూర్చున్నాడు.

కొన్ని క్షణాలాయన పచార్లు చేసి అన్నారు, "నీలో నేనివాళ ఓ గొప్ప వ్యక్తిని చూశాను బాబూ. నువ్వు మా రాంబాబు కొడుకువైనందుకు నేను చాలా సంతోషిస్తున్నాను, గర్విస్తున్నాను కూడా. నీకు తెలీకపోవచ్చుగాని రాంబాబూ, నేనూ ఆప్తమిత్రులం. అన్నదమ్ముల్లా కలిసివుండేవాళ్ళం. మా బంధం అంత కంటే వున్నతమైంది. ఇప్పుడా బంధమే మరో రూపంలో గట్టిపడాలని నా కోరిక బాబూ. అన్నకంటే ఎక్కువైన రాంబాబు నా వియ్యంకుడు కావాలని నా ఆశ, ఆరాటం...."

"మీ అమ్మగారు కాదనరని నాకు తెలుసు. నీలాటి వరుడికోసమేనయ్యా నేను దేశమంతా గాలిస్తున్నానూ. మా శ్రీకి కొంచెం గర్వం ఎక్కువయినా అదో పిచ్చిపిల్ల బాబూ. ప్రథమ కోపం ఎక్కువ. తనకోసంకన్నా ఇతరులకోసమే ఎక్కువ ఖర్చుపెడుతూంటుంది. దాని తప్పుల్ని క్షమించి సరిదిద్దగలవాడివి నువ్వేనని మాకు నమ్మకంకలిగి చేతులుపట్టుకుని అర్థిస్తున్నానయ్యా. మీరు ప్రేమికులని తెలుసు. కాని కొన్ని ఆకాశరామన్న ఉత్తరాలవల్లా, కొందరు ద్రోహుల విష ప్రచారంవల్లా మా శ్రీప్రవర్తననీ,తద్వారా నిన్నూ శంకించినా ఇవాళ మనస్ఫూర్తిగా మీ పెళ్ళికి మా అంగీకారం తెలియజేస్తున్నాను బాబూ. కేవలం నీవల్లే మా శ్రీ జీవితం స్వర్గతుల్యమవుతుందని భావిస్తూ మీ ప్రేమని ఆశీర్వదిస్తున్నాం. కాదనకు బాబూ" అతడిచేతులు పట్టుకుంటూ అన్నారాయన.

"ఇప్పటికీ శ్రీ నన్ను ప్రేమిస్తోంటే నాకేం అభ్యంతరం లేదండీ" అన్నాడు సుధాకర్ శ్రీ వంక నిశితంగా చూస్తూ.

"చాలు బాబూ..ఆ మాట చాలు. శ్రీని నేను కనుక్కుంటానుగా" కళ్ళు తుడుచుకుంటూ అన్నారు నీలకంఠరావుగారు.

తలొంచుకుంది శ్రీదేవి అంగీకార సూచకంగా.



# హాస్య కథలు

## కొత్త మాత్ర

కొందరికి సిగరెట్లు, టీ, కాఫీలు ఎలా అలవాటో రంగరాజుకి టాబ్లెట్లు మింగడం అలా అలవాటు.

పనిలో అలిసిపోతే ఓ మాత్ర!

సత్వర శక్తి పొందేందుకు మరో మాత్ర!

నిద్రపోవడానికి ఇంకో మాత్ర!

మేలుకుని వుండటానికీ మాత్రే!

ఆకలి వేసేందుకు మాత్ర! ఆకలి ఆగేందుకు మాత్ర!

తుమ్మొస్తే మాత్ర... దగ్గొస్తేమాత్ర!

వళ్లు వేడిచేస్తే ఒక మాత్ర–వళ్లు చల్లబడిందని మరో మాత్ర!

అలా రోజుకి అతను వాడే రకరకాల మాత్రలు ఒక కవరులో, అతని జేబులో సదా సిద్ధంగా వుంటాయి.

ఒకే కవరులో వున్న ఆ విడివిడి మాత్రల్ని ఏది, దేనికనేది రంగరాజు ఎలా గుర్తుంచుకుంటాడో చెప్పడం ఆ బ్రహ్మకి కూడా అసాధ్యమేనేమో!

విదేశాలలో బేన్‌చేసిన టాబ్లెట్లు కూడా కొన్ని మనదేశంలో అమ్ముతున్న చేదు వాస్తవాన్ని రంగరాజుకి తెలియ జెప్పి, "ఇలా విపరీతంగా మాత్రలు మింగడం వల్ల కంచే చేను మేసినట్లు, ఆరోగ్యాన్ని కొనుక్కునే ప్రయత్నంలో అనారోగ్యం పాలవాల్సివస్తుంది" అని నా శాయశక్తులా అతన్ని హెచ్చరించేవాణ్ని!

అతను పెడచెవిని పెట్టినా తోటి వాడిగా, స్నేహితుడిగా నా ప్రయత్నం మానలేదు.

అలాంటి సమయంలో...

తుఫాను రావడం, అది వచ్చిన రోజే రంగరాజు దగ్గిర మాత్రలు అయిపోవడం నా ప్రయత్నం ఫలించడానికే అని తోచింది.

తుఫాను ఎడతెరిపి లేకుండా మూడు రోజులపాటు కొనసాగింది, అందరినీ ఇళ్ళల్లో బందీలను చేసి.

అది ప్రారంభమైన రోజు రంగరాజు ఉదయం 8 గంటలకి, "తలనొప్పి అదర గొట్టేస్తోంది. ఏదైనా మాత్ర వుంటే ఇవ్వు గురూ! నా దగ్గిర అయిపోయాయి" అంటూ వచ్చాడు, ఇంటిముందు కామన్‌గా వున్న వరండాలోంచి.

"నేను సాధ్యమైనంతవరకూ చిన్నచిన్న వాటికి మందులు వాడనని తెల్సుగా! నాదగ్గరెందు కుంటయ్? అయినా హాయి శుభ్రంగా వేడివేడి కాఫీ పెట్టించుకుని తాగు. తల నొప్పి అదే ఎగిరిపోతుంది" అని నాకు తోచిన సలహా చెప్పాను.

"ఈదురుగాలి, వర్షం చూస్తే బైటకు కదలనిచ్చేట్టులేవు. మాత్రలకోసం నేను సాహసించి బైటికి వెళ్ళినా మందుల షాపులు తెరిచివుంటాయో, లేదో? ప్చ్!" అనుకుంటూ అతను తమ వాటాలోకి వెళ్ళిపోయాడు.

నేను సంతోషించాను– ఈవిధంగా





రంగరాజు మాత్రల వాడకం మానేసే రోజొచ్చిందని.

అరగంట తర్వాత మళ్ళీ వచ్చాడు అతను.

"లాభం లేదు గురూ! కాఫీ తాగినా తగ్గలేదు" అంటూ.

"నీకు పీటికీమాటికీ మాత్రలు వాడే అలవాటుండటం వల్ల అలా అనిపిస్తోం దంతే! ఈ వాతావరణంలో ఎలాగూ ఆఫీసుకి ఎగనామమే కదా! హాయిగా ముసుగెట్టుకుని పడుకో పోయి!" అని ఓదార్చి పంపాను.




మరో రెండు గంటల తర్వాత అతను మొహంలో 'బాధపడుతున్న ఫీలింగ్' అలాగే పెట్టుకుని వచ్చాడు.

"ఏం...ఇంకా తగ్గలేదా?" అనడిగాను.

"తలనొప్పి తగ్గిందిగానీ, కడుపు నొప్పి మొదలైంది" అన్నాడు.

నేను మనసులో నవ్వుకుని, నాకు తోచిన చిట్కా సెలవిచ్చి పంపాను.

ఇలా తుఫాను వున్న మూడురోజులూ అతను అనేక కంప్లైయింట్లతో రావడం, నేను డాక్టర్‌లా 'చిట్కా వైద్యం' ప్రిస్క్రయిబ్ చేయడం...

తుఫాను వెలసినరోజు ఇద్దరం కలిసి బైటకు బైలుదేరాం. తుఫాను పరిణామాల్ని చూసే ఆసక్తితో నేనూ, టాబ్లెట్లు కొనుక్కోవాలనే ఆత్రంతో అతనూ- అతన్ని మార్చే ప్రయత్నం ఎంత వృధా ప్రయాసో అప్పుడర్థమైంది నాకు!

బజారులో ఓ హోటల్ దగ్గిర వెయింగ్ మిషన్ కనబడి, ఈ మూడు రోజుల్లో బరువు ఏమాత్రం మారిందో చూసుకోవాలనే ఆలోచనతో అటువైపు నడిచాము.

నా బరువులో మార్పేమీ లేదు.

రంగరాజు వెయింగ్ మిషన్‌లోంచి వచ్చిన టిక్కెట్టు చూసి, "అరె! నా బరువు 75 కిలోలుంది. సరిగ్గా తుఫాను రాకముందు రోజు చూసినప్పుడు 71 కిలోలుంది. ఈ 3 రోజుల్లో 4 కిలోలు పెరిగిందన్నమాట" అన్నాడు.

"చూశావా? నువు టాబ్లెట్లు వాడక పోవడం వల్ల ఎంత మేలు జరిగిందో?" అన్నాను నేను-అతని అలవాటుమాన్పించే ప్రయత్నంలో.

"బరువు పెరగడం మంచి ఎలా అవుతుంది? ఈ లెక్కన లావెక్కితే, గున్న ఏనుగులా మారడానికి ఎంతో కాలం పట్టదు. ఇకనుంచి నేను బరువు పెరగకుండా ప్రతిరోజూ ఓ మాత్ర వాడాలన్న మాట!" అన్నాడు రంగరాజు.

వళ్లు మండిపోయిన నేను అప్పుడు అనాల్సిన మాట ఎంత ఘాటుగా ఉండాలా అని ఆలోచించసాగేను.

—జాకీ

# సన్నాసుల మఠం

పండుగడ్డాన్ని సుతారంగా నిమురు కొంటూ గంభీరంగా నవ్వారు దివ్య వేదాంతానందస్వామివారు.

ఆయనకెదురుగా చేతులు కట్టుకొని వినయంగా నిల్చొనివున్నాడు వెంకన్న—

"సామీ! నాకో సందేహం వుంది... అడగనా?" అంటూ.

"ఒకటి కాదు...వెయ్యి అడుగు" అన్నట్లు చిన్మయానందంగా చూశారు స్వామివారు.

"స్వామీ! సొరగం, నరకం అన్నవి అసలు ఉన్నాయా?"

"ఎందుకులేవూ? నిస్సందేహంగా ఉన్నాయి"

"సామీ...నేను రోజూ సాయంత్రమయ్యేసరికి కడుపునిండా కల్లు తాగకుండా ఉండలేను. ఆ తర్వాత రంగమణి రికార్డుడాన్సు చూడకుంటే పిచ్చెక్కిపోద్ది. ఇక రాత్రయ్యేసరికి ఏ రత్తాలో, సీతాలో పక్కలో లేకుంటే నిద్దరే అట్టదు...మరి చచ్చాక నేనేడకు బోతాను సామీ?"

"ఇంకెక్కడికి? నరకానికే!"

"మరి రికార్డాన్సు చేసే ఆ రంగమణి?"

"అదీ నరకానికే"

"మరది డాన్సు చేసేటప్పుడు తబలా వాయించే రంగడూ, రికార్డులు పెట్టే అప్పడూ?"

"వాళ్ళూ నరకానికే!"

"మరి ఆ రత్తాలూ, సీతాలూ వాళ్ళంతా?"

"ఓరిపిచ్చోడా వాళ్లుమాత్రం ఎక్కడికెళ్తారూ? నరకానికేరా!"

కాస్సేపు బుర్ర గోక్కుంటూ కూర్చున్నాడు వెంకన్న.

"సామీ...మరి ...మరి తమరూ?"

'మూర్ఖుడా!' అన్నట్లు కోపంగా చూశారు స్వామివారు.

"నీకా సందేహమెందుకొచ్చింది? నేను స్వర్గానికే వెళ్తాను"

"మరి మన గుడిపూజారి దీచ్చితులు గోరు?"

"ఆయనకూడా! ఆయనేకాదు వెంకటాపురం బాబా, సత్తెపాలెం అమ్మ, మర్రిపాలెం మరిడమ్మ...అందరూనూ!"



ఆలోచిస్తూ బుర్రొంచుక్కూర్చున్నాడు వెంకన్న.

"ఏమిటాలోచిస్తున్నావ్? ఈ తాగుడూ, డాన్సులూ అన్నీ మానేసి హాయిగా స్వర్గానికెళ్ళిపోదామనిపిస్తోందా?" స్వామివారు చిరునవ్వుతో అడిగారు.

"స్వర్గమా! మీలాంటోళ్ళందరూవుండే ఆ సన్నాసుల మఠానికి ఎవరెళ్తారు సామీ! హాయిగా నా పాపాలు నేను చేసుకొంటూ... ఆ సీతాలూ, రత్తాలూ అందరూ వుండే నరకానికే పోతా!" తాపీగా జవాబిచ్చాడు వెంకన్న.

—అవధానుల విజయలక్ష్మి

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly
Eenadu Compound, Hyderabad - 500 004.

